# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



అక్టోబరు 1971



సంపుటము : 48 : సంచిక : 10 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## అక్టోబరు 1971





# అరుదైన పక్షి

శ్రీ వక్కలంక వెంకట కృష్ణారావు

పక్షులు,
 ఎన్నో పక్షులు !
రకరకాలవి, రంగు రంగులవి
అరుస్తూ, ఆడుతూ
పరుగులు పెడుతూ,
పాటలు పాడుతూ
కేరింతలతో, కలకల ధ్వనులతో
ఇటుచూస్తే, అటుచూస్తే
ఎటుచూస్తే అటువైపే
సరసాలలో, సయ్యాటలలో
ముద్దాడుకుంటూ, క్రీడిస్తూ
ఆటల, పాటల
పోటీపడుతూ
వింతరంగుల, విచిత్రరవముల
ఎన్నోపక్షులు, ఎన్నోపక్షులు.
ఎన్నెన్నో పక్షులు;
అన్నీ రెక్కల్లు లేనివి
ఏమాత్రం ఎగరలేనివి !

ఎక్కడో
ఒకేఒక చిరుచీకటి మూలలో
ఒకటిగా
ఒంటరిగా,
తీవ్రదృక్కులతో
వియత్‌శిఖరాల నందుకోవాలని,
పాతాళాఖాతాలలోనికి చొచ్చుకొని పోవాలని
సాలోచనగా ఆలోకిస్తూ
దేనికోసమో అన్వేషిస్తూ
అరుదైన చాటు మూలలో
అప్పుడప్పుడు
తనచుట్టూ పక్షి తతిని
 జాలిగా పరికిస్తూ
పక్షరహిత పృష్ఠభాగాన్ని
కన్నీళ్ళ చూపులతో
తడుముకొంటూ
నిర్మల తపస్విని వంటి
పలకని పక్షి,
ఒకే ఒక్క
ఒంటరి పక్షి.

దానికి
రెక్కలు నిర్మించుకోవాలని
తపన.
తన చుట్టూగల
చీకటిని భేదించాలని
ఆరాటం.
బీటలు వారిన బీడులను
ఆకులు రాల్చిన మోడులను
ఫలవంత మొనర్చాలని
సంతత వసంతం కొనితేవాలని
ఆకాంక్ష.

ఏవో
సుదూర శాశ్వత ఉన్నత లోకాలనుంచి
ప్రసరించే దీప్తి మయూఖాలను
తనలో ఇముడ్చుకొని
అరుణోదయ కిరణ్మయ సౌందర్య లహరిని
పరివేష్టిత పరమాణువులలోను
నిఖిల విశ్వంలోను
ఆ వెలుగుల దారుల వెంట
అన్వేషిస్తుంది ఆతృతతో;
ఎల్లెడలా
ఆమె ఉనికిని
అజస్రమైన
ఆమె మనికిని
ఆనంద పారవశ్యంతో
దర్శిస్తుంది.

మరుక్షణంలో,
పరిపూర్ణంగా,
బలమైన రెక్కలు నిర్మించుకొని
స్వేచ్ఛతో, విసురుగా
అధో మధ్యంనుంచి
నభో మధ్యానికి
దివ్యతేజో కిరణంలాగ
ఎగురుతుంది :
తారకల దరహాసాల చిరుకెరటాలలో నుంచి
మేఘాల మేలి జలతారు పరదాలను చీల్చుకుంటూ
అత్యున్నత ధవళ విశ్వ శిఖరాగ్రాలను
అందుకొనే యత్నంలో
అనంతాకాశం
అంచుల అందచందాలని
అనురాగంతో స్పృశిస్తూ

ఉత్కృష్ట లోకాలకి
పయనిస్తూంటుంది;
దిగ్భిత్తికల మార్మ్రోగే
అమృతగీతాలు ఆలపిస్తూ
అందమైన ఇంద్రచాపాన్ని
సుందరంగా చుంబిస్తుంది.

ఎవ్వరూ ఎగరలేని
ఎత్తులకు ఎగిరిపోతూ
ఒరులకు అలవిగాని
విచిత్ర విన్యాసాలు చేస్తూ
సజీవతిగ్మాంశుతీక్ష్ణప్రసరణతో
జీమూత తమాల ఛ్ఛాయా సంకీర్ణాలను
సర్వసంహార మొనర్చి
తమోమధ్యంలోని
పక్షిసమూహాలను
దివ్యతేజో చైతన్యం వైపు
పురోగమింప చేస్తుంది.

సమయాన్ని శాసిస్తుంది
ప్రభంజనాల్ని ఆదేశిస్తుంది
మరణాన్ని ఉరితీయించి
విషసర్పాలను విశ్వబహిష్కృతం కావించి
ఐహిక సింహాసనాన్ని
అధిష్ఠించకుండా
అఖిల జగత్తును
పరిపాలిస్తుంది.

అద్వితీయమై
అరుదుగా
అపూర్వంగా
అవనీతలంమీద

అవతరిస్తూంటుంది
అమరమై
అందంగా
అజరమై
ఆనందంగా
సత్యమై
నిత్యమై
నిలిచి పోతుంది
మౌని పక్షి
ఏకైకమైన
విహాయ సోత్తర సంతతోద్భాసిత జోతిర్మండలం
లాగ.

---



# హృదయాల్లో ముద్రలువేసే జానపద గీతాలు

శ్రీ దేవరాజు మహారాజు

జానపదగేయాలు జానపదుల ఉద్వేగోత్సాహాలకు కళా రూపాలు. పల్లెల్లో జరిగే ప్రతిఉత్సవానికి కార్య క్రమానికి సంబంధించిఉండే ఈ గ్రామీణుల పాటలు వారి దైనందిన జీవన ప్రవృత్తిని తెలియజేస్తాయి.

ఈ జానపదగీతాలు ఒక కవిగాని కవయిత్రిగాని వ్రాసినవికావు. పల్లెప్రజానీకపు హృదయాల్లోంచి పద జాలంగా వెలువడినవి. అవి ఎందరి నోళ్లలోనోపడి వాతావరణంతో మారుతూ నిలిచినవి.

అసలైన జాతిజీవం చూడాలంటే పల్లెకు వెళ్లాలిఅని అంటారు. ఎందుకంటే అక్కడ పట్టణా లలో లాగా సంపర్కదోషం చాలావరకు ఉండేదికాదు. అక్కడి ప్రజలు పరస్పర అనురాగాలతో ఒకే కుటుంబంగా వుండేవారుగనక; ఆటోపంలేని ఆటలు, మాటలు, అసత్యాలకు పాల్పడని పాటలు, ఆడంబరం లేని అలంకరణలు అమాయకత్వం అక్కడ కనిపించేవి నక. కాని పల్లెలుకూడా పట్టణాల్లాగా మారుతున్న రోజుల్లో పైన చెప్పినవన్నీ ఇప్పటికీ ఉన్నాయని చెబితే అధికధైర్యంచేసిన వాణ్ణవుతాను.

ఈమధ్యే భువనగిరి, వడపర్తి, దేవరకొండ, చాడ, ఆత్మకూరు, సూర్యాపేట లాంటి తెలంగాణా లోని ప్రదేశాలకు వెళ్లినపుడు జానపదగేయాల సేక రణకై అక్షరజ్ఞానంలేని పిల్లల్నిపిలిచి పాట పాడమంటే 'పచ్చగడ్డికోసేటి పడుచుపిల్లా'అంటూ సినిమాపాట పాడా రో చోట. అంటే ఎక్కడవిన్నా సినిమాపాటలే గనక అవి నోటికొచ్చేస్తున్నాయి. అంటే ఓవిధంగా జానపదగేయాలపై ప్రభావం చూపుతున్నాయనవచ్చు.

పల్లెప్రజల హాస్యాలు, సరసాలు, ప్రోత్సాహాలు అన్నీ అమాయకధోరణిలో ఎంతో ఆహ్లాదాన్ని కల్గి స్తుంటాయ్. సులభంగా బోధపడేభాషలో అందరికి అందుబాటులోవుండే భావాలతో ఒక చక్కని సహజ ధోరణిలో వుంటాయి ఈ పల్లెపాటలు.

అందుకే ఓచోట అంటాడు అలెగ్జాండరు యాకర్పీ క్రాఫే—'జానపద సాహితి వారివారి ఆచా రాలను, నాగరికపు విలువలను ప్రతిధ్వనించే సాహిత్యం అని.

అలాగే ఆ 'పాటల్లో అందాలన్నీ సెంటిమెం ట్లతో అల్లుకుని హృదయాన్ని సమీపిస్తాయి' అని ప్రజావాఙ్మయగ్రంథానికి ప్రస్తావనరాస్తూ అన్నారు— శ్రీ చలం.

ఆ పాటల్లో కవిత్వ లక్షణము, భాషామార్ద వము వున్నాయని గ్రహించినప్పటినుండే, మనవాళ్ళు వాటి పునరుద్ధరణకోసం ప్రయత్నించారు. కాని ఈ ప్రయత్నం చాలదు. ఇంకా విస్తృతంగా కొనసాగిం చాలి. ఎందుకంటే ఇప్పుడుమనం నాగరికత అనే మేడపై ఉన్నాం. మనం పైకిరావడానికి సహాయపడిన మేడమెట్లు కూలిపోతుంటే వూరకొంటామా? ముమ్మాటికీ వూరకోం!

జానపదగీతాల్లో జాలి, కరుణ, హాస్యం, సంతోషం, బీభత్సం ఒకటేమిటి అన్నిరకాల అను భూతులు, రసాలు మనకు కనిపిస్తాయి. ఈ క్రింది కోలాటం పాటలో ఒక యువతి మధురమైన ఒక సంఘటనను తన చెలికత్తెలకు ఎంత చక్కగా తెలుపు కుంటున్నదో!

1. 'ఓ చెలియలార! ఓ చెలియలార!
నే గంధర్వ కన్నెలాగ గంగకు పోతుంటే,
నా బుంగలో దూరిందే గండు తుమ్మెదా

సేళ్ళబుంగలో దూరిందే గండుతుమ్మెదా
॥ ఓ చెలి ॥

కోడూరి శింతల్లో కోలాట మాడంగ
నాకొంగులో దూరిందే కొంటెతుమ్మెద
॥ ఓ చెలి ॥

అమ్మ అన్న వెళ్ళదు అయ్య అన్న వెళ్ళదు -
ప్రియుడవంటె వెళ్ళెనే కొంటెతుమ్మెద
॥ ఓ చెలి ॥

మన్నెవారి తోటలోన మల్లెలు కోయబోతె
నాచెంప కొరికిందె నల్లతుమ్మెద ॥ ఓ చెలి ॥

అమ్మఅన్న విడువదు అయ్యఅన్న విడువదు
మొగుడంటె విడిచెనె గడుసుతుమ్మెద
॥ ఓ చెలి ॥

హృదయంలోంచి వచ్చే ప్రేమకి, అందానికి రంగులుపూయక ఎంత స్వచ్ఛంగా తెలుపుకున్నది! మరోపాటలో జానపదులు శ్రీ కృష్ణుని గోపికావస్త్రాపహరణం ఘట్టాన్ని ఎంతో సూటిగా తెలుపుతున్నారు. ఈ పాటలో ఏదో అమాయకత్వం, యువతుల కలికితనం, గోపయ్య చిలిపితనం మన మనసుల్ని కితకితలు పెడుతుంటుందనడం పచ్చి నిజంలాంటి ఖాయం.

2. 'అత్తగారు తోడిచ్చిన—అగ్గినాల బాయి
గోగుమల్లె సుందారి—అగ్గినాల బాయి
తల్లిగారు తోడిచ్చిన—దర్శినాలబాయి
గోగుమల్లె సుందారి—దర్శినాలబాయి
పెద్దరాశి కోడండ్లు ఏడుగు రారాండ్లు
గోగుమల్లె సుందారి ఏడుగు రారాండ్లు
ఏడుగురారాండ్లు నీళ్లా కెళ్లీరీ
గోగుమల్లె సుందారి నీల్లా కెళ్లీరి
సర్వతా దీసుకా సంకా బెట్టుకా
ఏడుగురు బానల్లు నీళ్లా ముంచీరి
శిన్నచెల్లె కావఁరాతి గడ్డ ఎక్కిందిం
ఎక్కడా సుశినా ఏమీలేదక్కా
శీరెల్లు విడిసిరీ కుప్పాడ బెట్టిరీ
రెకల్లు విడిశీరీ ముల్లాడబెట్టిరీ
ఏడుగురారాండ్లు సీలల్లు మునీగ్గిరీ
తానము సేశినంక ఒడ్డాకు ఒచ్చిరి
శిన్నశెల్లె కావఁరాతి గడ్డ ఎక్కిందిం
అక్కా మన శీరెల్లు ఇక్కాడలేవు
నిన్నమొన్నాడిన పొన్నాల సూడే
నిన్నమొన్నాడిన పొన్నాల లేవే
నిన్నమొన్నాడిన జామల్ల సూడే
నిన్నమొన్నాడిన జామల్ల లేవే
నిన్నమొన్నాడిన నిమ్మల్ల సూడే
నిన్నమొన్నాడిన నిమ్మల్ల లేవే
అక్కా మన శీరెల్లు ఇగోయె అక్కా
పొన్నశెట్టుమీద పొందె కుష్ణుడూ
పసులకాడ కిష్టయ్య పలుగాకివాడూ
సీరెలియ్యి ఓసామి సీరెలియ్యి సామి!
మామ తిట్టాడు సీరెలియ్యి సామి!!
మామాకు జనికేటి కోడండ్లె మీరు
మా అత్త తిడ్తాది సీరెలియ్యి సామి
అత్తలకు జనికేటి కోడంన్డె మీరు
పసులకాడి కిష్టయ్య పలగాకివాడు
మా అమ్మ తిడ్తాదిర సీరెలియ్యి సామి
అమ్మలకు జనికేడి బిడ్డలే మీరు
మా నాయ్న తిడ్తాడు సీరెలియ్యి సామి
నాయ్నలకు జనికేటి బిడ్డలే మీరు
శినశెల్లె కమఁరాతి పబ్బాతిబట్టె
పసులకాడి కిష్టయ్య పలగాకివాడు
శీరెలియ్యి ఓసామి శీరెలియ్యి సామి ॥'

(కమఁరాతి = చినచెల్లె పేరు, పబ్బాతి = మొక్కుట.)

పల్లెపాటల్లో ఏ కఠిన పదజాలమో కావ్యాలంకారాలలో ఎఱువు తెచ్చుకొన్న అసహ పాండిత్యమో ఏమాత్రంకాదు. పాటల్లోనే లయ ఉంటుంది. వాటికి వేరే సంగీతంకూర్చే పనిలేదు.

అవి అంత గమ్మత్తుగా హృదయాల నత్తుకొనగలవు. ఎందుకంటే అందులో అనుభవంలేని

సన్నివేశంగాని; కష్టమైన మాటలుగాని, పరిచయం లేని అనుభూతిగాని భావంగాని వానిలో వుండదు.

ఈ క్రింది దంపుడుపాట చదివాక నవ్వురాక మానదు. ఎందుకంటే వాళ్లన్నయ్య వదిన్ని అలాచేశాడుట మరి! దానికి మనమేంచేస్తాం చెప్పండి.

3. 'చిన్నాది మంచంబు సన్నాదినులుక ఆహా
దానిమీద పండేటి జానలెవ్వారె ఆహా
పనిజేసి వదినెమ్మ అలసిపన్నాది ఆహా
కొబ్బెర తిన్నాది మబ్బుగొన్నాది ఆహా
దసట కొంగులతోటి విసిరిలేపన్నా ఆహా
విసిరినా లేవదు విరజాజి మొగ్గ ఆహా
విసనకఱ్రలతోటి విసిరి లేపన్నా ఆహా
విసిరినా లేవ దీ ముద్దాల గుమ్మా ఆహా
సానమీది గంధం సల్లిలే పన్నా ఆహా
సల్లినా లేవదే ఈ సత్తెభామ ఆహా
వత్తరు పన్నీరు సల్లి లేపన్నా ఆహా
సల్లినా లేవ దీ సౌదర్ల పట్టి ఆహా
కొబ్బరి తిన్నాది మబ్బుగొన్నాది ఆహా
కొబ్బరి కాయలు కొట్టిపెట్టన్నా ఆహా
పెట్టినా లేవదే ఈ కొంటె పిల్ల ఆహా
బఱ్రె పలుగుతోటి బాది లేపన్నా ఆహా
బాదినా లేవదే ఈ బఱ్రె పడ్డా' ఆహా

ఎంతమొద్దు నిద్దురయితే మాత్రం అంత మాటంటాడా అని అనుకోవచ్చుగాని ఆవిడ అంతకు ముందు ఏఏ కోరికలుకోరి అలిగి పడుకుందో చూద్దామా—

4. 'శిన్నశెల్లె నమ్ముకొని శీటిశీరె దేర
శిగలాయి పువ్వు దేరా
పెద్దశెల్లె నమ్ముకొని పెయిరైక దేర
పేటంచు శీరెదేర
నడిపిశెల్లె నమ్ముకొని నడుమువొడ్డాలం దేర
నల్లంచు శీరెదేరా
కనతల్లి నమ్ముకొని కల్లుబొట్టు దేర
లేకుంటె ఊకె రారా'.

ఇది కలుపుపాట.

అన్నెం పున్నెం ఎరుగని పడతికి నాగస్వరనాదం వినేసరికి నడుము జల్ జల్ అందిట. అవును మరి పిల్లనగ్రోవివిన్నా నాగస్వరంవిన్నా ఆ మంజుల స్వరాల మధురిమకు శరీరంలోని ప్రతి అణువూ స్పందించక మానదు. సంగీతా న్నను భవించే గొప్ప హృదయం ఈ పడతిది. ఈ కోలాటం పాట చివర్లోని సున్నిత హాస్యం మన మనసుల్లోకి చల్లగా మంచులా దిగజారుతుంది.

5. 'పిల్లనగొయ్యి పాడుకుంట
పిల్లబాట కెల్లిరాంగ
పిల్లనగొయ్యి పిలుపుల కయ్యునా—రామయ్యా
పిక్కిలో జల్ జల్ మనెనయ్య
నాగసరం బాడుకుంటు
నడిబాటల కెల్లిరాంగ
నాగసరం నాదులకయ్యునా రామయ్య
నడుములో జల్ జల్ మనెనయ్య
వద్దనాపు అడవిలోనే నీ
అడుగు గురుతుబట్టి
మొగిలిపువ్వు అనుకోనయ్య రామయ్య
మొక్కి వొళ్లె దాసుకుంట్నయ్య
కుంచాన రూపాయలుపోసి
కుచ్చు చెప్పులకొంటె
సెప్పులిడసి సేతవట్టయ్య రామయ్య
సపుడూ గాకుంట రావయ్య
వొత్తుకుండా సాటుకు నేను
వొడిగొడిగి పండబోతె
..........................
అన్నెమెరుగ పున్నెమెరుగయ్య'

చేసేపనిలో ఆయాసం మరిచిపోవడానికి కలుపు దీసేటప్పుడు, వడ్లుదంచేటప్పుడు ఇలా ఎన్నో పాటలు పాడుతుండేవారు పల్లెజనం. అలాగే ఈ క్రింది పాట పిండివిసిరేటప్పుడు పాడేది. ఈ పాటలోని లింగుకు అత్తకొడుకు మీద ఎంత గాఢప్రేమో!

6. 'తంగేడు చెట్టుకింద లింగుబుట్టింది
లింగుకూ నీలుబోసి నీలంగిదొడిగి
నిన్నెవరికిత్తునే నా సిన్నిలింగు
కోమటోరికిత్తా పోతావే లింగు?
కోమటోరి కొల్తలు నే గొలవలేను
ఇంకెవరికిత్తునే నా శిన్ని లింగు?
బాపనోరికిత్తా పోతావే లింగు?
బాపనోరి మంత్రాలు నాకు రావమ్మ
ఇంకెవరి కిత్తునే నా శిన్నిలింగు?
బట్టాజుకిత్తాను పోతావే లింగు?
బట్టాజు కవిత్వం నాకల్లరాదు
ఇంకెవరికిత్తునే నాశిన్నిలింగు?
అత్తకొడుకుకిత్తే పోతావే లింగు?
అట్టైతే అడ్డెందు కమ్మ నే బోత.'

ఇదే ఇతివృత్తంతో ఇదే సన్నివేశంతో మరో కలుపు పాటకూడావుంది. ఇందులోనూ పాపం విరహిణి జలకాంత 'అయిలేసు నిడిసి ఆగలే' నంటుంది. అందుకే తల్లివద్దన్నా వినకుండా వెడుతుంది. ప్రేమ అనేది నాటుకోవాలేగాని హృదయంలో... ఎన్ని అడ్డంకులు నిల్చినా ఆగదు!

7. వర్తిపండ్లొన్చినాయె చెక్కరాతిబండ్లమీన
వవ్వ నేను బోతున్నానే చెక్కరాతిబండ్లమీన
॥ వర్తి ॥

వెవ్వరాని బోతున్నావే నా బిడ్డో జలకాంత
వెవ్వరాని బోతున్నావే నా బిడ్డా జలకాంత
అత్తకొడు అయిలేసే నా యవ్వొ నేబోత
॥అత్త॥
మామకొడుకు మల్లేసే నా యవ్వా నేబోత
॥మామ॥

వొద్దురాయె వల్లగాదె నా బిడ్డా జలకాంత
వొద్దురాయె వల్లగాదె నా బిడ్డా జలకాంత
అయిలేసు విడిశి ఆగలేనే నా యవ్వా
నేబోత ॥అయిలేసు॥

ఈ క్రిందది వద్దు దంచేప్పుడు పాడేపాట. ఇందులో రాధామాధవుల అనుబంధం అగుపిస్తోంది.

8. 'పున్నమివెన్నెల పూసికాయంగ అహాఁ
అన్నల్లా అక్కమ్మ ఆడ వచ్చింది అహాఁ
సుక్కల్లా సెందురూడు సూడవచ్చిండు అహాఁ
పట్టెనే బాలుడు పట్టెశాలికొంగు అహాఁ
నాయి కొంగులు పట్ట నాయంబుగాదు అహాఁ
మావోల్లు సూస్తేను మాటలొస్తాయి అహాఁ
మీవోల్లు సూడకుంట మాటరాకుంట అహాఁ
వొడిగట్టి వొడినిండ వోరాలు-|-వోసి అహాఁ
ఇయ్యి మీ వోరికిచ్చి సెలవడ్క రావె అహాఁ
గల్లుగల్లున వోయి గడసాటు నిలిచె అహాఁ
గడదీయె నాంచారి గడదీయవమ్మ అహాఁ
గడ గప్పున దీసి, మొగ్గమారాజు చూసె అహాఁ
నిన్నమొన్నటోలె లేదె నీ మొకము అహాఁ
సతికింది నీ మొకము సాయదేలింది అహాఁ
వొతికింది నీ మొకము వన్నెదేలింది అహాఁ
ఎంతబలవంతుడె నీ కొంగు వట్టినవాడు అహాఁ
తీరుమీద తీరు తీరు లెక్కడవె అహాఁ
శ్రీకృష్ణరాముడు నీ యల్లుడమ్మ అహాఁ
గొడుగుమీన గొడుగు గొడుగు లెక్కడివె అహాఁ
గోపాలకృష్ణుడు నా యల్లుడమ్మ.' అహాఁ

ఇవే కాకుండా జానపదగీతాలు భారత రామాయణాలలోని ఇతర పురాణాలలోని సన్నివేశాల నెన్నిటినో కళ్లకు కట్టచేస్తాయి. ఉదాహరణకు ఈ క్రింది 'కర్ణ జననం' చూడొచ్చు.

9. 'బాలా బాలోరిగిన్నె బాలోరిగిన్నె
బాలోరిగిన్నె— సందమామయ్యా
చింతపూవన్నెల శీరే గట్టిందో
శీరె గట్టిందో సందమామయ్యా
రాలెపూవన్నెల రయికె దొడిగిందో
రయిక దొడిగిందో సందమామయ్యా
బంగారు జలబిందె
సేతబట్టిందో సందమ్మామయ్యా

ఎన్ను డెల్లని బాల
నీలకెల్లిందో సందమామయ్య
సూరుడు సంద్రుడు
సూడవచ్చింద్రు సందమామయ్య
సూశినట్టుసూశి
జడవట్టిగుంజె సందమామయ్య
జడిదువు సూరీడ
సెన్లెల్లి నీకు సందమామయ్య
జడిడిసి సూరుడు
కొంగందుకోనే సందమామయ్య
కొంగిడ్వు సూరుడ
కోడల్ని నీకు సందమామయ్య
కొంగిడిశి సూరుడు
మట్టందుకోనె సందమామయ్య
మట్టేడువు సూరుడ
మగదల్నినీకు సందమామయ్య
గుట్టలు కెల్లొచ్చె
గూబిల్లుమనె సందమామయ్య
చెట్లల్లకెల్లొచ్చె
సెమటల్లు పట్టె సందమామయ్య
ఉరికల్ల కెల్లొచ్చె
కుశలయ్య బుట్టె సందమామయ్య
పారేటిసంద్రాన
పారేసినాదే సందమామయ్య
నాసుతుడు జలములో
సేమంగవుంటె సందమామయ్య
ఒకటి కొబరికాయ
ఒంటిగాకొడుదు సందమామయ్య
మూడు కొబరికాయల్
ముందుగకొడ్దు సందమామయ్య
ఐదు కొబరికాయ
లందంగకొడ్దు సందమామయ్య
పదుకొబరికాయ
లెద్దిరిచ్చి కొడుదు సందమామయ్య
తొమ్మిది కొబ్బరికాయల్
తొందరగకొడ్దు సందమామయ్య
పదికొబ్బరికాయల్
ఫలహారం బెడుదు సందమామయ్య

అలాగే రామాయణంలో రావణుడు సీతను అశోక వనంలోబంధించి రాముణ్ణి దూషిస్తూ తన్నాదరించమని వేడుకొంటూవుంటే— సీత రాముని విలువ తెలియ బఱచి నువ్వు నశింతువని శపించినంత పనిచేస్తుంది.

10. 'సుక్కాల పర్వతమూ కోలు
సూశినంతట లోనే కోలు
కమలాంచ గిరి కన్నా కోలు
కలదాయనో సీత కోలు
నాలంక వేలాయె కోలు
నన్నాదరించవే కోలు
పదుకోట్లది లంకా కోలు
వేలాయనో సీతా కోలు
మావారు మాయింట కోలు
మందోదరిలుండ కోలు
నీమీద బ్రమజెంది కోలు
నే నాస్తినో సీత కోలు
పొంగకు రన్నయ్యా కోలు
పొంగకు రోరన్నా కోలు
పొంగిన నీపొంగు కోలు
రాముల బాణాల కొంగు కోలు
ఏవూరు ఏపల్లె కోలు
ఎందున్న ఓరామ కోలు
నిను నమ్మితి రామ కోలు
రామ రా మనియుదవు కోలు
రాముల దలిసెదవు కోలు
రాముడేమి కావలెను కోలు
రగువుల వో సీత కోలు
రాముడు నాభర్త కోలు
లక్ష్మణుడు నా మరది కోలు
భరత శత్రుఘ్నులు కోలు
నా బావమరుదలు కోలు
నరు డనగ నీ మొగడు కోలు

ఒంటి శిరసువాడు కోలు
నా పాది శిరసులు కోలు
నన్నేలు ఓ సీతా కోలు
నా ఇరవై అస్త్రాలు కోలు
నన్నేలు ఓ సీతా కోలు
నీ పదిశిరసులు కోలు
పగిలిపోనూ రావణా కోలు
నీ ఇరవై అస్త్రాలు కోలు
ఇరుగిపోను రావణా' కోలు

ఇవే కాకుండా ఈ పాటల్లో కరుణ రసం కూడా ఉంది. చదివాక లేక విన్నాక అందులో విషాద ఘట్టాలు మన హృదయాలపైన వేసిన ముద్రలు చెరిగిపోవు; ఉత్తమసాహిత్యం ప్రయోజనం ఇంతకన్నా ఏముంటుంది.

అనాదినుండి అమాయకులు అన్యాయపరుల చేతుల్లోపడి ఏమవుతున్నారు? తుదకు అన్యాయపరులు ఎందులో కలిసిపోతున్నారన్న విషయాలు కలగాపుల గంగా ఈ కలుపుపాటలో కనిపిస్తాయి.

11. 'పొద్దువొయ్యి దేవుడు పొలమెల్లినాడు
దామపరి దమ్మన్న
పొలమెల్లినాడు
దామసరి దుమ్మన్న

దేవుడు బోయినంక దేవేమి సేసె
దామసరి దమ్మన్న
దేవేమిసేసె
దామసరి 'దమ్మన్న

బాలుకుని బువ్వెట్టి బడికంపినాదె ||దామ||
బడికంపినాదె ||దామ||

బంగారు జలబిందె సేత బట్టింది ||దామ||
సేతబట్టింది ||దామ||

తొలిబిందె గుమ్మరిచ్చి మల్లబిందెకు ||దామ||
మల్లబిందెకు ||దామ||
మంగిలి మైసాదు రానె వచ్చిండు ||దామ||
రానె వచ్చిండు ||దామ||

సేతుల జలబిందె పారవేసింది ||దామ||
పారవేసింది || దామ ||
పనుమటి అర్రల పట్టెమంచాలు ||దామ||
పట్టెమంచాలు || దామ ||
పట్టెమంచంమీద పరుపూలు పరిసి ||దామ||
పరుపూలు పరిసి || దామ ||
పరుపులమీద బల్లెల్లు పరిశి ||దామ||
బల్లెల్లు బరిశి ||దామ||
బరుగుమెత్తలమీద బరిగె మైసాదు ||దామ||
బరిగెమైసాదు ||దామ||
మైసాదు ఆదేవి కలిసిపోయ్యిండ్రు ||దామ ||
కలిసిపొయ్యిండ్రు ||దామ||

బడికిపోయిన బాలుండు బల్పంమర్శిండు||దామ||
బల్పం మర్శిండు ||దామ||
కొడుక రా కొడుక పొలిస్త రార ||దామ||
పొలిస్తరార ||దామ||
పొలొద్దు ఏమొద్దు నాయన రానియ్యె ||దామ||
నాయన రానియ్యె || దామ ||
పొలొద్దు ఏమొద్దని బాలు దురికిండు ||దామ||
బాలు దురికిండు || దామ ||
బాలునిగూడ ఉరికి, గుంజుకొచ్చింది ||దామ||
గుంజుకొచ్చింది ||దామ||

కుడిరొమ్ము ఇచ్చుకుంట కురులిప్పినాది
ఎడమరొమ్మిచ్చుకుంట ఎంటికలిప్పినాది
అంతలో బాలుండు నిదురబోయిండు

ఉప్పలా వా (ఆ) కత్తి ఊటకు నూరింది
పొలల్ల ఆ కత్తి పాటుగా నూరింది
కాలు సేతులు నరికి కలగూరలొండె
తలకాయ మొండెము దొంతుల్లదాసె
పొలంబోయిన దేవుడు ఇల్లు జేరిండు
కాలు జేతులు గడిగి కలెజూసినాడు
బాలుడేడే దేవి బాలుడేడమ్మా
బడికిబోయిన బాలుడు మల్లరాలేదు
బాలుడొస్తడుగాని అన్నం దినవయ్యా

తలకాయ మొండెము దొర్లుకుంటొచ్చె
కపటము దెల్సుకోని కత్తి పట్టిండు
దాన్ని నర్కి నాల్గు తున్కలు చేసిండు
వాకిట్ల వాతం (బొంద) దీసి పాతిపెట్టిండు.'

ఈ క్రిందిదికూడా విషాదగాథే. ఇందులో తన వాళ్ళని చంపుకొన్నైనా సరే, ప్రజలక్షేమంకోరే రాజు ఔదార్యం, మామమాట జవదాటని కోడలులోని భక్తి తత్పరత, మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి.

12. 'మొంటెంత మొగులాయె కోలు
శాటంత తెప్పొచ్చె కోలు
చెరువుకు హారము కోలు
ఎవరినిస్తావు రాజ కోలు
పెద్దకొడుకున్నైనా కోలు
ఇయ్యవయ్యా రాజ కోలు
పెద్దకొడుకునిస్తే కోలు
పేరు కెవ్వారు కోలు
నడిపి కొడుకు న్నైనా కోలు
ఇయ్యవయ్యా రాజ కోలు
నడిపికొడుకు నిస్తె కోలు
నాకు ఎవ్వాడో కోలు
చిన్న కొడుకున్నైన కోలు
ఇయ్యవయ్యా రాజ కోలు
చిన్నకొడుకు నిస్తే కోలు
సీత కెవ్వారూ కోలు
పెద్దకోడలు న్నైనా కోలు
ఇయ్యవయ్యా రాజ కోలు
పెద్దకోడలు నిస్తే కోలు
పేరు కెవ్వారు కోలు
నడిపికోడలు న్నైనా కోలు
ఇయ్యవయ్యా రాజ కోలు
నడిపికోడ ల్నిస్తే కోలు
నాకు ఎవ్వారూ కోలు
చిన్నకోడలు న్నైనా కోలు
ఇయ్యవయ్య రాజ కోలు
తలకన్ని పోసుకోయె కోలు
నాచిన్ని నాగూ కోలు
అప్పడే పోసుకున్న కోలు
ఓ మామగారు కోలు
పెట్టెలోని నగలు కోలు
పెట్టుకోయె నాగు కోలు
అప్పడే పెట్టుకున్నా కోలు
ఓ మామగారు కోలు
పెట్టెలోనె చీరె కోలు
కట్టుకో చిన్నినాగు కోలు
అప్పడే కట్టుకున్నా కోలు
ఓ మామగారు కోలు
నీల్ల బిందెత్తుకోని కోలు
నీల్లకెల్లావే కోలు
కోమటో లక్కమ్మ కోలు
నీల్లకొస్తారా కోలు
అప్పడె తెచ్చుకున్నాం కోలు
సుట్టుబట్టా సూడు కోలు
బాపనోల్లక్కమ్మా కోలు
నీల్లకొస్తారా కోలు
అప్పడే తెచ్చుకొన్నాం కోలు
పాదాల వరకొచ్చె కోలు
బిందె మున్కదు మామ కోలు
ఆసుంట పో నాగు కోలు
అవ్వగ్గణాలు కోలు
మోకాళ్లవరకొచ్చె కోలు
బిందె మున్కదు మామ కోలు
ఆసుంట పోనాగు కోలు
అవ్వగ్గణాలు కోలు
కుతుకల వరకొచ్చె కోలు
బిందె మున్కదు మామ కోలు
ఆసుంట పో నాగు కోలు
అవ్వగ్గణాలు కోలు
శిరసు మున్గజొచ్చె కోలు
బిందె మున్కదు మామ కోలు
ఆసుంట పో నాగు కోలు
అవ్వగ్గణాలు కోలు

అట్లాట్ల పొయేటి కోలు
అది పక్షుల్లారా కోలు
నన్ను గన్న తల్లికి కోలు
బిడ్డ లేదనిసెప్పు కోలు
ననుగన్నతండ్రికి కోలు
బిడ్డ లేదని సెప్పు కోలు
నాతోడి అక్కలకు అన్నలకు కోలు
చెల్లె లేదనిచెప్పు కోలు
నాతోడి తమ్ములకు చెల్లెలకూ కోలు
అక్కలేదని శెప్పు కోలు
నా ప్రాణనాధునికి కోలు
వందనాలని శెప్పూ కోలు
తొట్టెలోని బాలునికి కోలు
తల్లిలేదని శెప్పూ' కోలు

చివర్లో 'నా ప్రాణనాథునికి వందనాలనిచెప్పూ, తొట్టెలోని బాలునికి తల్లిలేదని చెప్పూ' అంటూ ఏన్నకోడలన్న మాటలకు ఎంత కఠిన పాషాణ హృదయాలైనా సరే, వెన్నెలా కరుగుతాయ్.

డాక్టర్ అరిపిరాల విశ్వంగారన్నట్లు 'సందేహాలు, సంఘర్షణ, అన్వేషణ సాఫీగా సాగకపోవడం ఏని జీవితానికి ఓ రీతిగా నిర్వచనాలు'...కాని అన్వేషణలోనే ఆ సంఘర్షణలోనే ఏదో సంతృప్తిని కల్గించుకొని దానినే మధురానుభూతిగా తలుచుకొని సంతోషంలో తేలడం ప్రతి ఒక్కరికీ ఎంతైనా అవసరం.

సాటి ఏరాండ్లకంటెకూడా చక్కనైనదానివి అంటాడు దేవుడు, శంకరయ్య. నువ్వేనా నిజమైన దేవుడివంటుంది—దేవిగౌరమ్మ. వాళ్లదెంత అన్యోన్యప్రేమ.

13. 'లాలి శెరువు కట్టమీద లవంగాలు పండినాయి
కోశి కుప్ప పెట్టరాదమ్మో గౌరమ్మో
కొయ్యరాదు కోసుకోవయ్యా శంకరయ్య
నీలిశీరె మేలిముసుగు నీనడుము పిడికెడంత
నీసాటి ఏరాండ్ల కన్ననో గౌరమ్మ
చక్కనైన చుక్క
నీవమ్మో గౌరమ్మ
నిజమైన దేవునివయ్యో శంకరయ్య
ఏది ఒక్కమాట సక్కనో శంకరయ్య
కాళ్లై కంచుంగరాలు కట్టింది ముండ్లోరి శీరె
రాళ్ళభూమి నడువబోకమ్మో గౌరమ్మ
రాజుకొక్క మాటదేకమ్మో గౌరమ్మో
నీలిగుర్రమెక్కినాడు నిమ్మకింద దిగినాడు
నీరాక కెదిరిసూశెనో గౌరమ్మ
దుబురు దుబురు ఎంటికాలు
గుంగురు గుంగురు ఎంటికాలు
దుశ్శు ముశ్శికొప్పు ఎయ్యయ్యో గౌరమ్మ
దువ్వరాదు దువ్వుకోవయ్యో శంకరయ్య!
ఎండి కొప్పు కెండదేకమ్మో గౌరమ్మో.'

వేడెక్కిన శరీరానికి చల్లని పానీయం అందించినట్లు వేడెక్కిన హృదయాలకు చల్లని మాటలు తమను ప్రేమించే లేదా అభిమానించే వాళ్ళు దగ్గర్నుండి వినవస్తే భార్య లేదా ప్రేయసి ఓ చిలిపి చూపు పారేసి ఓ కొంటె పలుకు విసిరితే ఆ పలుకు తొలికించిన మైకంలో ఎంత మత్తు! ఆనందానికి ఎల్లలు పెరిగిపోవూ?

జానపద కవిత్వం, భావకవిత్వానికి దగ్గరగా వుంటుంది. దాదాపు ఈ పాటల్లో భావాలెంతో అందంగా చిందులు వేస్తుంటాయ్. అనురాగం అనేది పల్లె ప్రజల గుండెల్ని ఒక్కదగ్గరగా కట్టేస్తుంది. అందుకే వాళ్లపాటల్లో జాలి ప్రేమ చోటు చేసుకుంటాయి.

ఈ పాటలకు తగినట్లుగా ఆడతారు పల్లె ప్రజలు. అవే జానపద నృత్యాలు. పాటలెంత అందంగా వుంటాయో నృత్యాలు మరీ ఇనుమడించి అందాన్ని చేకూరుస్తాయి.

పోగా జానపద గీత, సంగీత నృత్య, నాటకాలు జాతి సంస్కృతికి స్వచ్ఛమైన అద్దంలాంటివి. విభిన్న పద్ధతుల్లో ప్రయుక్తం చేయబడే ఈ కళారూపాలలోని వైవిధ్యం ఒకజాతి భావాలలోని భిన్నత్వంలోని ఐక్యతకు నిదర్శనం. ఒకనాడు సర్వప్రజలకు ఆనందాన్ని అందించిన ఈ ప్రక్రియలు తిరిగి తెలుగు జాతి చైతన్యానికి తోడ్పడగలవని ఆశిద్దాం.

---

# అంకితము

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి

అస్మదీయ రచన మచ్చగునందాఁక
నది యదంకితంబొ యన్య తెలుఁగ;
రతని కాసుమీఁది మతి నాకు లేకుంటఁ
గృతిపతియు నెఱుంగఁ డీ రహస్య.

తప్పేమీ యని యతనికిఁ
జెప్పకయ వెలార్తుఁ గృతిని; జెలికాండ్రకు వి
ద్యాప్తులకు నది పంపెదు
నప్పుడు కృతిపతికి నైత మంపెదఁ బేర్మిన్.

అతఁడు దానిఁ జూచి కృతమెఱుకం జాటు
కమ్మ నాకు వ్రాయుఁగాక వ్రాయ
కుండుఁగాక రెంటి నొక్కమైఁ జూచెద
'మాఫలే' షటన్నమాట నెంచి.

దేశసేవ నతఁ డతీవశ్రమమ్ములు
సైఁచెఁ గాన వాని సరణి మెచ్చి
కృతిపతిత్వ మిచ్చి యతని సంభావన
సేఁత యొకఁడ నాకుఁ బ్రీతిగూర్చు.

చిన్నచిన్నకృతులు కొన్నింటి నొకసారి
"పెద్దకా" పటన్నపేరు పెట్టి
వెలువరింపఁ బూని విభునిగా నెవ్వానిఁ
గూర్తు దీని కనుచుఁ గొంతతడవి.

దండియాత్రను బాపుజీ దళమునందు
నిలుచు భాగ్యమ్మునకు నోఁచి తెలుఁగువారి

## అంకితము

మదిని దోఁచిన యెర్నేని మహితవంశ
భవుని గంటి సుబ్రహ్మణ్య భావవీథి.

ఒక్కసీసముతో వాని నోడయుఁ జేసి
వీలు పొసఁగినయంతఁ దెనాలి కేగి
కృతిని ముద్రించి తోడ్తోడఁ బ్రతి నొకంటి
ననిచినాఁడ నెర్నేనికి [1]నంచెవలన.

తన సంగతి చూడక య
య్యనఘుఁడు కృతి నిరవుకొన్న యనాయ్యైకవితల్
గని వానిం బొగడుచు లే
ఖ నంప నవ్వుకొని పిదపఁ గథను మఱచితిన్.

మూఁడునాల్గు మాసములు చన్నవెనుక నె
ర్నేని యిట్లు వ్రాసె నెగులు తఱుమ
'రాష్ట్రకవివరేణ్య! రారాని పొరపాటు
వచ్చి నన్ను గ్రుడ్డివానిఁ జేసె.

మీ పంపించిన కృతిఁ బెద
కాపున నొకపొరట నపుడు కానక నాపై
మీ పఱపినకృప నెఱుఁగని
పాపముఁ జల్పితిని విధివిపర్యాసమునన్.

అలవోక నేఁడు కబ్బము
దిలకించుచు నంకితంపుఁ దీరుంగని నా
తొలిపున్నెముల ఫలం బా
పటు కని భావించి శిరమువంచితి మీకున్.

నిక్క మరయ నాకు నీకున్న గాంధేయ
బాంధవంబ యింతపని నొనర్చె
నిది భవిష్యదవధి నిరువుర [2]కెట్టి మో
దము ఘటింపఁగలదొ దైవ మెఱుఁగు.

---

1. పోస్టు 2. తర్వాత వీరికి 'ఆత్మకథ' నంకితము చేసితిని.

మన పొత్తు విస్తరిలుతన్ !
మన బాపూతపము విజయమంజుల మగుతన్ !
నను మన్ననచేసిన మీ
కనిదంపూర్వప్రశస్తి యగ్గంపడుతన్ !'

సుబ్రహ్మణ్యుని నుడులకు
న్రాశివిధానఁ బొంగె హర్షము నాలో;
న్రబము లిట్టివి కోర్కుల
సెబ్రకు దవ్వయిననాఁడె చేకుఱుఁ గవికిన్.

---



# జాన్‌పాల్ చేసిన బీరువా కథ...

## శ్రీమతి ఆర్. వసుంధర

'టేపులో నీ పాట తీసేసి కొత్తపాట, జానీమెరా నామ్ లోది, మంచిది పెట్టేశాడు అన్న...' పాప చెప్పింది.

గబగబా ముందు హాల్లోకి వెళ్లాను. రేడియోలో వస్తున్న పాటని చాల శ్రద్ధగా టేప్‌రికార్డర్‌లో రికార్డు చేసుకుంటున్నాడు బాబు.

'ఎందుకని నా పాట తీసేశావ్?' అనడిగాను.

'ఇష్' అన్నాడు నావేపు చూడకుండానే.

రికార్డింగ్ అయ్యాక 'మంచిపాట నాశనం చేసేశావమ్మా, రికార్డు చేసుకుంటున్నప్పుడు మాట్లాడేశావ్' అన్నాడు.

నా పాట పోగొట్టి ఇంకా పైగాను!

'అది పాతపాట. ఎవరిగ్గావాలి?' అన్నాడు.

'నాకు కావాలి. అందుకేగదా రికార్డు చేసుకున్నాను! అది తియ్యొద్దని చెప్పానుకదా' అన్నాను.

'అమ్మా, అది రికార్డుచేసి సంవత్సరం అయింది. ఒక్కనాడుకూడా నీయంతట నీవు దాన్ని పెట్టుకొని వినలేదు. అది టేపులోవుంటే నీకేం; లేకుంటే నీకేం?...మంచిపాట వస్తున్నది. తొందరలో దానిమీద పెట్టేశాను' అన్నాడు. అంతటితో ఆ సంభాషణ అయిపోయిందని తాను క్రొత్తగా పెట్టుకున్న పాటలు వింటూ కూర్చున్నాడు.

ఆ పాట పోయింది, ఇహరాదు. వాదించి లాభమేమిటి?

నా పాట పోయినందుకు నాలో నిరాశ. ఏదో విలువైనది పోగొట్టుకున్నానన్నబాధ. ఆ పాట ఉన్నా నేను పెట్టుకోను. ఎప్పుడైనా ఎవరైనా వరుసలో పెడితే వినడమే. అది ఎవరికీ అక్కర్లేని పాతపాట. నాకు కావలసినపాట. కావలసినదైనా నేను పెట్టుకోనిపాట. అది ఆ టేపులోఉంటే నాకేదో తృప్తి. ఇప్పుడు అది పోయినందుకు బాధ.

ఎందుకో ఆ పాట నాకు కావాలి. నాకు యిష్టమైందనికాదు. కాని నాకు కావలసింది. ఎందుకో అర్థంకాకపోయినా నాకు చాలా ముఖ్యమైనది.

'అడేపాడే పసివాడ...' అది ఏ సినిమాలోదో, ఎవరు పాడినదో, దానిలోని భావమేమిటో నాకు గుర్తులేదు. నాకు అక్కర్లేదు. ఆ పాట వింటూంటే నాలో గొప్పసంచలనం రేగుతుంది. ఉధృతంగా ఎగిరిపడుతున్న అలలతో, తుఫానునాటి సముద్రంలాగా అయిపోతుంది మనసు.

...ఎంతో ఆశించినదాన్ని పొందలేక విషాదభరితమైన జీవితంకల ఒక అమ్మాయి. ఆనందానికి ప్రతిరూపంగా కనిపించిన పసివాణ్ణి చూచి, ఎంతో ఆనందంతో పాడుతుంది ఆపాట. పాట అయిపోయే సరికి పిల్లవాడు దుర్మరణం పాలౌతాడు. మళ్లీ కటిక చీకటిలాంటి విషాదం ఆవరిస్తుంది...

ఆనందానికి విషాదానికీ గల సరిహద్దులో, రెండూ ఒకటయ్యేచోట ఆపాట. పాట వింటూంటే ఆనందమూ, దాని వెనుకనే పొంచివున్న విషాదమూ రెండూ ఒక్కసారిగా తీవ్రమౌతాయి. ఊపిరి సలుప నివ్వకుండా పెరిగి పెరిగి ఉక్కిరి బిక్కిరై పగిలిపోతుంది గుండె.

ఆ పాతపాట నాకు యిష్టమనికాదు. నేను నా అంతట ఎప్పుడూ దాన్ని పెట్టుకోను. కాని నాలోనే అందరాని లోతుల్లోఉండే సత్యానికి ప్రతినిధిగా అది అక్కడఉండటం చాలా ముఖ్యం...

మనిషి మనసు చిత్రమైనది. ఆపాట అక్కడ ఉన్నన్నాళ్ళూ నేను దానిగురించి తలచలేదు. కాని అది చెరిగిపోయేసరికి దానిగురించి యింతగా ఆలోచించు కున్నాను. అది మాటల్లేని మూగరాగమై నాలో నిలిచిపోయింది...

ఇంట్లో యింకో బీరువాఉంటే, నాకు ముఖ్యమైనవి పిల్లలచేతుల్లో పడకుండా భద్రంగా దాచుకో వచ్చును. కావలసినవి జారిపోకుండా, మాసిపోకుండా, చెరిగిపోకుండా, పోకుండా దాచుకోగలను.

ఈ యింట్లో నాకో బీరువా చాలా అవసరం.

*   *   *

'జాన్ పాల్ బలే టక్కరి వాడమ్మా'

మా యింట్లో పనులుచేసి వెళ్తుండే పని వాళ్లు ముగ్గురూ ఒక్కరకంగానే చెప్పారు. జాన్‌గురించి. ఆ విషయం నాకూ కొంచెం అనుభవమే. కాని 'తెలియని దేవతకన్నా తెలిసినదయ్యం మేలు' అన్న సామెత ననుసరించి నడుస్తుంది నాబుద్ధి.

బీరువాను రెడీమేడ్‌గా కొనాలంటే పాతిక మైళ్లవతలఉన్న పట్నంవెళ్లి కావలసిన సైజులో ఆర్డరిచ్చిరావాలి. షాపువాళ్లు యిప్పుడిస్తాం, అప్పుడిస్తాం అంటుంటే అక్కడకు నాలుగుసార్లు వెళ్లాలి. తర్వాత జాగ్రత్తగా పాక్‌చేయించి దెబ్బతగలకుండా బస్సుమీదనో లారీమీదనో తీసుకురావాలి. ఇంతాచేశాక వాళ్ళు రెండోరకం కొయ్యవేసి పైన చక్కగా పాలిష్ చేసి, ఘనంగా వార్నిష్‌వేసి, మసిపూసిచేసిన, మారేడుకాయ లాంటిది అంటగడితే ఎలాగా? చెక్క క్వాలిటీ మనం సరిగ్గా కనుక్కోగలమా ?

అద్దంలా మెరిసే అందమైన బీరువా కావాలి. కాని దానికోసం ఎక్కువ యాతన పడడానికి వోపికలేదు.

అటువంటి సమయంలో జ్ఞాపకం ఒచ్చాడు జాన్‌పాల్.

ఇదివరలో ఒకసారి పుస్తకాల షెల్ఫులు తయారుచెయ్యడానికి ఒచ్చినప్పుడు, ఎన్నాళ్లబట్టో మాయింట్లో వుంటున్న బుక్‌కేస్‌నుచూసి 'ఇది ఇంగ్లండులో దొరికే, పియానోలుచేసే, వాల్‌నట్ కొయ్యతో చేసింది ... అమ్మో, ఇదిక్కడ దొరికేది గాదు...అమ్మా, ఇది ఫారిన్‌చెక్క' అన్నాడు. ఆమాట లంటుంటే జాన్‌మొహంలో కనిపించిన గాంభీర్యాన్ని గౌరవభావాన్ని చూచి ఆ బుక్‌కేస్ గొప్పదనాన్ని ఊహించుకున్నాను. అల్లాగే ఒక పాత బీరువాను చూడగానే 'ఇది బర్మాటేకులో ఒకటోరకం' అని చెప్తూ, టేకుల్లో ఎన్ని రకాలు వాటి చరిత్రలగురించి ఒక ఉపన్యాసంలాంటిది యిచ్చాడు. కొయ్యల్లో ఇన్ని రకాలున్నాయని ఇదివరకు నాకు తెలియదు. జాన్‌మీద చాలా గౌరవంకలిగింది నాకు. అద్దంలా మెరిసే అందమైన బీరువాను ఒకటోరకం టేకుతో తయారు చెయ్యగల సామర్థ్యం జాన్‌కిఉన్నది అనుకున్నాను.

కాని యీ జాన్‌తో యితరవిధాలైన చిక్కులు వస్తాయి. ఇదివరలో బుక్‌రాక్‌లు చేసినప్పుడు పట్నం వెళ్లి సామాన్లు తెస్తానని కొయ్యలూ మేకులూ అంటూ రెట్టింపుధరలువేసిన దొంగబిల్లులు తెచ్చి డబ్బు తీసుకున్నాడు. అవి ప్లైవుడ్ షీట్లుకనుక, వాటిధరలు వేరుగా కనుక్కోగా, మోసం బయట పడింది. జాన్ అప్పటికే డబ్బు తీసుకున్నాడు. మళ్లీ పిలిపించి అడిగాము. కొట్లవాళ్ల మోసాల్నిగురించి చిన్న ఉపన్యాసం-చాలా Informative గా ఉండేది–ఒకటి యిచ్చాడు. వడ్రంగిపనికి సంబంధించిన ఏ విషయంమీద మాట్లాడవలసి వచ్చినా యిటువంటి మంచి ఉపన్యాసాలు యిస్తాడు. అవి విన్న తర్వాత జాన్‌మీదా, వడ్రంగి పనిమీదా కలిగిన గౌరవభావంతో నోరు మెదపలేము.

పల్లెటూళ్లల్లో ఏపని జరగాలన్నా ఒక భగీరథ ప్రయత్నంకావాలి. ఒకయిల్లు కట్టించాలంటే బేలుదారీలు, వడ్రంగులు, పెయింటులువేసేవాళ్లు అంటూ అన్నిరకాలైన పనివాళ్లకీ పనులు జరుగుతున్నంతకాలమూ యింట్లోనే భోజనాలు పెట్టాలి. కరెంటు వేయించుకోవాలంటే వైరింగుచేసేవాళ్లకూ అంతే. ఏదైనా వస్తువు చేయించాలంటే వడ్రంగులకూ అంతే. ఆఖరుకు బట్టలుకుట్టే టైలర్లకు

కూడా అంతే. వాళ్ళ భోజనాలకు గడచిపోగా, పనిచేసినన్ని రోజులకు కూలిడబ్బులు చేత బట్టు కొని యిళ్లకు వెళ్తారు. వాళ్ళ పనిని సాగ దీసి, యింకో వారంరోజులు గడిపే తత్త్వంలో ఉంటారు. మనపనిచేసే వాళ్ళ మనింట్లో భోజనం చెయ్యడం, తృప్తిగా పనిజెయ్యడం న్యాయమే కావచ్చును. కాని ఏపని జరగాలన్నా యింతప్రయత్నం కావలసిరావడం పట్నాలనుండివచ్చినవాళ్లకు విసుగ్గా ఉంటుంది. డబ్బు పారేస్తే పని జరగటం, వస్తువు యింటికిరావడంఅన్న పద్ధతికాదు యిక్కడ. ఇది ఒక పాతపద్ధతి. వస్తువుకీ, అది చేసేవాడి మంచిచెడ్డలకీ గల అవినాభావసంబంధాన్ని గుర్తించితీరాలి.

మావారు యిక్కడ క్రొత్తగాపెట్టిన చక్కెర మిల్లులో అసిస్టెంట్ మేనేజర్‌గా చేరారు. అందు వలన ఈ పల్లెటూరికి ఒచ్చాం మేము. ఊళ్లో మరో ముగ్గురు వడ్రంగులు ఉన్నారు. కాని అందరిలోకీ జాన్‌కే పని బాగా చేతనవునని—జాన్, యితరులూ కూడా చెప్తూఉంటారు. మిల్లులో ఏవైనా కొయ్య పనులు జరగాల్సినప్పుడు జాన్‌ని పిలుస్తారు. ఇది ఒక రకంగా జాన్‌కి సహాయం చెయ్యడమే. ఆ సంబంధం వలన యిదివరలో ఒకసారివచ్చి బుక్‌రాక్‌లు చేశాడు. 'అమ్మా, అయ్యగారింట్లో భోజనం పెట్టమని నేనడుగుతానా ! ఊళ్లో నాకు యిల్లుంది, వంటచేసు కుంటాను...కూలికూడా అయ్యగారిదగ్గర ఒకరూపాయి తక్కువే తీసుకుంటాను' అన్నాడు జాన్. పెద్దాచిన్నా బాగా ఎరిగినవాడు. పెద్దవాళ్లదగ్గర వినయంగా ఉండటం నేర్చినవాడు. కొయ్యలూ వగైరాలు తేవడం లోనూ, కూలిలోనూకూడా ఎక్కువడబ్బు తీసుకున్నా డంటే అది వేరేమాట. వాళ్ళూ బ్రతకాలిగద.

అన్నివిషయాలూ ఆలోచించినమీదట జాన్ పాల్‌కు కబురుపెట్టాను. మిల్లులో పనులు చేస్తూనే ఉంటాడు అడపాదడపా. కనుక మనల్ని చిక్కున పెట్టలేదు లెమ్మనుకున్నాను.

పొట్టిగా దిట్టంగా చామనలుపులో ఉంటాడు జాన్. అరవైదగ్గరగా వయస్సయినా నలభైకి మించి నట్లు కనబడడు. మొహం, ఎదుర్రొమ్మూ, చేతులూ, కాళ్ళూ అన్నీ వేటికవి బలంగా దృఢంగా కనిపిస్తాయి. పైవరుసలో ముందుపళ్లు రెండు లేవుగాని మిగతా పళ్లు రాళ్లమాదిరి గట్టిగా ఉన్నాయి. ఎత్తైన నుదుటిక్రింద లోతుల్లో కనిపించే కళ్ళు నల్లగాఉండి ఎప్పుడూ చురుగ్గా చూస్తుంటాయి. రూపం, మాట తీరు అన్నీ ప్రత్యేకంగా ఉండటాన జాన్‌ని ఒకసారి చూస్తే ఎవరూ మరచిపోలేరు. జాన్‌నిగురించి ఒక్క మాటలో చెప్పాలంటే—బలశాలి. మాటలో, చేతలో, చూపులో అన్నిట్లోనూ బలం. అదీ జాన్‌అంటే !

నిజం చెప్పాలంటే జాన్‌ను చూస్తే కొద్దిగా భయం నాకు. దుర్బలులకు శక్తిని చూచినప్పుడు కలిగే భయం. స్థూలంగాచూస్తే దానికి కారణంలేదు మరి.

చకచకా లెక్కలువేశాడు జాన్. అంతా ఒక వంద రూపాయలకు సామానుతెస్తే టేకుబీరువా తయారుచెయ్యొచ్చునట. పట్నంలో షాపునుంచీ రోజ్ వుడ్‌బీరువా యీ సైజుది నాలుగు వందలకు తెచ్చారు ప్రక్కింటివాళ్ళు. అట్లాగని జాన్‌తో నేను అనలేదు. 'రోజ్‌వుడ్ అయితే ఎక్కువ ఖరీదవుతుందా?' అనడి గాను. లేదు, రెండూ ఒకటేనన్నాడు. తక్కువరకం సరుకు తెస్తాడేమో, లేకుంటే యింత చవగ్గా ఎలా ఒస్తుంది అనుకున్నాను. మంచిరకం టేకు తేవా లన్నాను. 'అయ్యగారికి ఎట్లాటివి తేవాలో నాకు తెలి యదా?'అంటూ తాను పట్నంలో పెద్దపెద్దఆఫీసర్లకు ఎన్నెన్ని వస్తువులు చేసిందీ, వాటిని చూచి వాళ్లు ఎంతెంత ఆశ్చర్యపడిందీ, మెచ్చుకున్నదీ అంతా చెప్పాడు.

జాన్ క్రిష్టియన్‌మిషనరీలదగ్గర పెరిగాడు. పని నేర్చుకున్నాడు. ఒక ఇంగ్లీష్‌దొరగారు—పీటర్స్ దొరగారు-దయతో అన్నిపనులూ నేర్పించారు జాన్‌కు. ఎంతో సహాయం చేశారు. ఆయన దయవల్ల ఎట్లాటి వస్తువైనా చెయ్యగలనేర్పు అబ్బింది జాన్‌కు.

'ఒరే, ముండాకొడకా, సరిగ్గా చెయ్యకపోతే తంతాను' అన్నాట్ట ఒక కలెక్టరుగారు. ధైర్యంగా చేస్తానన్నాడు జాన్. పెద్దవాళ్లను మెప్పించాలని జాన్

పట్టుదల. రోల్‌టాప్‌డెస్క్ చెయ్యాలి. ఆ పట్నంలో ఎవరికీ చేతగానిపని అది. అలాటిదాన్ని ఇదివరలో పీటర్స్‌దొరగారిదగ్గర చూచిఉన్నాడు జాన్. అందుకే ధైర్యంచేసి ఒప్పుకున్నాడు. చేశాడు. కలెక్టరుగారు సెభాష్ అన్నారు.

ఇంకోసారి ఒక పెద్దడాక్టరుగారికి ఆస్పత్రిలో ఉపయోగించే ఒక వస్తువు చేయించవలసిన పనిబడింది. ఆ వస్తువును పై దేశాల్నుంచీ తెప్పించాలంటే చాల ఆలస్యమూ, ఖర్చూను. అందువలన జాన్‌ను పిలిపించి చెప్పారు. జాన్ ఆలోచన చేశాడు. ఒకరకంగా ఊహించుకున్నాడు దాన్ని. చేశాడు. తప్పు అయింది. పారేశాడు. మళ్లీ చేశాడు. డాక్టరుగారు సరిగ్గానే ఉందన్నారు. ఇహ ఒక అద్దం బిగించాలి దానికి. అది ఎట్లా బిగించాలో చెప్పారు డాక్టరుగారు. కాని తాను దగ్గర ఉన్నప్పుడే బిగించాలని తొందరగా ఒస్తాననీ చెప్పి వెళ్లారు. ఎంతసేపు చూచినా ఆయన రాలేదు. పని పూర్తిచేసుకుని డబ్బుతీసుకునివెళ్లాలని జాన్ ఆదుర్దా. డాక్టరుగారు చెప్పినప్రకారంగానే ఆయన రాకుండానే బిగించేశాడు. డాక్టరుగారు ఇంటికొచ్చారు. పనయిపోయింది, డబ్బులివ్వమని చెప్పుకున్నాడు జాన్. డాక్టరుగారికి కోపం మండిపోయింది. 'నిన్నెవరు బిగించమన్నారురా, రాస్కెల్. నేను రాకుండా బిగించవద్దనలేదా' అంటూ చెయ్యిచాచి మొహంమీద కొట్టారు. ముందుపళ్లు రెండు రాలిపడ్డాయి. జాన్ బయటికెళ్లి రక్తం వూసివచ్చాడు. డాక్టరుగారు వస్తువు చూచుకున్నారు. సరిగ్గానేచేశాడు జాన్. డబ్బులిచ్చి పంపేశారు. ఇప్పుడా డాక్టరుగారు పనిలో లేరు. ఎప్పుడైనా పట్నం వెళ్లినప్పుడు కనబడితే, అప్పుడు కొట్టిన విషయం జ్ఞాపకంచేస్తూ పలకరిస్తారు... ఈతీరులో జాన్ సొంతంగా ఊహతో క్రొత్తరకం వస్తువులు తయారుచేసి పెద్దలను మెప్పించిన వృత్తాంతాలు చెప్పాడు. జాన్‌ను పెద్దవాళ్లు కొట్టడంలోనూ మెచ్చుకోడంలోనూ కూడా కుక్కను చూచినట్లు చూడటం నాకు నచ్చలేదు. కాని మా బీరువా చెయ్యడానికి తగినవాడని తెలిసిపోయింది.

ఆయన ఆఫీసునుండిరాగానే బీరువా చేయించడానికి జాన్‌ను పిలిపించానని చెప్పాను. జాన్ ఆయనకు వివరాలన్నీ చెప్పాడు. ఒకటోరకం టేకు బీరువాకు—ముందుగా కొయ్యలు నూటయాభై రూపాయలకి తేవాలి. కూలిడబ్బులమాట జాన్ అడగడు. అయ్యగారి ఇష్టం. పదిరూపాయిలిస్తే పదే తీసుకుంటాడు ... 'ఇందాక కొయ్యలు నూరురూపాయిలకు చాలన్నావే' అన్నాను. 'అయ్యగారిదగ్గర కరెక్టుగా చెప్పాలికదమ్మా. తర్వాత పొరపాటు రాకూడదు. పెద్దదొరలదగ్గర ఎట్లా ఉండాలి' అంటూ నన్ను మందలించాడు. అదీ నిజమే. ఇప్పటి లెక్కల్నిబట్టి బీరువా ధర నూరుదగ్గరకాకుండా రెండునూర్ల దగ్గరయ్యేట్లుంది. కాని మంచి చెక్కచూసి తెచ్చి జాగ్రత్తగా యింట్లో చేస్తాడు. ఎట్లైనా షాపువాళ్లదగ్గర కొన్నదానికంటే ధర తక్కువే పడుతున్నది.

నూట తొంభైరూపాయలకు బిల్లుతో సహా కొయ్యలుతెచ్చి కట్ట యింట్లో పడేశాడు జాన్. తర్వాత నాలుగురోజులు అంతులేదు. 'ఇంతకూ పనిచేస్తాడో లేదో. వూరికే కొయ్యలుతెచ్చి యింట్లో పెట్టుకున్నామె' అనిపించింది. మా పనివాడు కొయ్యల్ని చూచి 'కొయ్య ముళ్లుగా ఉన్నది. అంత మంచిదిగా లేదు' అన్నాడు. ఇంతాచేసి నిగనిగ మెరిసే అందమైన బీరువారాదా ఏమిటి? నాకు చాలా కోపం వచ్చింది. ఈయనేమో ఏ సంగతీ పట్టించుకోరు.

నాలుగుసార్లు పిలిపించగా జాన్ వచ్చాడు. 'అమ్మా, ఫర్నీచరు షాపులవాళ్లు ఎక్కువగాకొంటారు గనుక వాళ్లని మంచికొయ్యలు ఏరుకోనిస్తారు గాని నాబోటిగాళ్లు ఒక్క బీరువాకుకొంటే ఏరుకోనివ్వరు. చెయ్యి పెట్టనివ్వరు. అయినా యివి దొరగారికోసమని చెప్పి బలవంతాన రెండు మూడు మంచికొయ్యలు ఏరివేశాను...ఆ ముళ్ళా అవీ లోపడలో పోతై. కనపడవు. బాగానే వుంటుంది లెండి బీరువా' అన్నాడు. 'పని చెయ్యడంలేదు. ఎందువలన?' అనడిగాను. 'కొయ్యలన్నీ మాయింటికే తీసుకెళ్లి చేస్తానంటే

దొరగారు ఒద్దు, యింట్లోనే చెయ్యి అన్నారు. నేను ప్రక్కవూళ్లో హోటలుకు బల్లలు చేస్తున్నాను. యిక్కడ పనిచేస్తూ నడిమధ్యలో ఒదిలి అక్కడకు పోతే—దొరగారిపని అట్లా చెయ్యకూడదు. పనిలో దిగితే పూర్తి చెయ్యాల్సిందే. అంతుకని ఆపని పూర్తి చేసి ఒద్దామని ఆలస్యం చేస్తున్నాను. మూడునాలుగు రోజుల్లో ఒచ్చి చేసెయ్యనా. అమ్మా... దొరగారిపని అంటే మాటలా' అన్నాడు.

పదిహేను రోజులతర్వాత ఒచ్చాడు పనికి.ఆయన బాగా చీవాట్లువేశారు. ఒంచినతల ఎత్తలేదు జాన్. 'అవును. తప్పుచేశాను. పెద్దవాళ్లు ... తిడితే పడాలి' అన్నాడు నాతో తర్వాత. ఒక్కరోజు పనిచేసి మళ్లీ మాయమైపోయాడు.ఊళ్లోనే ఏక్కడోదూలాలుకోస్తున్నాడట. రెండురోజుల తర్వాత వచ్చాడు. 'వాళ్లు నాకు యిదివరలో డబ్బుయిచ్చి వున్నారమ్మా పీకల మీద కూచుంటే వెళ్లవలసి వచ్చింది. అందులోనూ పెద్దవాళ్లపని అని చెప్పేగూడా వాళ్లు ఊరుకుంటేనా' అన్నాడు.

'అసలు వాడు పనిచేసే చోటునుంచీ కొయ్యలు చల్లగా .దాటించేస్తాడమ్మా. జాగర్తగా ఉండాలి' అని హెచ్చరించాడు మా శ్రీరాములు. ఒకే ఊళ్లో వాళ్ళకు—పల్లెటూళ్లలో—ఒకరిగురించి ఒకరికి బాగా తెలిసి ఉంటుంది. లేనిపోని తంటా కొనితెచ్చుకున్నట్లు యింది. పనిచేస్తూ ఉన్నపుడు గంటకోసారి బయటకు వెళ్తాడు జాన్. బీడీలు కాల్చుకోడానికి, టీ తాగటానికి ఎవరితోనైనా 'మాట్లాడ్డానికి, సామాన్లు ఎవరి దగ్గర్నుండో తెచ్చుకోడానికి—ఎన్నోపనులు. ఇందులో ఏసమయంలో దాటించేస్తాడో! అసలు తాను తీసుకెళ్లడానికే సగం కొయ్యలు వేరుగా ఎక్కువగా తెచ్చాడేమో! మొదట చెప్పినదానికంటే ఎక్కువబిల్లు చేసుకొచ్చాడే. జాన్‌కోసం మనుషులు ఒచ్చిపోతుంటారు కూడాను. ఎవరికిచ్చి పంపించేస్తాడో. ఎన్నో అనుమానాలు. అందుకని జాన్‌దగ్గర ఒకమనిషి కాపలా ఉండవలసి వచ్చింది. శ్రీరాములికి యితర పనులు చెప్పకుండా, మేం యిద్దరం, ఒకరు తప్పిస్తే ఒకరు అక్కడే ఉండవలసి వచ్చింది.

శ్రీరాముల్ని చూస్తే జాన్‌కు చాలా లోకువ. 'ఏయ్, అబ్బాయ్, ఆ ఉలి యిట్లా అందించు' 'ఈ బల్లపట్టుకో...ఊ, సరిగ్గా పట్టుకో' 'రాముడూ, యీ కొయ్యలన్నీ ఆ నీడలోకి తీసుకురా' 'ఏం మనిషివయ్యా, ఏపనీ సరిగా చెయ్యలేవు' శ్రీరాములికి ఎప్పుడూ ఎదో ఒకపని చెప్తూ గదమాయిస్తూనే ఉన్నాడు.

చీటికీ మాటికీ జాన్ బయటికి వెళ్తూండటంవలన పని వెనుకబడుతున్నది. టీకోసరం వెళ్తే గంటన్నర వెళ్లిపోతాడు. మొదటిరోజు సాయంత్రం మాతోపాటుగా టిఫిన్, టీ యిచ్చాను. బయటకు వెళ్లకుండా యింకోగంట కూర్చుని పనిచేశాడు. మర్నాడు ఉదయం పనిలోకి రాకుండా మధ్యాహ్నం మూడుగంటలకి వచ్చాడు. ఇప్పుడే కదా పనిలోకి వచ్చాడు, టిఫినూ టీలూ యిచ్చి ఎదురుసేవలు చెయ్యాలా అనుకొని యివ్వలేదు. అయిదుగంటలయ్యే సరికి కొయ్యలు, పనిముట్లు దభీదభీమని ఎత్తి పడెయ్యడం మొదలెట్టాడు. ఆ శబ్దాలు వినలేక అప్పటికప్పుడు టీ చేసి యిచ్చాను. గ్లాసు చేతిలోకి తీసుకుంటూ నా కళ్లల్లోకి తీక్షణంగా చూశాడు. 'రెండుపూటలా అన్నంపెట్టి కాఫీ టిఫినూ యిస్తామని ఎందరో పిలుస్తున్నారమ్మా. దొరగారి పని అని వచ్చాను' అన్నాడు. ఆ చూపుకి నాకు గుండెలో దడవచ్చింది. మర్నాటినుండీ నాలుగ్గంటలకు సరిగ్గా టిఫిన్ టీలు యిచ్చెయ్యాలనుకున్నాను. ఈ జాన్ పైకి కనిపించేటంత వినయవిధేయతలు కలవాడుగా తోచలేదు. మాటల్లో కనిపించే విధేయతకు పూర్తిగా వ్యతిరేకమైన స్వభావం కలవాడుగా చేతల్నిబట్టి తోస్తున్నది.

జాన్‌కి ఒక కొడుకూ ఒక కూతురూనట. కూతురు చదువుకొని పట్నంలో టీచరుగా ఉంటున్నది. జాన్ సరిగా చూడడుగనుక జాన్ భార్యకూడా

పట్నంలో కూతురిదగ్గరే ఉంటున్నది. ఇదివరలో జాన్ సంపాదించినదంతా తాగేసి ఇంట్లో డబ్బు సరిగ్గా యిచ్చేవాడుకాదట. ఏమని అడిగితే భార్యను బాగా తన్ని 'ఆడముండవి. నోరుమూసుకొనిపడివుండు' అనే వాడట. ఆవిడే కష్టపడి కూతుర్ని చదివించుకున్నది. జాన్‌మాత్రం కొడుకు ఫిలిప్‌తో యీ వూళ్లో ఉంటున్నాడు.

ఇదివరలో రాక్‌లు చేసేప్పుడు ఒకనాడు ఫిలిప్‌ను వెంటబెట్టుకుని వచ్చాడు జాన్. వాడు కష్టపడలేని వాడుగనుక మిల్లులో ఏదైనా ఆఫీసు జవానుపని లాంటిది యిప్పించమని అడిగాడు. ఫిలిప్‌కు యిరవై ఏళ్ళపైన వయస్సుంటుంది. సెకండ్‌ఫారమ్ చదువుతూ ఆపేశాడట. 'అమ్మో, వాడు చాలా తెలివి కలవాడు. పంతులు క్లాసులో ఏదో అన్నాడని పంతం మీద చదువు మానేశాడుగాని చదివుంటేనా, వాడు... అమ్మో...ఎట్లుండవలసినవాడు ! ఎప్పుడైనా సమయం పడినప్పుడు, నేను పనిలోకి రాలేకపోతే, వాడుపోయి నాకంటే బాగాచేస్తాడమ్మా పని...అయితే, ఎంతటి వాళ్లైనా మాటంటేమాత్రం పడడు' అన్నాడు జాన్.

ఫిలిప్‌ది తండ్రికిలాగే దృఢమైన శరీరం. నల్లగా నేరేడుపండులాగా నిగనిగలాడుతుంటాడు. కాని జాన్ మొహంలోనూ ఆకారంలోనూ కనిపించే గట్టిదనం ఫిలిప్‌లో కనిపించదు. మొహమూ చెంపలూ చేతులూ ఆడపిల్లలకున్నట్లు మృదువుగా ఉంటాయి. వాడి ఇరవైఏళ్లకళ్లల్లో సోమరితనం, అలసత్వం కనిపిస్తాయి. జీవితంతో పోరాడి ఎన్నోథక్కామొక్కీలు తిని రాటుదేరిన జాన్ కళ్లు—అరవైఏళ్లవి—వాడి చూపుతో వెలుగుతూఉంటాయి. ఇద్దరూ తండ్రీ కొడుకులు. ఒకరకంగా ఇద్దరికీ చాలా పోలికలున్నై. కాని అంతకంటే ఎక్కువభేదమూ ఉన్నది !

జాన్ కొడుక్కి ఉద్యోగం కావాలని అడుగుతూ వుంటే, ఆ విషయంతో తనకు ఏమీ సంబంధంలేనట్లు రెండు చేతులూ కట్టుకుని ఎటో చూస్తూ ఒంటి కాలిమీద నిలబడ్డాడు ఫిలిప్. వాడు ఉద్యోగం అర్థిస్తున్నవాడిలా కనబడలేదు. జాన్ పనిచేసుకుంటుంటే అట్లాగే నిలబడి కొంచెంసేపుచూసి 'నేనింటికెళ్తా నాయనా' అన్నాడు. జాన్ పని ఆపి ప్రేమగా కొడుకు వైపుచూసి 'వెళ్లు' అన్నాడు. ఫిలిప్ వెళ్లిపోయాడు. పనికోసరం వాళ్లు మళ్లీ అడగలేదు.

'వాడు పనిచేస్తే జాన్‌కి యింకేమి ! వాడు సోమరి. ఇదివరలో వాళ్ళనీ వీళ్లనీ అడిగి రెండుసార్లు పనిలో పెడితే ఉండకుండా వచ్చేసినాడు. పనిలోకి రాబోయేముందు జానే వంటజేసి పెట్టివస్తాడు. వాడు చెయ్యడు'అని చెప్పాడు శ్రీరాములు.

జాన్‌కీ ఫిలిప్‌కీ ఉండే సంబంధం నాకు ఆశ్చర్యం కలిగించింది. భార్యనీ కూతుర్నీ అంతకరుగ్గాచూసే జాన్ ఫిలిప్‌ని అంతప్రేమగా చూస్తాడెందుకు? వాడు శుద్ధఅప్రయోజకుడైనాడు. జాన్ వాడినట్లా చేశాడనడమే సబబేమో. పంతులు ఒకమాటంటే వాడు చదువు మానేస్తానంటే మానెయ్యనివ్వడమేనా ? దండించి చదివించుకోరా? పోనీ చదువు అబ్బకపోతే తనపని నేర్పించితే ఒకరి సంపాదన కొకరిది తోడుగా యిబ్బడిగా సంపాదించుకోవచ్చునే. జాన్ ప్రవర్తన చాలా చిత్రంగా ఉన్నది. తాను ఎన్నో అబద్ధాలాడి నానాగడ్డి కరచి నెట్టుకొస్తున్నాడు. కొడుకుమాత్రం ఒకరిచేత మాటపడని వాడుగా, కష్టపడలేనివాడుగా, అబద్ధమూ అన్యాయమూ లేకుండా, డబ్బంటే లెఖ్ఖలేకుండా ఉండాలా!

ఒకరోజు వచ్చీ, ఒకరోజు రాకా పని చేసిచేసి ఎట్లాగో బీరువాపని ఒకకొలిక్కి తెచ్చాడు జాన్. ఇహ అరలుపెట్టి తలుపులు బిగించాలి. అటువంటి సమయంలో మళ్లీ మాయమైనాడు. ఆ ముందు రోజునే పట్నంవెళ్లి సీలలు, బందులు, హాండిలు, తాళం, పాలిషు, ఎమెరీపేపర్లు అన్నీ బస్సుఛార్జీలతో సహా యాభైరూపాయిల సామాన్లు తెచ్చాడు. ఇంకొక్కరోజు పనిచేస్తే పూర్తవుతుందన్నాడు. ఇంతవరకూ పనిచేసినదానికి తనకు రావలసిన కూలిలో పదిరూపాయిలు మిగిలివుంటే తీసేసుకున్నాడు. అంతే. పనిలోకి రాలేదు. ఎక్కడికైనా పారిపోయాడా అనుకో

డానికి జాన్ సామాన్లు—ఉలి, అంపం, క్లాంపు—అన్నీ మా యింట్లోనే ఉన్నాయి. ఎన్నిసార్లు వెళ్లినా మా మనుష్యులకు జాన్ అంతుదొరకలేదు. మూడో నాడు శ్రీరాములికి బజార్లో కనబడ్డాడట. బాగా త్రాగివుండి శ్రీరాముల్ని నానాదుర్భాష లాడాట్ట. ఫిలిప్ సర్దిచెప్పి, మర్నాడు పనిలోకి పంపుతానన్నాట్ట.

ఎన్నో క్షమార్పణలతో మర్నాడు పనిలో కొచ్చాడు. ఎక్కడో పని ఒప్పుకున్నాడట. రేపటితో యీపని పూర్తి చేసుకుని వెళ్లిపోతాడట. ఇక్కడ పని సరిగా చెయ్యకుండా, మాట నిలకడలేకుండా చేసుకున్నందుకు కొడుకు బాగా కోప్పడ్డాడట. మొదట యిచ్చిన ఎస్టిమేటుకీ అయిన ఖర్చుకి సంబంధంలేకుండా ఉన్నదనీ పని తొందరగా చెయ్య లేదనీ జాన్‌ను కోప్పడి ఆయన ఫాక్టరీకి వెళ్లి పోయారు. తరువాత నాదగ్గర మామూలుగా కని పించే అతిశయంగాని అతివినయంగాని లేకుండా మాట్లాడాడు. 'నూటయాభై రూపాయిలకు బీరువా చేసిస్తానని చెప్పాను. నిజమే. అంతా అయ్యేప్పటికి రెండువందలయాభై దాటిపోతున్నది. ఇందాక అయ్య గారు తిట్టారు...నాకూ అదే చాల చింతగా ఉన్నది. ఇంట్లోగూడా చింతపడతావుంటే నాకొడుకేమన్నా డంటే 'మాట పొరపాటు రాకూడదు నాయినా. అయ్యగారు డబ్బు జాస్తి అవుతందని కోప్పడితే నువ్వు కూలిడబ్బులు తీసుకోమాక, అన్నాడు...' అంటూ చెప్పాడు. కూలి డబ్బులన్నీ అప్పుడే తీసేసు కున్నాడుగదా. కొడుకు బడాయిమాటలన్నీ తమాషాకి వల్లిస్తున్నాడా ? అనుకుంటూ జాన్ మొహంకేసి చూశాను. అక్కడ కన్పించిన భావం మాటల్లో చెప్ప గలనా ?! ఎంతో ప్రశాంతత, ఆనందం, మార్దవం వెలిగిపోతున్నాయి జాన్ మొహంలో. జాన్ టక్కరివాడు. తాగుబోతు. నిలకడ లేనివాడు. పొగరుబోతు. పైసా ఖరీదుచెయ్యని కొడుకు అప్రయోజకపు మాటలు జాన్‌లో యిటువంటిభావం కలిగిస్తాయా ? ఎందు కని ? ఆ మాటల్లో ఏమున్నది? జాన్ అసాధారణ వ్యక్తి. వ్యక్తులమధ్యనుండే సంబంధాలూ ఆ వ్యక్తు ల్లాగే క్లిష్టమూ , సంకీర్ణమూ అయివుంటు న్నాయి. అసలు మనుష్యులమధ్య నిజంగా సంబంధం అనేది వుంటుందా? ఎందుకు? ఎట్లాగ?...యిదంతా నా బుర్రకు అర్థంఅయ్యే విషయంగా తోచలేదు. ఆలోచనల్ని ప్రక్కకునెట్టి నేను చదవలేక ప్రక్కన పెట్టిన పుస్తకం తీసుకున్నాను.

'అడవి ఏమంత దట్టంగాలేదు. కాకులుదూరని కారడవీ, చీమలుదూరని చిట్టడవీ కాదు. రక రకాల చెట్లు కీసర బాసరగా పెనవేసుకుపోయి ఉన్నాయి. ఒక్కొ చెట్టుకి ఒక్కొ విలక్షణత. ఆకుల్లో, కొమ్మల్లో, రూపులో ప్రత్యేకత. కాని వాటిని గుర్తించగల జ్ఞానం నాకులేదు. నేత్రోత్సవం కలిగిస్తున్న ఆ దృశ్యంలో నేనుగుర్తించగలిగింది ఒక సీతాఫలంచెట్టుని. కాయలు విరగ్గాసి ఉన్నాయ్. అటువంటి చెట్టును నేను యిదివరకే చూచిఉన్నాను. అందుకే గుర్తిం చాను. మిగతా చెట్లన్నీ కలిసి ఒక అడవి. అందులో యీ సీతాఫలంచెట్టు...

ఈ ప్రపంచం ఒక అస్పష్టమైన వర్ణచిత్రం. అందులో మనం గుర్తించగలిగేది అంతకుముందే మనలో భాగమై ఉన్నదాన్నిమాత్రమే. తనలోని గుర్తునే బయటా గుర్తిస్తాము.

ఒక మనిషి జీవితానికి అర్థం, పూర్ణత్వం ఇందునుంచే ప్రాప్తిస్తుంది. ఆ జీవితం ముందునుండీ అతనిలో నిబిడీకృతమై ఉన్నదే.

ఒక చిన్నవిషయంనుండీ పెద్దసూత్రాన్ని నిర్వ చింప బూనుకున్నట్లు కనిపిస్తున్నా, యిది అనుభవ సిద్ధమైన విషయమే...'

'ఇదేం నవలరా బాబూ' అనుకుంటూ పుస్తకం మూసేశాను.

బీరువాకు తలుపులు బిగించి జాన్, శ్రీరా ములూ యిద్దరూ కలిసి దాన్ని వరండాలోకి తెచ్చి పెట్టారు. ఇహ పాలిష్‌చెయ్యాలి.

జాన్‌కోసం మనిషిఒచ్చాడు. ఫిలిప్ మరిదేరిని దాటుతుండగా గభాల్ని ఏరువచ్చేసి కొట్టుకు పోయాట్ట. గాభరాగా పరుగెట్టాడు జాన్.

తరువాత తెలిసింది ఫిలిప్‌శవం దొరికిందని.

జాన్ యీ దెబ్బకు తట్టుకోలేడు అను కున్నాను.ఫిలిప్‌కీ జాన్‌కీ వుండే సంబంధం ఎట్లాంటిది!

నాలుగోరోజున పనిలోకి ఒచ్చాడు జాన్. నాలుగురోజులకే ముఖమంతా ఒడిలిపోయి ముసలి

వాడయ్యాడు. 'ఇంతలోనే పనిలోకి రాకపోతేనేం ? నీకు బాగున్నట్లులేదు. పనికి తొందరలేదులే. ఇంటికెళ్లు' అన్నాను సానుభూతితో. 'మైనంరుద్ది పాలిష్‌కొడితే బీరువాపని అయిపోతుంది' అన్నాడు. జాన్ గొంతులో క్రొత్తగా ఒకహుందాతనం వచ్చింది. ఈ జాన్‌ని ఎవరూ ఓదార్చవలసిన పనిలేదు.

ఉప్పు కాగితం, మైనం బాగా రుద్దాడు. పాలిష్ మూడు కోటింగులు వేశాడు. తొమ్మిది గంటలకు పనిలోకి వచ్చాడు. బయటికి కదలనేలేదు. రెండు గంటలైంది పని పూర్తయేసరికి.

జాన్ తనసామాన్లు మూటగట్టుకున్నాడు. మిగిలిపోయిన కొయ్యముక్కలూ, పాలిషూ, శీలలూ వప్పజెప్పాడు.

'కూలి ఏమిమ్మంటావ్ ?' అన్నారు ఆయన.

'మామూలుగా ఈ బీరువాకు నలభై రూపాయిలు తీసుకుంటాను. ఇదివరకే ముప్పైఐదు యిచ్చారు. నేను మొదట చెప్పిందానికంటే ఖర్చు ఎక్కువై పోయింది...మీ యిష్టం' అన్నాడు.

జాన్ మాటల్లో యిదివరకటి అతివినయం, టక్కరితనం పోయి ఒక హుందాతనం నిక్కచ్చితనం ఒచ్చాయి.

జాన్‌పాల్‌చేసిన బీరువా చివరి మెరుగులు దిద్దుకున్నాక నిగనిగలాడిపోతూ నున్నగా అందంగా ఉన్నది.

*  *  *

జాన్‌పాల్ ధైర్యశాలి. బలశాలి. అదే జాన్ నిజస్వరూపం. ధైర్యమూ బలమూ అనేవి మనిషిలోని సత్యానికి—భగవంతుడికి—సంబంధించిన గుణాలు.

నాది అందుకు పూర్తిగా భిన్నమైన స్వభావం. మా నాన్నగారు చనిపోయినప్పుడు నేనూ ముక్కలైపోయాను. మళ్లీ మనిషిగా నిలబడడానికి చాల ప్రయత్నమూ, కాలమూ పట్టింది.

నాన్నగారు పోయాక మొదటిసారి ఆకాశంక్రింద నిలుచున్నాను. ఆకాశంలో . శతకోటి నక్షత్రాలు మెరిసిపోతున్నాయి. ఆ ఆకాశాన్ని చూడగానే నాకు గాభరావేసింది. ఎన్ని నక్షత్రాలు! వాటిని గురించి నాకేమీ తెలియదే! నాన్నగారు మేమూ ఈ ఆకాశం క్రింద ఎన్నోమాట్లు కూర్చున్నాము. నాన్నగారికి ఆ నక్షత్రాలగురించి తెలుసు. వాటిపేర్లు నడకగురించి అప్పుడప్పుడు చెప్పేవారు. కాని నేను శ్రద్ధగావిని జ్ఞాపకం పెట్టుకోలేదు. నాన్నగారి నడిగితే తెలిసిపోతుంది గనుక...యిప్పుడు నాన్నలేరు. ఆ నక్షత్రాల గురించి నాకు ఎలా తెలిసేది? చాలా ఆరాటం,భయం, నిస్పృహ కలిగాయి. ఏమిటో పోగొట్టుకున్నట్లు బాధ.

నాన్నగా రున్నప్పుడూ ఆకాశంగురించి నేనేమీ తెలుసుకోలేదు. అప్పుడు నాకు ఉన్నదీ, యిప్పుడు క్రొత్తగా పోగొట్టుకున్నదీ ఏమీలేదు. మరి ఎందుకు నాలో యీ ఆరాటం ?

తరువాతనుండీ నక్షత్రాలగురించి నాచెవినిపడ్డదంతా జ్ఞాపకం పెట్టుకున్నాను.

*  *  *

జాన్‌పాల్‌చేసిన బీరువా మెరుస్తున్నది.

'బీరువా బాగున్నదే. నా బట్టలూ పుస్తకాలూ వస్తువులన్నీ పెట్టుకోడానికి బాగా సరిపోతుంది' అన్నాడు బాబు.

'బాగుంటే నీకేనా ? పై రెండు అరలూ నాకు అందవుగనక నీవు పెట్టుకో. క్రింద రెండింట్లో నేను పెట్టుకుంటాను' పాప తగవు పెట్టుకుంది అన్నతో.

అసలు బీరువా నాక్కావాలనిగదా అనుకున్నాను మొదట! ముఖ్యంగా కావలసినవన్నీ పోకుండా దాచుకోవచ్చని అనుకున్నానే !

'పోనీలే, టేపులాంటిదైతే బీరువాలో పట్టొచ్చునుగాని ఆకాశం, నక్షత్రాలూ, యింత ప్రపంచమూ ఏలాగూ పట్టదు...అనుకుని నాకు నేనే సర్దుకున్నాను ...

# పీటర్ సూత్రము

## డా. విశ్వనాథ అరుణాచలం

అద్భుతమైన శాస్త్రీయ పద్ధతిలో అధునాతన ప్రపంచంలోని సంస్థలన్నిటికీ అన్వయించే విధంగా సత్య ప్రవచనాలతో ఒక గ్రంథం వెలువడింది. రెండేళ్ళక్రితం. గ్రంథంపేరు The Peter Principle. సూత్రప్రవక్త డాక్టర్ లారెన్సు. జె. పీటర్. పీటర్, రేమండ్ హల్, ఇరువురు కలిసి కృషిచేసి వెలువరించిన గ్రంథమిది. Souvenir Press, London వారు ప్రచురణ కర్తలు. ఈ గ్రంథం సమకాలీన ప్రపంచంలో పెద్దదుమారం లేపుతోందనవచ్చు. ఈ గ్రంథాన్ని చదివిన ప్రతిఒక్కరూ ఆత్మవిమర్శ చేసుకోవలసి వస్తుంది. ఇందులోని సిద్ధాంతాలు, తీర్మానాలు, ప్రతిపాదనలు, వాదాలు కొంత అతిశయోక్తులుగా కనబడినప్పటికీ మొత్తంమీద అందలి సత్యాల్ని ఎవ్వరూ కాదనలేరు. అవి విశ్వజనీనములు. మానవ సంస్థలకే గాక భూతలంమీద యావత్ప్రాణికోటికీ అన్వయించే సార్వత్రికతను కలిగిఉన్నది ఈ పీటర్ సూత్రము.

> 'పదవీ సోపానములో
> కదలును ఉద్యోగి చేతకాని తనపు హ
> ద్దుదరికని పీటరు నుడివె
> గద చిత్రపు సూత్రమొందు గణగణ గంటా.'

'ఒక హైరార్కీ (Hierarchy) లో ప్రతి ఉద్యోగి తనచేతకానితనపు అవధిని అందుకొంటాడు' అన్న సూత్రము హైరార్కియాలజీ అనే కొత్తశాస్త్రమునకు మూలస్కంధము. పూర్వకాలంలో హైరార్కీ అంటే చర్చీల పరిపాలనలో క్రైస్తవ మతాధికారుల ఉద్యోగపు స్థాయిలను సూచించేది. ఈ నాడు ఏ సంస్థలోనైనా పదవులకు సోపానాలుంటాయి కదా; వీటినిగురించిన 'బాగోతా'న్ని హైరార్కియాలజీ అంటాము. ప్రభుత్వపు యాజమాన్యంలో నడచే సంస్థలకే గాక, ప్రయివేటు రంగాలు నిర్వహించే సంస్థలకూ, విస్తృతీకరిస్తే యావత్ప్రాణికోటులకూ అన్వయించే మహత్తరమైన సూత్రము పీటర్ ప్రతిపాదించిన సూత్రము.

పీటర్ తన సూత్రాన్ని ప్రవచిస్తూ తన సూత్రం ప్రపంచంలోని అన్ని హైరార్కీలను అవగాహన చేసుకొనేందుకు బాగా ఉపయోగపడటమే గాకుండా మానవ నాగరకతకు దర్పణంగా పరిణమిస్తుం దంటాడు. ఒప్పుకొన్నా, ఒప్పుకొనకపోయినా ప్రతి ఉద్యోగి పీటర్ సూత్రప్రభావంనుండి తప్పించుకోలేడు—

పీటర్ సూత్రంనుండి ఈ క్రింది ఉపసిద్ధాంతాలు సాధించవచ్చు.

ఉపసిద్ధాంతము 1: కాలక్రమేణ ప్రతి ఉద్యోగాన్ని తన విధ్యుక్త ధర్మాల్ని నిర్వహించడం చేతగాని ఉద్యోగే నిర్వహిస్తాడు.

ఉపసిద్ధాంతము 2: ప్రతి సంస్థలో చేతకానితనపు హద్దులను యింకా చేరని ఉద్యోగులే యావత్కార్యాన్ని నిర్వహిస్తారు.'

ఈ సిద్ధాంతాలు పడక కుర్చీలో కూర్చొని ఆషామాషీగా వ్రాసినవికావు; నిర్విరామ కృషిచేసి, సాంఖ్యిక పద్ధతులద్వారా అనేక సందర్భాల్ని సంస్థలని శ్రద్ధగా పరిశీలించి, పండిన అనుభవంతో వెలువరించిన నిత్యసత్యాలు. మన అందరి అనుభవమే, చూస్తూంటాం. అనేక సన్నివేశాల్లో చేతకానితనపు

విశృంఖలత, విజయ సంపన్నత. నిర్మించిన కొన్నిరోజుల్లోనే లక్షలుపోసి కట్టిన డాములు, వంతెనలు కూలిపోతాయి. ఆదమరచి నిదురపోయే ప్రయాణీకులతో వెళ్లే రైలుబండి హఠాత్తుగా పట్టాలుతప్పి పడిపోతుంది. ఇటీవల హైదరాబాదు సమీపంలో పాళెం అనే గ్రామంలో వీధినాటకంచూస్తూ అర్ధరాత్రి కూర్చున్నచోటే నిద్రపోతూఉండిన వందలాది మనుష్యులమీదుగా లారీనితోలి అందరిని చితగ్గొట్టాడు లారీడ్రైవర్. ఆటోమొబైల్ ప్రమాదాలలో ఈ లాంటి ప్రమాదం మునుపెన్నడూ కనివిని ఎరుగరెవ్వరూ. ప్రభుత్వ ప్రణాళికలెన్నో విఫలమౌతాయి. సహకార సంస్థలన్నీ నష్టాలపాలే. ప్రభుత్వ రంగం నిర్వహించే సంస్థలలో ఆర్థికాభివృద్ధి ఆట్టే కనబడదు. ఈ విధంగా పట్టీ తయారుచేస్తే అనంత సంఖ్యాకంగా నిదర్శనాలు చూపవచ్చు. ఇవన్నీ కూలంకషంగా చర్చిస్తే తేలే సారాంశం: చేతకాని తనమన్నది విశ్వజనీనము. పింఛను పుచ్చుకొనేవాడు పింఛను కోసం వెడితే ఆవ్యక్తి బతికిఉన్నాడనే సర్టిఫికెట్టు తేవాలంటారు. మనం అడ్రసుమార్చిన సంవత్సరాల తర్వాతకూడా మనకు అందవలసిన తపాలు పాత అడ్రసుకే పోతుంది. ఒక సంస్థ ఉద్యోగాలు కోరేవారు అప్లికేషన్లు పంపవచ్చునని ప్రకటిస్తూ, పంపేవారు అప్లికేషన్లను రిజిష్టర్డు తపాద్వారా పంపమని కోరుతుంది — ఒక అభ్యర్థి రిజిష్టరు చేయక మామూలు తపాద్వారా పంపితే, ఆ సంస్థ 'మీ అప్లికేషన్ సురక్షితంగా మా ఆఫీసు చేరాలంటే దయచేసి రిజిష్టర్‌చేసి పంపవలసింద'న్న సూచనతో తిప్పి పంపేస్తుంది.

ఇంత విశృంఖలంగా ఈ 'చేతకానితనం' ఎందుకు పెరుగుతోన్నదని ఎవరినైనా అడిగితే మనకు వింత వింతగా సమాధానాలు లభిస్తాయి. 'ఈ నాటి కుర్రకారు పనుల్ని శ్రద్ధగా చేయలేరండీ' అంటాడు ఒక నడివయస్సువాడు—

'మన 'నాయకుల్లో చురుకుదనం, కార్యదీక్ష ఉంటేగా అనుయాయులైన ప్రజల్లో అవి ఉండటానికి' అంటాడు ఒక దేశభక్తుడు.

'మతప్రసక్తిలేని సమాజం ఈలాగే తెల్లారుతుంది' అంటాడు ఒక వేదాంతి.

'వాళ్ళిచ్చే నాలుగురాళ్ళకి ఇంతమాత్రంచేస్తే ఛాల్లే'—ఒక ఉద్యోగి ఉవాచ.

'పనివాళ్ళందరూ జీతాలు చాలవంటారు, సెలవులేవంటారు. ఒక్కటే గోల—సమ్మెలుమాత్రం చేస్తారు—పనులు సుతరామూ చేయరు' అంటాడు ఫ్యాక్టరీ యజమాని.

'మా హక్కులకోసం మేం పోరాడతాం, బాధ్యతలతో మా కవసరంలేదు' అంటాడు కార్మిక నాయకుడు.

'జాతీయంచేస్తే ఏ పరిశ్రమా అభివృద్ధికాదు' అంటాడు ధనిక పారిశ్రామికుడు.

'తప్పుచేయడం మానవధర్మం' అంటాడు ఒక తాత్వికుడు.

'తప్పులు చేయడం మా హక్కు—క్షమించడం మీహక్కు' అంటాడు కార్మికుడు యజమానితో.

'విద్యార్థుల్లో క్రమశిక్షణ బొత్తిగా పోయింది. చదువు లెలా వాళ్ళకు ఒంటబడతాయి' అంటాడు ఉపాధ్యాయుడు.

'మాకంటే ఒకగంట ముందు లెక్చరర్ విషయాల్ని తెలుసుకొంటా డంతే' అంటాడు విద్యార్థి.

కళాశాలల్లో విద్యాస్థాయి ఎందుకు పడిపోతోంది? హైస్కూళ్లలోని ఉపాధ్యాయులు చక్కగా బోధించడంలేదు.

హైస్కూళ్ళలో విద్యార్థులు ఎందుకు మునుపటి రోజుల్లోలాగా బాగా చదవడంలేదు? ప్రాథమిక పాఠశాలల్లో బాధ్యతలు గుర్తించనివారు ఉపాధ్యాయులైనారు.

'ప్రాథమిక పాఠశాలల్లో విద్యాస్థాయి ఎందుకు దిగజారిపోయింది'

తల్లిదండ్రులు వారి పిల్లలను సరియైన పద్ధతిలో పెంచడంలేదు. ఇంటిలో అల్లరి తగ్గుతుందని

పాఠశాలకు పంపుతారు—అందువల్లే పిల్లలు చెడిపోతున్నారు.

ఈలా 'చేపా, చేపా, ఎందుకు ఎండలేదు...' కథ గుర్తుకువచ్చేట్టు ఈ సమాధానాలను అల్లుతారు.

*   *   *

రోగి: డాక్టర్‌గారూ ! జ్వరంగా ఉన్నదండీ! కాస్త మందిప్పిస్తారా

డాక్టర్: ఎప్పటినుండి జ్వరం?

రోగి: నిన్న సాయంత్రంనుండి ఉన్నదండీ

డాక్టర్: జ్వరంవస్తూనే మందులు పుచ్చుకోకూడదండీ—శరీరంలో జబ్బుల్ని నిరోధించే శక్తి ఉంది. అందువల్ల రెండు మూడు రోజులుచూచి, మనలోఉన్న సహజశక్తితోనే జ్వరాల్ని తొలగ్గొట్టాలి. అది పనిచేయకపోతే అప్పుడు వైద్యసహాయం పొందొచ్చు వెళ్ళండి'

—రోగి నిష్క్రమిస్తాడు.

మరోరోగి ప్రవేశిస్తాడు.

రోగి: డాక్టర్‌గారూ! జబ్బుగా ఉన్నదండీ. దయచేసి మందేదైనా యిప్పించండి'

డాక్టర్: ఎప్పటినుంచీలా జబ్బుగా ఉన్నారండీ

రోగి: మూడు రోజులుగా బాధపడుతూ ఉన్నానండీ'

డాక్టరు: జబ్బువచ్చిన మూడు రోజులకుగాని నన్ను చూడాలని మీకు స్ఫురించలేదు కామోను. జాప్యంచేసి జబ్బును ఎక్కువ చేసుకొన్నారండీ. దయచేసి పెద్దడాక్టర్‌వద్దకు త్వరగా వెళ్ళండి'

*   *   *

ఈలాంటి లక్షలాది సమాధానాలను, సన్నివేశాలను, ప్రతిపాదనలను అధ్యయనంచేసి డాక్టర్ పీటర్ జగద్విఖ్యాతమైన ఒక సూత్రాన్ని కనుక్కొన్నాడు. రేమండ్‌హల్ ఈ సూత్రానికి భాష్యకారుడు. గ్రంథ పీఠికలో రేమండ్‌హల్ అంటాడు—ఈ గ్రంథాన్నిచదివితే ప్రయోజనం కద్దా ? ... నీలోని అసమర్థతని, జయించి, ఇతరులలోని అసమర్థతను అర్థంచేసుకొని, నీ పనుల్ని నీవు సులభంగా చేసుకోగలవు. పై ఉద్యోగాలకు వెళ్ళగలవు. ఎక్కువడబ్బు సంపాదించుకొంటావు. బాధాకరమైన మానసిక వ్యాధులకు దూరుడౌతావు. నీవు ఒక జననాయకుడవు కావచ్చు. విరామకాలాన్ని కులాసాగా గడుపుతావు. నీ స్నేహితులకుసంతృప్తినిస్తావు—శత్రువులనుహడలుగొడ్తావు—నీ కుటుంబజీవితం కలకల లాడుతుంది. మొత్తం మీద నీ జీవితంలో ఒక ఆనంద ప్రతిపాదకమైన విప్లవం జరిగి తీరుతుంది.

అక్కడక్కడ పీటర్ సూత్రానికి విరుద్ధమైన సన్నివేశాలు ఉండవచ్చు. అంతమాత్రాన ఈ సూత్రం సత్యదూరమని దూషించడానికివీల్లేదు.

'రెకమెండేషన్', 'పుల్' మొదలగు పదాలు మనం తరచూ వింటూఉన్నవే.

'రెకమెండేషన్ ఉంటే
రకరకమగు పనులకేగి రంజిలి ఉందున్
రెకమెండేషన్ లేనిదె
కకపాలను పట్టవలెను గణగణ గంటా'

వెనుక సహాయము చేసెడి
ఘననాయకు లున్నయపుడు గర్వోద్ధతుడై
పనిచేయక అక్రమ ధన
కనకాల్గొను 'నౌకరుదొర' గణగణ గంటా !

ఒక హైరార్కీలో పై ఉద్యోగంలో ఉండేవాడు దిగువను ఉన్నవానికి బంధువురీత్యానో, స్నేహితరీత్యానో పరిచయస్తుడై సాయంచేసే సందర్భాన్ని పుల్ (Pull) అంటాడు పీటర్. పుల్‌ను పొందేవాడు పుల్లీ (Pullee), కాబొయ్యే పుల్లీ అనుసరించవలసినవిధానాన్ని వరుసక్రమంగాపేర్కొంటాడు పీటర్.

(1) నీమీద దయను ప్రసారంచేసే గొప్ప ఉద్యోగిని వెదకిపట్టుకోవలె.

(2) నీకు సాయంచేస్తే ఆ గొప్పఉద్యోగికి ఏదైనా లాభం కలిగేటట్టుండవలె. నీకు సాయం చేయకపోతే అతనికి నష్టం కలిగేటట్లయితే ఇంకా మంచిది.

(3) ఒక్కణ్ణే నమ్ముకొంటూ వృథా కాల

# అంబాలీస్

శ్రీ బి. పి. కరుణాకర్

హరిజన హాస్టల్‌కూ నరసయ్య పవుల్ట్రీకూ కంచె అడ్డం. పవుల్ట్రీ లోపలకు వెళ్లాలంటే మామిడి తోటదాటి చుట్టూ తిరిగివెళ్లాలి. తడికెగేటు కర్ర విరిగి ప్రక్కకు ఒరిగి ఉంది. లోపలకు నడిచాను. కోళ్ల గోల. చెట్టుక్రింద నీళ్లనిలిచి మురుగువాసన వేస్తోంది. నరసయ్య ఇంట్లో ఉన్నాడో లేదో తెలియదు. అరుగు మీద ఈజీ ఛేయిర్‌లో ఒకామె కూర్చునిఉంది. ఆమె ఎర్రగా ఉంది. నల్లంచు తెల్లటిచీరలో శుభ్రంగాఉంది. ఈజీ ఛేయిర్‌ప్రక్కనే పొడుగాటిబల్ల ఉంది. బల్లకు అటుచివర మరో ఆమె కూర్చునిఉంది. ఈమె చామన చాయలో ఉంది. ఉంగరాలు జుట్టు గుండ్రటి కళ్లు. ఇద్దరి వయస్సూ ముప్ఫయి సంవత్సరాల లోపు ఉండొచ్చు.

అరుగు ఎక్కాను. 'నా పేరు రంగారావు. ఈ ఊరి హయిస్కూల్లో సయిన్సు టీచర్‌గా పని చేస్తున్నాను' అన్నాను.

అని ఇద్దరివంకా చూశాను.

బల్లచివర కూర్చున్న ఆమె చిన్నగా పెదిమలు విప్పింది. పెదిమలు ఎర్రగా ఉన్నాయి. తడిగా ఉన్నాయి. 'నాపేరు సీత. చెన్నూరులో మిడ్‌వయిఫ్‌గా పనిచేస్తున్నాను. వీరి పేరు వీరాబాయి. మా బ్లాక్ ఎస్. ఇ. ఓ'అంటూ ఈజీ ఛెయిర్‌లో కూర్చున్నావిడను చూపించింది.

నమస్కార, ప్రతినమస్కారాలు అయినాక 'కూర్చోండి' అన్నది వీరాబాయి.

బల్లకు ఈ చివర కూర్చున్నాను. బల్ల సరిగా లేదు. మధ్యలో ఎత్తుగాఉంది. కదులుతోంది. ఆరు కావస్తోంది. చీకటి పడుతోంది.

'నరసయ్యగారు లేరా?' అడిగాను.

'ఇప్పుడే రెడ్డిగారిదగ్గరకు వెళ్లారు. వెంటనే వస్తానన్నారు.' అన్నది వీరాబాయి.

సీత పేపరు చదువుతోంది.

'ఎప్పుడు వచ్చారు?'

'రెండుగంటలప్పుడు వచ్చాం.'

'మంచిఎండలో వచ్చారు. విజిట్ పూర్తి చేసేసేరా?'

వీరాబాయి తలూపింది.

'పోయిన సంవత్సరం చివర్లో ఓ సారి బంజర వచ్చాం. మీ రప్పుడు ఇక్కడ లేరు. అవునా?' అడిగింది సీత పేపరు మడుస్తూ.

'అవును'

'మును పెక్కడ పనిచేశారు?'

'ఎక్కడా పనిచేయులేదు. ట్రయినింగ్ అయిన తర్వాత చినకోరుకొండిలోనే ఫస్టు అపాయింట్‌మెంట్'

'ఎలాఉందీ ఊరు?'

'వ్చ్'

'మీదే ఊరు?'

చెప్పాను.

'అబ్బో! చాల దూరంనుండి వచ్చారే'

'తప్పలేదు మరి—అన్నట్లు మీ ఇద్దరికీ వో సంగతి చెబుదామని వచ్చాను' అని వీరాబాయి ముఖం లోకి చూశాను.

'చెప్పండి' అన్నది వీరాబాయి.

'ఈ రాత్రికి మీ రిక్కడే ఉండిపోతున్నారు కదా'.

తలూపింది.

'రేపు ఉదయం తిరిగి చెన్నూరు వెళ్ళిపోతారు. అవునా?'

'అవును'

'ఈ రాత్రికి మీ రిద్దరూ మా హాస్టల్‌లో భోజనం చేయాలి'

'హరిజన హాస్టల్‌లోనా?' అడిగింది సీత.

'అవును'

'హాస్టల్‌కు మీరు వార్డెనా?'

'కాదు. కృష్ణారెడ్డిఅని తెలుగుమాస్టారు ఈ హాస్టల్‌కు వార్డెన్. ఆయన చినకోరుకొండిలోనే ఉంటారు. నాకు ఎక్కడా ఇల్లు దొరకక పిల్లలతో పాటు హాస్టల్‌లోనే ఉంటున్నాను.'

'మీకు పెళ్ళికాలేదా?'

'లేదు. భోజనంమాట మర్చిపోరు కదూ?'

'లేదు.' అన్నది వీరాబాయి.

'మీకు స్నానానికి నీళ్ళు పెట్టించాక ఏకుర్రాడి చేతనయినా కబురు పంపిస్తాను. మీకు హాస్టల్‌లోనే పడక ఏర్పాటు చేయిస్తాను సరేనా?'

'సరే. మీకు చాలాశ్రమ ఇస్తున్నాము'.

'నథింగ్. ఇందులో శ్రమఏమీ లేదు' అని లేచి అరుగుదిగి తిరిగి హాస్టల్‌లోకి వచ్చేశాను.

బంజరలోగాని చినకోరుకొండిలో గాని హోటళ్ళు లేవు. బంజర చినకోరుకొండికి మయిలు దూరంలో ఉంది. మంచిరోడ్డు లేదు. చెన్నూరు బి. డీ. ఓ. ఆఫీసునుండి ఏ ఉద్యోగులయినా వీజిట్‌కు గాని, ఇనస్పెక్షన్‌కుగాని రావాలంటే అంతదూరం నడుచుకుంటూ రావాల్సిందే. వర్షాకాలాల్లో అయితే మరీ కష్టంగా ఉంటుంది. ఈ రెండు గ్రామాలూ రెండు ద్వీపాల్లా తయారయి పోతాయి. ఉత్తరాలు రావు. ఉత్తరాలు పోవు. దినపత్రికలూ అంతే !

వీరాబాయి, సీత భోజనాలు ముగిసేసరికి రాత్రి తొమ్మిది దాటింది.

పిల్లలు వరండాలో కూర్చుని చదువు కుంటున్నారు. బయట వెన్నెల చిక్కగా కురుస్తోంది. గాలి చల్లగా వీస్తోంది. వీరాబాయి వరండాలోఉన్న మంచం మీద కూర్చుంది. నేను కుర్చీలో కూర్చున్నాను. సీత తలుపు దగ్గరున్న స్టూలుమీద కూర్చుంది. పిల్లలు చదువుకోవటం మానేసి వారిద్దరివంక చూడసాగారు.

'మీ హాస్టల్‌లో ఎంతమంది ఉంటున్నారు?' అడిగింది వీరాబాయి.

చెప్పాను.

'మేనేజరు ఎవరు?'

'ఏసురత్నం అని ఊటుకూరులో ఉంటున్నారు.'

'చూడ చూడ మీ పిల్లలు చాల బుద్ధిమంతుల్లా కనిపిస్తున్నారు' అన్నది సీత.

'మరి ఏమిటనుకున్నారు. మా పిల్లలు అన్నిట్లోనూ మొదటఉంటారు' అన్నాను.

'వెరీ గుడ్. ఆటల్లోనో ?'

'ఆటల్లో కూడా'

'పాటల్లోనో?'

'ఓ యస్'

'అయితే ఎవరినయినా ఒక పాట పాడమనండి. విందాం.'

ఓ యస్ అని అనటానికి అన్నానుకాని అది నిజంకాదు. గతుక్కుమన్నాను. మా హాస్టల్ పిల్లల్లో ఎవరు బాగా పాటలు పాడగలరో నిజానికయితే నాకు తెలియదు. పిల్లలవంక చూసేను. అందరి ముఖాల్లో నవ్వుగుర్తు కనిపిస్తోంది. ఉత్సాహంగా ఉన్నారు.

'మా వాళ్ళు ఊరకనే పాడరు' అన్నాను నెమ్మదిగా.

'లంచం తింటారా ఏమిటి?' చటుక్కున అడిగింది సీత.

'అవును.'

'ప్చ్. ప్చ్. నో యూజ్. లంచాలు తినటం మీరు చిన్నప్పటినుండే పిల్లలకు నూరిపోస్తున్నారా ఏమిటి?'

'పెద్దమాటే వదిలారు. నా ఉద్దేశం వేరు. లంచంఅంటే ఇక్కడ ముందు ఎవరయినా పాట

పాడితే ఆ తర్వాత మా పిల్లలు పాట పాడతారు. కదండ్రా.'

'ఆఁ' అన్నారంతా.

వరండాలోకి కొత్తగాలి ప్రవేశించినట్లుగా ఉంది.

'—అంటే మీ ఉద్దేశం మా ఇద్దరిలో ఎవరయినా ముందోపాట పాడాలి. అంతేనా?'

'అంతే.'

'నాకు పాటలు రావు. నామటుకు నేను ఉత్తి బాత్‌రూం సింగర్‌ను.'

'వీరాబాయిగారూ—మీరో?'

'డిటో' అన్నది వీరాబాయి.

సీత గలగలమని నవ్వి, 'మీ అవస్థ నాకు అంతుపట్టింది. మీ హాస్టల్ పిల్లలకు ఎవరికీ పాటలు పాడటంరావని నిజం వప్పుకోండి. మేము ఏమీ అనుకోము. ఏమంటారు వీరాబాయిగారూ?' అన్నది.

అవునన్నట్లు తలూపింది, వీరాబాయి.

సీత మాటల్లోని నిజం వప్పుకోటానికి నా మనసు గింజుకుంటోంది. సిగిరెట్ వెలిగించాను. సీతవంక చూశాను. ఆమె పెదాలు నవ్వుతున్నాయి. పిల్లలవంక చూశాను. నేనేం జవాబు చెబుతానో అన్నట్లు అందరూ అవుత్సుకంగా నా ముఖంలోకి తేరిపార చూస్తున్నారు. మీలో ఎవరు పాటలు బాగా పాడతార్రా అని అప్పుడు అడగటానికి సిగ్గువేస్తోంది. గొంతు సవరించుకుని, 'లేదు. మావాళ్లు చక్కగా పాడతారు' అన్నాను.

'అయితే ఎందుకాలస్యం? పాడించండి' అన్నది సీత.

పిల్లలవంక చూశాను. వరండాచివర్లో కూర్చున్న శేషయ్య లేచి నుంచున్నాడు. చేతులు కట్టుకుని, 'సార్! నేను పాడతానండీ' అన్నాడు.

తేలికగా గాలి పీల్చుకుని 'పాడు' అన్నాను.

శేషయ్య చిన్నగా రెండుసార్లు దగ్గి, పాట మొదలుపెట్టాడు: 'అందాలసీమా సుధానిలయం... ఈ లోకమే దివ్య ప్రేమమయం...' చదువుల్లో ఎప్పుడూ వెనకఉండిపోయే శేషయ్య కంఠస్వరం ఇంత మధురంగా ఉంటుందని నేను ఊహించనయినా లేదు. ఆ పూట వాడు నాకు ఎంచేతో కొత్తగా అపురూపించసాగాడు. పాట అయిపోయింది. అప్పుడే అయిపోయిందా అనిపించింది. వరండాచప్పట్లతో మారుమ్రోగింది.

'చాలా బాగాపాడాడు. అబ్బాయ్! ఏంపేరయ్యా నీది?' అడిగింది సీత.

'శేషయ్యండి'

'వెరీగుడ్. ఇంకో పాటపాడు'

'మీరు పాడండి' అన్నాడు శేషయ్య.

'అవును. ఈ సారి వంతుమీది. మీరు పాడాలి' అన్నాను.

'నేను ముందే చెప్పానుకదా. నాకు పాటలు రావని'

'కాదు. కాదు. మీరు పాడాలండోయ్' అన్నాడు మరో కుర్రాడు.

'సయిలెన్స్' అన్నాను.

గాజులు కదులుతున్న చప్పుడు మినహాయించి వరండా నిశ్శబ్దంగా ఉంది.

సీత తలవంచుకుంది. కాలి బొటనవ్రేలితో నాపరాయి మీద రాస్తూ 'మనసున మల్లెల మాలలూగెనే' ఎత్తుకుంది. చక్కటి కంఠస్వరమే గాని మాటలు వత్తి వత్తి పలుకుతోంది. పాటకు ఉండవలసిన సొంపుదనం రావటంలేదు. ఒక వచనం ముగించి రెండో వచనం మొదలుపెట్టగానే పిల్లల్లో ఒకడు కిసుక్కున నవ్వాడు. దాంతో అందరూ నవ్వారు. సీత పాట ఆపివేసింది. ఆ తర్వాత ఎంత బ్రతిమిలాడినా మళ్లీ పాడలేదు.

పదిన్నరవరకు పాటలతో, పద్యాలతో, కబుర్లతో కాలం తెలియకుండా గడిచిపోయింది. లయిట్లు ఆర్పివేసి అందరూ పడకలమీద చేరారు. నేను బయటకువచ్చి బావిప్రక్కనేఉన్న బండమీద కూర్చున్నాను. మామిడితోటలోంచి గాలి హోరుమని వీస్తోంది. సిగిరెట్ వెలిగించి వెన్నెల చల్లదనంలో తడుస్తున్నాను.

కొద్దిసేపటికి ఎండిపోయిన ఆకులమీద ఎవరో నడిచిన శబ్దం వినిపించింది. తలతిప్పి చూశాను. వీరాబాయి బావివయిపు వస్తున్నట్లు అనిపించింది.

నా హృదయస్పందన లిప్తకాలంపాటు స్తంభించి నట్లయింది. పరీక్షగా చూశాను. సీత! తెల్లటిచీరలో దేవతలా నేను కూర్చున్నచోటుకు వచ్చింది.

'ఏమిటిక్కడ కూర్చున్నారు?' అడిగింది.

'ఏమీలేదు.' అన్నాను.

'వెన్నెల బావుందికదూ!' అన్నది.

నా వెన్నులో చలి బయల్దేరి శరీరమంతా ఆక్రమించుకుంది. తలూపాను.

చేతులు కట్టుకుని తల పయికెత్తి నాలు గయిదు క్షణాలపాటు చంద్రుడివంకచూసి నిట్టూర్చింది.

'మీకు నిద్రపట్టటంలేదా?' అడిగాను.

నావంకచూసి, 'ఊహూఁ' అని తల అడ్డంగా ఆడించింది. చెవులకున్న దుద్దులు వెన్నెల వెలుగులో మెరిశాయి.

'కొత్త ప్రదే......'

నా మాటలకు—అడ్డువచ్చి, 'కొత్తప్రదేశం మాట అలా ఉంచండి. మీరిచ్చిన మంచంలో నల్లులు మస్తుగా ఉన్నాయి' అన్నది.

కూర్చోండి అందామనుకున్నానుకాని అనలేదు.

'మీ రెందుకు నిద్రపోలేదు?' అడిగింది.

'నే నెప్పుడూ ఆలస్యంగా నిద్రపోతుంటాను. రోజూ పన్నెండున్నర, ఒకటి అవుతుంటుంది.'

సీత ఏదో గుర్తు వచ్చినట్లు వాచీవంక చూసుకుని 'గుడ్‌నయిట్' అని నా జవాబుకోరకు ఎదురు చూడకుండా ఎండిన ఆకులమీంచి నడుచుకుంటూ హాస్టల్‌వయిపు వెళ్లిపోయింది. నా మనసుచుట్టూ ఆలోచనలు గుంపులు గుంపులుగా వచ్చిచేరాయి.

ఆ మరుచటిరోజు ఉదయం నేను స్కూలుకు బయల్దేరే సమయానికి వీరాబాయి, సీత చెన్నూరు ప్రయాణ మయ్యారు. ఓ పదిరోజులవరకు రోజూ ఇద్దరూ గుర్తు వచ్చేవారు. ఆ తర్వాత వారిసంగతే మర్చిపోయాను.

రెండునెలలు గడిచాయి.

ఒకరోజు మిత్రుడు వెంకటరామయ్య పెద్ద కోరుకొండినుండి బంజరవచ్చి నన్ను వాళ్లఊరు తీసుకు వెళ్లాడు. ఒక రోజంతా అతనింట్లోనే ఉన్నాను. ఆ మరుచటిరోజు ఆదివారం ఆ మధ్యాహ్నం భోజనాలు ముగించుకుని నేను, వెంకటరామయ్య సయికిళ్ళు ఎక్కి అతని తోటలను చూసేందుకు బయల్దేరాం. అతని తోటలు ఊరి పొలిమేరలో ఉన్నాయి. రెండు మూడు గంటలపాటు మిరపతోటలో గడిపాం. ఆ తర్వాత ఏం చేయాలో తోచలేదు.

'చెన్నూరువెళ్దాం పద' అన్నాడు వెంకటరామయ్య.

నాకు వెంటనే వీరాబాయి సీత గుర్తువచ్చారు.

'ఇక్కడ కెంతదూరం ఉంటుంది?' అడిగాను. చెప్పాడు.

'సాయంత్రానికల్లా తిరిగి వచ్చేయగలం కదా'

'ఆహాఁ'

'సరే' అన్నాను.

సయికిళ్లమీద బయల్దేరాం.

ఎండ పల్చగా ఉంది.

మట్టిరోడ్డు గతుకులు గతుకులుగా ఉంది.

'నీకు చెన్నూరు బాగాతెలుసా?' అడిగాను.

అతను పకపక నవ్వి 'భలేవాడివి. నీకు కొత్త అని నాకూ కొత్త అనుకుంటున్నావా? ఎందుకు తెలియదు? మా చెల్లెల్ని చెన్నూరులోనిచ్చాం' అన్నాడు.

'నీకు వీరాబాయి తెలుసా?'

'ఎస్. ఇ. ఓ. కదూ?'

'అవును.'

'తెలుసు. ఏం?'

'ఏంలేదు. ఊరికనే అడుగుతున్నాను.'

'కాని వీరాబాయి ప్రస్తుతం చెన్నూరులో లేదు. పదిరోజులక్రిందట బదిలీఅయి ఖమ్మం—అవతల ఏదో బ్లాక్‌కు వెళ్లిపోయింది. చాలా మంచిమనిషి. అయినా నీకు వీరాబాయి ఎలా తెలుసు?'

'వీరాబాయీ, సీతా ఒకసారి బంజర వచ్చారు.'

'సీత కూడానా?'

'ఆఁ'

అతను గమ్మత్తుగా ఈలవేసేడు. ఆ ఈల వేసిన పద్ధతి గమనిస్తే సీత అంటే చులకన అభిప్రాయం అతనికి ఉన్నట్లు అనిపించింది.

'మరి సీతను ఓ చూపు చూడలేదా ?' అన్నాడు.

నా వీపుమీద ఎవరో బలంగా చరిచినట్లు అనిపించింది.

'సీత హృదయం బహు విశాలమయినదిలే. ఏమడిగినా కాదనదు. వాళ్లది కొత్తగూడెం దగ్గిర చిన్న పల్లెటూరు. ఆ ఊరుపేరు నోట్లో ఉందిగాని... రావటంలేదు...సరే. పాపం. వాళ్లింట్లోవాళ్లు ఈ సీత పెళ్లిగురించి పట్టించుకోరు. ఎవర్నో ఒకర్ని కట్టుకుని సెటిల్ అయిపోదామని బోలెడంత తాపత్రయముంది. పాణిగ్రహణం చేయటానికి ఎవరూ ముందుకురాలేదు సరికదా పెళ్లి చేసుకుంటామని చెప్పి ఇద్దరు ముగ్గురు ముందస్తుగా కాపురం పెట్టేసి చివరకు మోసంచేసి పెళ్లి చేసుకోలేదు. రెండు మూడు ఎబార్షన్‌లు అయినాయని విన్నాను. నిజమెంతో నాకు తెలియదు. ఇప్పుడు పెళ్లిభ్రమలో ఉందో, లేదో తెలియదు. అందినకాడకి అహహ...'

సీతమీది జాలితో గుండె నిండింది.

నలభయిఅయిదు నిమిషాల తర్వాత చెన్నూరు చేరుకున్నాం. చెన్నూరు మాఊరిలా మురికిగాఉంది. రోడ్లమీద అటూఇటూ తిరిగి వెంకటరామయ్య చెల్లెలు ఇంటికి వెళ్లాం. బావమరిది ఆదివారం కాబట్టి పీకవరకు తాగి తందనాలాడి అప్పుడే అడ్డంపడ్డాడు. గంటపయిగా అక్కడే కూర్చున్నాం. వెంకటరామయ్య చెల్లెలు సాయంత్రంవరకుఉండి భోజనంచేసి వెళ్లమంటున్నా వినిపించుకోకుండా 'ఈసారి వచ్చినప్పుడు తింటాములే'అనిచెప్పి బయటకు నడిచాడు వెంకటరామయ్య. నేను అతన్ని అనుసరించాను.

బయటకువచ్చి సయికిళ్లు ఎక్కాం.

పెదకోరుకొండిరోడ్డు పట్టాం.

అరఫర్లాంగు వెళ్లాక వెంకటరామయ్య హఠాత్తుగా సయికిలు ఆపాడు. నేనూ ఆగాను.

'సీతను చూడదల్చుకోలేదా?' అడిగాడు.

సీతను చూడాలనిఉంది. నా అంతట నేను ఆ మాట చెప్పటానికి సంశయించాను. వెంటనే బయటపడిపోకుండా 'ఆఁ ఎందుకులెద్దూ!' అన్నాను.

'భలేవాడివి. ఇంతదూరంవచ్చి సీతను చూడకుండా వెళ్లితే ఎట్లా'

'సీత ఇల్లు నీకు తెలుసా?'

'ఈ చెన్నూరులో నాకు తెలియనిది ఏమీ లేదు... కమాన్'

సయికిలు వెనక్కితిప్పాడు.

పదినిమిషాలు ప్రయాణంచేసి వెంకటరామయ్య ఓ తాటాకుల ఇంటిముందు సయికిలు ఆపాడు. సిమెంటుగోడప్రక్కన నీడలో సయికిళ్లు స్టాండ్‌వేసి బెల్ మోగించాడు. వెంటనే తలుపు తెరుచుకుంది. సీత మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయింది.

తలుపులు బార్లా తెరిచి 'రండి. రండి' ఆహ్వానించింది.

లోపలకు నడిచాం.

గచ్చునేలమీద ముగ్గులు మోడరన్ ఆర్ట్‌లా చిక్కిరిబిక్కిరిగా ఉన్నాయి. చిన్నఇల్లు అయినా శుభ్రంగా ఉంది.

దుప్పటి దులిపి మంచంమీదపరచి, 'కూర్చోండి' అన్నది.

కూర్చున్నాం.

'ఎలా ఉన్నారు?' అడిగింది.

'బావున్నాను. మీరో?' అన్నాను.

'అలా అలా'

'ఇతను...' అంటూ వెంకటరామయ్యను పరిచయం చేయబోయాను. సీత నా మాటలకు అడ్డువచ్చి, 'నాకుతెలుసు. మీరు శివకామయ్య బావగారు కదూ!' అడిగింది అతన్ని.

అతను నవ్వి తలూపాడు.

మంచినీరు ఇచ్చింది.

పుచ్చుకున్నాం.

ప్రక్కింటి పిల్లవాడిని పిలిచి మేము వద్దంటున్నా వినిపించుకోకుండా వాడిచేతిలో రెండు రూపా

యల కాయితంపెట్టి హోటల్‌కు తరిమింది. అప్పుడు బంజర నచ్చిన సీతకూ,ఆ సీతకూ సహస్రాంశం తేడా సుస్పష్టంగా కనిపిస్తోంది. మనిషి నలిగిపోయినట్లు కనిపిస్తోంది.

పావుగంట తర్వాత కుర్రాడు హోటల్‌నుండి పకోడి, టీలుతెచ్చాడు. ముగించాక ఓ గంటసేపు పిచ్చి పాటిలోపడి ఆ తర్వాతలేచి 'మేమికవెళ్తాం' అన్నాను.

'అప్పుడే?'

'ఆఁ'

'బావుంది మీ మర్యాద. మీరు ఈ రాత్రికి ఇక్కడే ఉండండి. రేపు ఉదయాన్నే వెళ్దురుగాని'

'రేపు ఉదయాన్నే స్కూలుఉంది'

'సయికి లుందికదా. మీ ఊరికి ఇక్కడనుండి రెండుగంటల ప్రయాణం. స్కూలుకు అందుకో గలరు. ఈ రాత్రికి మీ రిక్కడ భోజనంచేసి వెళ్లాలి తప్పదు.'

'అట్లా అయితే మీరు నాకు సెలవిప్పించండి' అన్నాడు వెంకటరామయ్య.

'సరే' అన్నది సీత.

నేను, వెంకటరామయ్య కలసివచ్చాం. నన్ను భోజనంచేసి రేపు వెళ్లమంటోంది. అతన్ని భోజనానికి కూడా ఉండమనటంలేదు. కారణం నాకు అర్థం కావటం లేదు. నన్నువదలి అతను వెళ్లిపోవటం నాకు అయిష్టంగా ఉంది.

'నేనూ వస్తున్నాను' అన్నాను అతనితో.

'నువ్వుండు. రేపుఉదయాన్నే రా' అని బయట కొచ్చి సయికిలు అందుకున్నాడు.

'మాట' అన్నాను.

నా కళ్లల్లోకి సూటిగాచూసి కనుగీటి సయికి లెక్కి వెళ్లిపోయాడు వెంకటరామయ్య.

అప్పటివరకు సందడిగాఉన్న ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. మంచంమీద కూర్చున్నాను. సాయంకాలపు ఎండ. తలుపుచెక్కకు ఆనుకుని నుంచుంది సీత. స్టూలుమంచానికి దగ్గిరకు లాక్కుని కూర్చుంది. తను పరీక్షగా చూశాను. సీత అందగత్తె!

'ఏమిటలా చూస్తున్నారు?' అడిగింది.

'ఏమీలేదు' తలఅడ్డంగా ఆడించాను.

'నేనంటే మీకు భయమా?'

'లేదు. లేదే. భయమని అన్నానా?'

'అతనితోపాటు మీరూ వెళ్లిపోదామని అనుకో లేదూ?'

'అనుకున్నాను. మీకు శ్రమ ఇవ్వటం ఎందుకు చెప్పండి!'

'ఇందులో శ్రమ ఏమీలేదు'అని నవ్వింది.

ఆ నవ్వు సమ్మోహనంగా ఉన్నట్లనిపించింది.

ఆ రాత్రి భోజనాలు ముగిసేసరికి తొమ్మి దయింది. భుక్తాయాసంచేత నేను మంచంమీద పడు కున్నాను. సీత స్టూలుమీద కూర్చుని చెప్తున్నారు కబుర్లు, కొత్తగూడెం విశేషాలు చెబులోంటే అన్ని మయిళ్లు ఎండలో సయికిలు తొక్కటంవలన, కడుపు నిండా భోజనం చేయటంవలన, సీత మాటలు మయికంలో పనిచేయటంవలన వింటూనే నిద్రాదేవి ఒడిలోకి జారిపోయాను.

ఎంతసేపలా నిద్రపోయానో తెలియదు. సీత నన్ను తట్టిలేపుతోంటే కళ్లు తెరిచాను. మత్తుగా ఉంది. చల్లటిగాలి వీస్తోంది. లేచి కూర్చున్నాను. కాళ్లు, నడుం నొప్పిగా ఉన్నాయి. వాచీ చూసు కున్నాను. పదకొండూనలభయి అయింది. గదిలో హెరికేన్‌లాంతరు వెలుగుతోంది. సీతవంక చూశాను. సీత మంచంమీద కూర్చుంది. రవికెలేదు. తెల్లటి సిల్కుచీర కట్టుకునిఉంది. లోపల లంగాలేదు. నామత్తు ఒక్కసారిగా వదిలింది.

'నిద్రపోయేందుకా మిమ్మల్ని ఇక్కడ ఈరాత్రికి ఉండమన్నది?' అన్నది సీత.

ఆమె కంఠస్వరంలో మార్పు గమనించాను. ఆమె నన్ను ఆనుకుని కూర్చుంది. సన్నటి వణుకు గుండెలో ప్రారంభమయి రక్తంలో కలిసింది.

'నా ప్రశ్నకు జవాబు చెప్పరేం?' అన్నది మోచేత్తో నన్ను పొడుస్తూ.

నవ్వాను.

ఆ నవ్వు నా పెదిమలచివర విరిగిపోయింది.

నా కుడిచేయి అందుకుని చుంబించింది. సీత ఎర్రటి పెదిమలలోని మందోష్ణం నా చేతిలోని రక్తానికి తగులుతోంది. నా గుండె వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. నా నుదురు స్వేదపూరితం కాసాగింది. వణుకుతున్నాను. చటుక్కున నాచేయి తన ఛాతీమీద వేసుకుని జారిపోకుండా తనచేత్తో అదుము కుంటోంది.

'నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను'. నా చెవిలో అతి నెమ్మదిగా రహస్యం చెబుతున్నట్లు అన్నది.

టన్నురాళ్లు నా గుండెలో ఒక్కసారిగా పడినట్లు అనిపించింది.

'నిజం. మరి మీరో?'

నా గొంతులోని పచ్చి వెలగకాయ కదలటం లేదు.

సీత నా జవాబుకొరకు ఎదురు చూడలేదు. నా బుగ్గమీద చుంబించింది. 'మీ రంటే నాకు చాలా ఇష్టం. అందుకనే మిమ్మల్ని ఇక్కడ ఉండమన్నాను.' అన్నది. అని నన్నువదిలి మంచంమీద పడుకుని చేతులు చాపింది.

నా గుండె మంచులా తయారవుతోంది.

సీత ముందుకువంగి నామెడచుట్టూ చేతులు వేసి నన్ను తనమీదకు లాక్కుంది. ఆమె గుండెమీద నా తల. ఆమెగుండె కొట్టుకోవటం నాకు వినిపిస్తూ ఉంది.

రెండు క్షణాలాగి సీత చటుక్కున లేచింది. ఆమె హఠాత్తుగా ఎందుకులేచిందో నాకు అర్థం కాలేదు. ఆమె ముఖంలోకి చూశాను. సీత నావంక చూడటంలేదు. లేచి మంచందిగి గోడ కానుకుని స్టూలుమీద కూర్చుని — ఆ చుట్టుప్రక్కల ఇళ్ల వాళ్లకు వినిపించేలా—ఉన్నట్టుండి—పెద్దగా 'వదలండి. వదలండి'అని అరిచింది.

సీతకు దయ్యంగాని పట్టిందా అనుకున్నాను. నా గుండె వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. చటుక్కునలేచి కాళ్లు తపతప నేలకేసికొడుతూ, 'నన్నేమని అనుకున్నారు? గాలిదాన్నని అనుకున్నారా?' అడుగుతోంది నన్ను.

ఉలిక్కిపడ్డాను. నా పరిస్థితి కొంచెం కొంచెంగా నాకు అర్థమవుతోంది. సీత అతినేర్పుగా నన్ను పద్మవ్యూహంలోకి లాగటంలేదు. మొరటుగా లాగుతోంది. సీత మరోసారి గట్టిగా అరచిందంటే చుట్టుప్రక్కల ఇళ్లు మేలుకుంటాయి. ఇది నా ఊరుకాదు. సీత మాటలనుకాకుండా నా మాటలను నిజంగా పరిగణిస్తారని నమ్మకం ఏమిటి?

సీత తలుపు తెరిచింది. గొంతు మరింత పెద్దగావిప్పి, 'నువ్వింత గాలివాడవని తెలిసిఉంటే నా ఇంట్లోకి అడుగుపెట్టనిచ్చేదాన్నికాదు. ఎంత చదువుకున్నా గాలిమనుషులకు గాలిబుద్ధులు ఎక్కడికి పోతాయి? ఛీ ఛీ...'అంటూ శాపనార్థాలు పెడుతోంది.

నాకు ముచ్చెమటలు పోస్తున్నాయి. ఊహించని విధంగా గొడవపడుతున్నాను. పర్యవసానం ఎలా ఉంటుందో—అనూహ్యంగాఉంది. ఏంచేయటం? పరిస్థితి రభస అయ్యేట్టుగాఉంది. కాళ్లు వణుకుతున్నాయి. మంచందిగి నా గుడ్డలు అందుకుని తొడుక్కున్నాను. అంతర్రాత్రిలో పెదకోరుకొండి ఎలా వెళ్లటం? గుండె భయంతోనిండి పొర్లుతోంది. ఓట్రించె స్త్రీలలో ఏవిధంగా మాట్లాడాలో నాకు తెలియదు.

'అంతకోరికగాఉంటే పెళ్లిచేసుకోవచ్చుగా— పెళ్లిమటుకువద్దుగాని వళ్లు కావాలి. సిగ్గూశరమూ ఉండాలి మనిషికి...' అంటోంది.

నా పెదిమలు విపరీతంగా వణుకుతున్నాయి. సీత కళ్లల్లోకి తీక్షణంగా చూశాను. చేతులు తిప్పుతూ, 'కలేజాఉంటే పెళ్లిచేసుకుని చూపించు...' అన్నది.

గొంతు సవరించుకుని, ధైర్యం పుంజుకుని 'నేను పెళ్లిచేసుకోలేను. మిమ్మల్నే కాదు. ఎవరి నయినా...నా కసలు పెళ్లిచేసుకునే అదృష్టమేలేదు' అన్నాను.

వెంటనే విసురుగా ఏదో అనబోయింది కాని అనలేదు. ఆమెముఖంలో రంగులు మారాయి. పాల పొంగుమీద నీరుపడినట్లు చల్లబడింది. నా మాటలు నమ్మలేనట్లు తల అడ్డంగా ఆడించింది.

తిరుపతి : మంచిదేనయ్యా.. తయారవ్వాల్సిందే. 'అస్మద్గోత్ర మభివర్ధతాం' అంటూ సంతోష పడాలి.

వెం. శా : వర్ధిల్లాలి. నేనూ కాదనను. నేడు మును పటిలాగా ప్రాచీన ఛందస్సు ప్రకారం కవిత వ్రాయవలసిన పనిలేదట. వచనంగాగూడా వ్రాయొచ్చట. దాన్ని వచన కవిత్వం అంటారట. యతిప్రాసలు లేకుండా కవిత్వం వ్రాసే వాళ్ళూ ఉన్నారట. ఇదిలాఉండగా ఇంకోప్రక్క దిగంబరకవులనే వాళ్ళు బయలుదేరారట.

తిరుపతి : సరేగానీ యతిప్రాసలు లేకుండా వ్రాస్తే అది కవిత్వమవుతుందా? వింటుంటే నవ్వుగా ఉందే వెంకటశాస్త్రీ.

వెం. శా : ఇది నేనక్కడున్నప్పుడే ప్రారంభదశలో ఉండింది. ఇప్పు డెక్కువైందేమోమరి. యతి ప్రాసలనుకూర్చి కవిత్వం వ్రాయడం వారికి కష్టం గాబట్టి వారట్లా వ్రాస్తారు. కొందరికి యతిప్రాసలు లేకుండా కవిత్వం వ్రాయడంకూడా కష్టమే. ఇది వీరి కెంత కష్టమో అదీ వారికంత కష్టమేనయ్యా! యతిప్రాసలవల్ల కవిత్వానికి అందం చేకూరుతుంది. అవి భాషకు సహజాలంకారాలు గదుటయ్యా.

తిరుపతి : ఇపుడు నువ్వు దిగంబరకవులన్నావే వాళ్లెవ్వరయ్యా క్రొత్తగా? వారేమి వస్త్రవిహీనులా? ఈ పేరు వినలేదే.

వెం. శా : వాళ్లా వాళ్ళు క్రొత్తగా తయారయ్యారటలే. సమాజంలోఉండే అసమానతను, కుల తత్వాలను, ఆర్థిక వ్యత్యాసాన్ని పోగొట్టడం వారి ధ్యేయమట. కాని వారి కేకలు విన్న వాళ్లెవరూ ఇంతవరకూ లేరట. వారు తమకు తోచిందంతా వ్రాస్తున్నారు. అంతా కవిత ఔతుందాఅన్న ఆలోచనే వారికి లేదు. ఈ దిగంబరులు తమ కవిత్వమేదో గొప్పఉద్యమాన్ని లేవదీస్తున్నదని భ్రమ పడుతున్నారుట. ఉద్యమ మంటే మాటలా?

తిరుపతి : అది పోనీగానీ. పద్యకవిత ఎలా ఉందట?

వెం. శా : మన కవితకేం. ఎంతమంది ఈసడించినా, మూతులు ముడుచుకున్నా దానికున్న గౌరవం, స్థానం ఉండనేఉంది. నేడు గూడా మహాకావ్యాలు, ఖండకావ్యాలు వ్రాసే వాళ్ళున్నారు. వ్రాస్తున్నారు. కానీ వీరిలోగూడా కొందరు బెండులాంటి పద్యాలు వ్రాస్తున్నారు. అవి ఛందోబద్ధ పద్యాలవుతాయేగానీ కవిత్వ మనిపించుకోదు. కవిత్వానికి కావలసిన లక్షణాలను వారింకా గుర్తించలేదు. కవిత్వంగూడా ఒక కళ గదటండీ. కవులు పుట్టుదురుగానీ చేయబడరుగదా! కవి కలంబట్టి వ్రాసింది ప్రతిదీ కవిత్వమెలా అవుతుంది. ఇది ఇలా ఉంటే— అసలు 'కవిత్వమంటే నవ్యత ఉండేదే. కవిత్వమంటే నవీనమనే అర్థం. అలాంటప్పుడు నవీనకవిత్వమన్న మాటేలేదు. ఇప్పుడు భారతం తీసుకోండి. ఏరోజు చదివినా దానిలో ఏదో ఒక నవ్యత కనిపిస్తోంది. కవిత్వమంటే ఒక సారి విని, చదివితే అది మన నోటికి రావాలి· మన జిహ్వాగ్రాల్లో నాట్యమాడాలి. అదే కవిత్వం' అనేవాళ్లు లేకపోలేదు. ఇదీ కొంతవరకూ నిజమే. నేడు "తగిన సామగ్రి దొరకిన ధారలేదు. ధారగల్గిన సామగ్రి దనరఁబోదు." ఇదీ స్థితి. పోనీ ఇలా కష్టపడి ఒక కవి రసవంతమైన కావ్యం వ్రాశాడనుకో. అందులో ఏవో కొన్ని పొరబాట్లుంటాయి. సాధారణంగా తప్పులు దొర్లడం పరిపాటే. అంతమాత్రంచేత అది పనికిరాని కావ్యమని త్రోసిపారేస్తే ఎలా? కవిత్వం ఆనందానుభూతినిస్తుంది. ఆ ఆనందానుభూతిపొందే అదృష్టం అందరికీ ఉంటుందా. సహృదయుడైతేనే అది సాధ్యం, అదే కళా హృదయమంటే. నేను అన్ని వ్యాకరణాలకన్నా శ్రవణ వ్యాకరణాన్ని పాటిస్తాను. శ్రవణానందం గలిగితే చాలు. ఒక గ్రంథం చదివిన తర్వాత తనకు శక్తి ఉన్నంతలో రసాస్వాదన చెయ్యాలిగాని స్తనశల్య పరీక్ష చేయడం సబబు కాదు. 'ప్రమాదోధీమతామపి' అని గదా

# సుకవిద్వంద్వము స్వర్గలోకమున...

## శ్రీ పణతుల నరసింహయ్య

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, దివాకర్ల తిరుపతిశాస్త్రి వీరిరువురూ జంటకవులు. వీరినే తిరుపతి వేంకటకవులంటారు. వీరు ఇటు గద్వాల, అటు చెన్నపట్టణం ఈమధ్యగలదేశం తిరిగి అవధానాలు, కవితాగోష్ఠులు నిర్వహించారు. పలువురిచే సన్మానాలు పొందారు. ఇప్పుడున్న సుప్రసిద్ధులగు కవిపండిత విమర్శకాగ్రగణ్యులందరూ వీరి శిష్యులే. వీరి కవిత ప్రాచీనకవితకు భరతవాక్యాన్ని ఆధునికకవితకు నాందీవాక్యాన్ని పలుకుతూ వారికి ఆంధ్రసాహిత్యంలో శాశ్వతస్థానం సంపాదించి యిచ్చింది. నేడు వారు లేరు. స్వర్గసీమలో వారు కలుసుకొంటే ఎలా ముచ్చటించుకొంటారో ఊహించి వ్రాయబడిందే యిది.

---

తిరుపతిశాస్త్రి : ఏమోయ్ వెంకటశాస్త్రీ ! కులాసానా? ఏం మరీ ఈమధ్య నల్లపూసయిపోయావే. మొన్నసాయంత్రంగూడా నీకోసం వచ్చా. ఎక్కడికో వెళ్లావన్నారు.

వెంకటశాస్త్రి : రా తిరుపతీ. నల్లపూసెందుకౌతాగానీ, నేనే నీకోసం వద్దామనుకున్నా. రా. కూర్చో.

తిరుపతి : ఏమి సంగతి? ఎందుకోసం?

వెం. శా : ఆ. ఏమీలేదు. భూలోకంలో మనవాళ్ల సంగతులేమైనా తెలిశాయేమో విచారిద్దామనుకున్నా. ఇలా అనుకుంటూఉంటే నారదులవారు వచ్చారు. ఇంతసేపూ ఆయనతోటే కబుర్లు.

తిరుపతి : నేను రావడమూ అందుకోసమే. అరరే. నారదులవారిని చూడలేకపోయానే. పోనీ— ఏమిటి అచ్చటి విశేషాలు? ఎల్లా ఉన్నారట మనవారు?

వెం. శా : ఓయమ్మ. విశేషాలకేం. బోలెడన్ని చెప్పారు. మనవారంతా కులాసాగా ఉన్నారట. కానీ పరిస్థితులన్నీ పూర్తిగా మారాయట. మానవుల్లో ఈర్ష్యాద్వేషాలు పెచ్చుపెరిగాయట.

తిరుపతి : మంచిదే. మానవుల్లో ఈర్ష్యాద్వేషాలు పెరిగాయటనా. ఈర్ష్యాద్వేషాలు భూలోకంలో గాకపోతే మరెక్కడుంటాయిలే. మానవుడెక్కడుంటాడో అవీ అక్కడుంటాయి. ఇపుడు చంద్రలోకంలో గూడా నిండుకొన్నాయో యేమో మరి. సరే. పోనీలేగానీ అచట సాహిత్య పరిస్థితు లెలాఉన్నాయన్నారో చెప్పు. కవిత్వ మెలా ఉన్నదట.

వెం. శా : కవిత్వమా ! బోలెడంతమంది కవులుంటే కవిత్వానికేం కొదువ. నేడచట కవిత్వం పలువేషాలు వేసుకొందట. ఇంకెన్నివేషాలు వేసుకొంటుందో తెలియదుమరి. ప్రాచీనకాలంలో సాహిత్యాన్ని ముఖ్యంగా కవిత్వాన్ని ధర్మప్రచార సాధనంగా ఉపయోగించుకొన్నారు. నేడు ప్రతి చిన్నదైన ప్రచారానికీ కవిత్వమే. అందువల్ల కవిత్వంలో భావము, వస్తువు పేలవములై చవక బారుగా తయారైందట. కవిత్వం ప్రచార సాధనంగా పనికివస్తుంది. కానీ ఏదైనా విపరీతమైతే కష్టంగదా ! పూర్వం కవులు వ్రేళ్లమీద లెక్కబెట్ట గలిగేటట్లు ఉండేవాళ్లు. నేడో ఇంటింటికీ ఇద్దరూ ముగ్గురూ తయారయ్యారట.

అర్యోక్తి. ఇదిలా ఉంటే కొందరు తనకు వచ్చిన నాల్గునిఘంటు పదాల్ని తన కావ్యంలో వ్రాసి పాఠకుల్ని నిఘంటువు కొనుక్కో మంటారు. వీరు పాఠకులకు గలుగు విసుగును గుర్తించరు. 'పాఠకులను ఆనందభరితులను చేసి, వారికొక సత్సందేశ మివ్వడమేగదా కవిత్వోద్దేశ్యం.'

తిరుపతి: నాటక సాహిత్యమెలా ఉందట? క్రొత్త నాటకాలేమైనా వచ్చాయటనా?

వెం. శా: పూర్వం పూర్వమంటున్నా పూర్వందాకా ఎందుకు. మనం చదువుకొనేటప్పుడు, ఇటీవల వరకుగూడ కావ్యాదుల పఠనం తర్వాతనే నాటక పఠనం జరిగేది. అలాగే రచన చేసే టప్పుడుగూడ శతక రచన ప్రారంభించి, కావ్యరచనచేసి, తుదకు నాటకమును వ్రాసే వారు. దానికీ ఎంతో అనుభవముండాలి. నేడో రచనా ప్రారంభమే నాటకంతోనో, నాటిక లోనో జరుగుతూ ఉంది. వీరు 'నాట కాంతం హి సాహిత్యం' అన్న వచనాన్ని వ్యర్థం చేస్తున్నారు. ఇది శోచనీయంగదూ! నేడు నాటకాలు వ్రాసేవారు తక్కువటగానీ నాటి కలు వ్రాసేవారు సందుకైదుగురున్నారట. ఇక మన నాటకాలు విరివిగా ప్రదర్శింప బడడంలేదట. కానీ మన పద్యాలకు చెవి నిక్కించి ఆలించేవాళ్లు దండిగా ఉన్నారట. సినిమాల్లోను, రేడియోలోను, హరికథల్లోను మన పద్యాలుండనే ఉంటాయి. అవి చిరకాలం ఆంధ్రుల జిహ్వాగ్రాల్లో నాట్యమాడుతాయి. కానీ యీ సినిమాలు వచ్చినతర్వాత నాటక సంఘాలు క్రిందబడ్డాయి.

తిరుపతి : మరచాను. ముఖ్యమైంది. మన అవధాన విద్యకేమాత్రం స్థానముందట? ఆ విష యాలు తెలుసా?

వెం. శా : అవధానములంటే మేను పులకరిస్తోంది. ఆంధ్రుల ప్రత్యేకత ఉట్టిపడే విద్యగదండీ అది. నేడుగూడ అవధానవిద్య విస్తృత ప్రచా రంలో ఉంది. పూర్వంలోలాగా ఆదరించి పోషించే మహారాజులు, సంస్థానాధీశులు లేకున్నను నేడు విద్యాసంస్థలా పనిచేస్తున్నాయి. ప్రస్తుతం అవధానాలు చేసేవాళ్లలో 'సుబ్బన్న శతావధాని' మేటియట. అసంఖ్యాకంగా అవధానాలు చేశాడట. చేస్తున్నాడట. అతడేగాక మరెందరోగూడ యీ విద్యను ఆదరంతో సాభిమానంతో సాధి స్తున్నారట. అవధానుల సంఖ్యగూడా పెరుగు తున్నదట. ప్రజలకుగూడ దానిపై ఆదరాభి మానాలు ఎక్కువగుతున్నాయట. ఇది సంతోష దాయకంగదా!

తిరుపతి : ఈమధ్య రచయితల సభలని జరుగుతున్నా యని విన్నానే. వాటి కథేమిటి?

వెం. శా : నేనే చెప్పాలనుకుంటూండగానే నువ్వే అడి గావే. ఈమధ్య అఖిలభారత తెలుగు రచయితల సభలని నాలుగుమార్లు ప్రసిద్ధస్థలాల్లో జరిగాయట. మొన్ననే హైదరాబాద్‌లో ఐదవ సారి గూడా జరిగాయట. ఇవేగాకుండ ప్రతి జిల్లావారు ఒకచోటచేరి జిల్లా రచయితల మహాసభలు జరుపుకుంటున్నారట.

తిరుపతి : ఇన్ని జరుగుతున్నాయన్నావే. మంచిదే. కానీ వీటివలన కాస్తయిన ప్రయోజనముందా?

వెం. శా : లాభమంటూ కొంత ఉండకపోదు. నలుగురు కలిస్తేనే ఎన్నోవిశేషాలు తెలుస్తాయే. ఇక పలు వురు రచయితలు ఒకచోట చేరితే చెప్పాల్సా. వారికి నచ్చినవిషయాలనుగూర్చి ముచ్చటించు కుంటారు. ఎన్నోక్రొత్తవిషయాలను తెలుసు కుంటారు. కానీ వీరుచేసే తీర్మానాలు, అచటికి ప్రారంభోత్సవాదులు చేయడానికివచ్చే రాజకీయ చతురుల వాగ్దానాలు అడుగుదాటవు. ఆచరణకు రావు. తంజావూరు సరస్వతీమహలులోని తెలుగు గ్రంథాల వ్రాతప్రతులను ఆంధ్రకు తరలించ మన్నారు. వినిపించుకొనేవాడెవరు? ఇదిలా

ఉండగా 'తెలుగు కన్నడభాషలకు ఏక లిపి' తయారుచేయాలని అనుకుంటున్నారట.

తిరుపతి : అదేమిటయ్యా! క్రొత్తగాఉందే. మనభాష వేరు. వారి భాషవేరు. అక్షరసామ్యం ఉండొచ్చు. అంతటితో సాహిత్య మొక్కటిగా ఎలా అవుతుంది? ఒక భాషలోఉన్న అక్షరాల రాత ఏడుస్తుంటే దీన్ని దాన్ని కలపడం సర్వ నాశనం చేసుకోవడం అవుతుంది. మనభాషలో ఉన్న అక్షరాలనే తగ్గించి లిపి సంస్కరణ చేయాలన్నారే. అది ఆలోచించి చేయవచ్చుగా.

వెం. శా: ఇదిలా ఉండగా ఇప్పుడింకో గొడవవచ్చింది. మన ఆంధ్రదేశంలో డిగ్రీ తరగతుల్లోగూడ విద్యాబోధన తెలుగు భాషలోనే సాగాలి అని ప్రభుత్వమూ విశ్వవిద్యాలయాలు తీర్మా నించాయి. ఇంతకుముందు ఇంగ్లీషులో బోధింపబడేది. అప్పుడు ఇంగ్లీషులో పుస్తకా లుండేవి. తెలుగులో బోధించాలి గాబట్టి ఆ పుస్తకాలనన్నిటినీ ఇప్పుడు మనం తెలుగు చేసు కోవాలి. అదీ ఇప్పుడొచ్చిన ఇబ్బంది. అను వాదం చేసేటప్పుడు ఎన్ని సమస్యలు ఉత్పన్న మవుతాయో నీకు తెలుసుగా. ఎలాంటి భాషలో చెయ్యాలి? భావం వచ్చేటట్టు అనువదిస్తే చాలా? లేక మక్కికి మక్కిగా ఉండాలా? ఇలా వస్తాయి ప్రశ్నలు. అనువాదమంటే కత్తిమీద సాములాంటిది గదా! దీనికన్నా ఒక క్రొత్తపుస్తకమే వ్రాయొచ్చు నన్నడిగితే. అనువాదం చేయబడ్డ పుస్తకాలు సకాలంలో విద్యార్థుల కందడంలేదు. అసలుకొన్ని అవసర పుస్తకాల అనువాదమే జరగలేదట. చేసిన అను వాదం కృతకంగా ఉన్నదట.

తిరుపతి : ఇదంతా ముందు సిద్ధంచేసుకొని తరు వాత బోధనకు పూనుకొనిఉంటే బాగుండే దేమో.

వెం. శా : మంచి మాటచెప్పావు తిరుపతీ! అది ప్రభుత్వం ఆలోచించి ఉండవలసింది. విజ్ఞాన శాస్త్ర గ్రంథాలన్నీ వ్యవహారిక భాషలోనే వ్రాయాలని కొందరు సిఫార్సుచేశారు మంచిదే. కాదనను. గ్రాంధికంలో వ్రాసి విద్యార్థుల చేతికి నిఘంటువునిమ్మని నేనూ చెప్పను. అది శిష్ట వ్యవహారికంగా ఉండిఉంటే బాగుండే దేమో. నా అభిప్రాయం నీకు తెలుసుగా. కవి కలంబట్టి వ్రాసే ప్రతిదీ గ్రాంధికంగా ఉండాలన్న నియమానికి నా మనస్సంగీక రించదు.

తిరుపతి : పోనీ, సాహిత్యవిమర్శ ఎలాఉందట ?

వెం. శా : విమర్శఅన్న పదాన్ని వీరు సరిగా అర్థం చేసుకోలేదు. విమర్శ చేసేటప్పుడు కేవలం దోషాలనేగాక గుణాల్నిగూడా చూపాలి. దోషా లను సహృదయతతో దిద్దాలి. నేడు కొందరు గ్రంథవిమర్శలు చేస్తున్నారట. 'ఈ పుస్తకం చాలా చాలా బాగుంది. ఇది ఏమీ బాగాలేదు' అని. ఇలావ్రాస్తే ఏం ప్రయోజనం? విమర్శ కుడికి సహృదయత, సహనము ఉండాలి. నేడూ కొన్ని మంచి విమర్శ గ్రంథా లొస్తు న్నాయి. కాదనలేము. అంతేగాదు నే డింకొకటి ఎక్కువైంది. నేడేమికానీ ఈ అంటువ్యాధి చాల రోజులనుంచే వస్తూన్నది. ఎవడో ఒకడు పుస్తకం వ్రాశాడనుకో. దానిని వాడు ప్రసిద్ధు లందరికీ చూపి అందరి అభిప్రాయాలూ వ్రాయించుకుంటాడు. ముందు ముద్రిస్తాడు. అభిప్రాయాలు వ్రాసేవారు పరిశీలించి వ్రాస్తారంటేనా అదీ చేయరు. వీరి పోరు భరించలేక 'ఇది చాలా బాగుంది. రసం చిప్పిలు తోంది. పాత్రపోషణ బాగుంది. ఉక్తివైచిత్రి బాగుంది. ఈ పద్యం చూడండి. ఇది చద వండి. పద్యముల నడక కుంటువడక సాగింది' అని ఇలా తెగవ్రాస్తారు పొగడుతూ. అంతే. కానీ పుస్తకం చదివి ఉన్నవిషయం వ్రాసేవాళ్ళు తక్కువ. పుస్తక మెంతుంటుందో ఈ అభి ప్రాయాలంత రెండింతలుగ తయారవుతాయి. ఉన్నది ఉన్నట్లు వ్రాసిస్తే ఆ అభిప్రాయాన్ని అడుగున పారేస్తారు. భారతంమీద ఎవడి

అభిప్రాయముండినది? మనుచరిత్రను మెచ్చుకుంటూ ఎవడు సర్టిఫికెట్టు నిచ్చాడు. చేతగాని వాడికేగదా యీ సర్టిఫికెట్లు. సరి. ఇది ఇలా ఉంటె కొంతమంది వ్రాసే కావ్యాల్లోని భాషనుగూర్చి విమర్శించే వాళ్ళూ లేకపోలేదు. మనకు ఆంగ్ల భాషతోను, హిందీతోను, ఇతర ప్రాంతీయ భాషలతోను సంబంధం ఉంది. ఆ భాషలోని పదాలువచ్చి నద్దాన్ని మన భాషలో అన్యదేశ్యాలవుతాయి. అలాంటి వాటిని మనం ఉపయోగించడమూ జరిగింది. నేడూ కొందరు బాగా ఉపయోగిస్తున్నారు. దీన్నొక పెద్ద తప్పుగా భావిస్తారట కొందరు' నేనందుకే ఒసారి 'కాలాన్ని, దేశాన్ని ప్రభుత్వాన్నిబట్టి భాషమారుతూ ఉంటుంది. మన భాషలో ఆ విధంగా ఎన్నో అన్యదేశ్యాలున్నాయి. మేమూ వాటిని ఉపయోగించాము' అన్నాను. గుర్తుందిగా!

తిరుపతి: ఉంది. ఉంది. మరచిపోతానా! సరే అదంతా అలా ఉండనీగానీ. నీ శిష్యులెలా ఉన్నారట! నిజంగా అదృష్టమంటే నీదేనయ్యా! ఎంత మంది శిష్యుల్ని సంపాదించుకొన్నావు. నన్నయకు తిక్కనకుగూడ ఇలాంటి శిష్యులులేరు. ఇంత గౌరవం లేదు.

వెం.శా: శిష్యులా! శిష్యులకేం కొదవ. బోలెడంతమంది ఉన్నారు. అయినా వారూ ఒకరొకరే భూలోకాన్ని వదలుతున్నారు. నన్ను చాలా మంది గర్విష్ఠి అనేవాళ్ళు. నిజంగా నేనెందుకు గర్వించే వాణ్ణంటే నా శిష్యులు నన్నుమించి తయారయ్యారు గనకనే. చెప్పాలంటే శివరామశాస్త్రి తక్కువవాడా. ఇప్పుడున్న వాళ్లలో మా విశ్వనాధ నీకు తెలుసుగా. వాడు ఇపుడు నిజంగా విశ్వానికే నాథుడయ్యాడు. సాహితీ జగన్నాథుడయ్యాడు.

తిరుపతి: అన్నట్టు మరచా. నీవు కొద్దికాలం పాటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవిగాఉంటివే. ఇపుడా స్థానంలో ఎవరుంటున్నారయ్యా?

వెం. శా : అదా తిరుపతీ. నా తరవాత శ్రీపాదవారు, వారితర్వాత కాశీ కృష్ణాచార్యగారు ఆ స్థానంలో నియమింప బడ్డారట. కృష్ణాచార్యుల తర్వాత ఇంతవరకూ ఆస్థానం అలానే ఖాళీగా ఉండి పోయిందట. ఎవరినీ నియమించలేదట. ఇలా రెండురోజులుండి అసలా స్థానమే లేదంటారో ఏమో మరి.

తిరుపతి : ఏం ? ఎందుచేతట ? కవులెవ్వరూ వీళ్ల కంటికి కనుపించలేదా ?

వెం. శా : ఎందుచేతంటే ఏం చెప్పాలి? ఇది రాజకీయాలకు సంబంధముండే విషయం. రాజకీయాలకు సంబంధముండే విషయాలేవీ తొందరగా తేలవుగదా ! అదీగాక ఇప్పుడక్కడ ప్రాంతీయభేదా లెక్కువయ్యాయట. ఆంధ్రా—తెలంగాణాఅని. ఏప్రాంతంవాడి కివ్వాలని ఆలోచిస్తున్నారోఏమో! అదీగాక ఈమధ్య నొకసారి కొందరు నాయకులు ఒక విజ్ఞాపన పత్రంలో శ్రీ జాషువాకవిని ఆస్థానంలో నియమించమని కోరారట. కానీ వారు ఆయన్ను ఆ స్థలంలో నియమించలేకపోయినా రెందుకో. అసలాయన ఆ లోకమే వదిలాడట ఈమధ్యనే పాపం. ఇలా ఉంటే అసెంబ్లీలో ఒకమారు కొందరు సభ్యులుగూడ ఈ విషయాన్ని లేవదీశారట. ప్రభుత్వమింత ఆలస్యమెందుకు చేస్తున్నదో అర్థం కావడంలేదని విసుగుపడుతున్నారట అచటి సాహిత్యాభిమానులు. ప్రతిదీ ఇలాగే తయారవుతున్నదట.

తిరుపతి: ఇవన్నీ వింటుంటే మన రోజులే ప్రశాంతంగా గడిచాయేమో అనిపిస్తుందిగదూ వెంకట శాస్త్రీ! ప్రతిదానికీ ఇంత జాప్యం జరగడం విచారకరంగదూ!

వెం.శా: మంచిమాట చెప్పావయ్యా!

తిరుపతి: సరే. పొద్దయింది. వస్తా. వెళ్లాలి.

వెం. శా: ఇప్పుడెక్కడికయ్యా వెళ్లడం. ఉండు భోంచేసి వెళ్ళువుగానీ, నేనూ వస్తా. పోదాం.



# మహాకవి తులసీదాసు-స్రష్ట-ద్రష్ట

శ్రీ షేక్ మౌలాలి

ప్రతిమహాకవికి రెండు రూపాలుంటాయి-(1) స్రష్ట రూపము (2) ద్రష్టరూపము. మొదటిది భావ పక్షమునకు సంబంధించింది. రెండవది పరిశీలనా దృష్టికి చెందినది. మహాకవి తులసీదాసులో ఈ రెండు పక్షములు పరిపూర్ణత నొందాయి. కాని వానిలో కవి ఏ వైపు మొగ్గాడు అనేది తేలే సమస్యకాదు. ఒకవైపు తులసీ 'స్వాంతః సుఖాయ' అంటాడు. మరోచోట—

కహ ఉ కథా సోయి సుఖద సుహా ఈ,
సాదర సునహు సుజన మన లాయీ,

(సుఖప్రదమైన, శుభప్రదమైన ఆ రామ కథను వినిపిస్తాను. ఓ సజ్జనులారా! సాదరంగా ఏకాగ్రచిత్తులై వినుడు.)

ఇక మనం కవిలోని రెండు రూపాల్ని పరిశీలిద్దాము.

## స్రష్టగా తులసీదాసు కావ్యసృష్టి—కావ్య ప్రేరణ—కావ్యరీతులు

తులసీదాసు అనేక కావ్యములు రచించాడు. వానిలో 'రామచరిత మానస్', 'వినయ పత్రిక', 'గీతావళి', 'కవితావళి', 'దోహావళి' 'రామ లలా నహ ఛూ' మొదలైనవి ప్రసిద్ధములైనవి. అన్ని కావ్యముల కేంద్ర బిందువు రాముడే! అన్నింటిలోని ఇతివృత్తము రామకథే! కావ్యరూపములలో భేదమున్నప్పటికీ విషయం మాత్రం రామునికి సంబంధించిందే! కారణం సకల జీవజగత్తూ జడజగత్తు గూడా రామమయ మంటాడుకవి.

'జడచేతన జగజీవ జత సకల
రామ మయ జాని'

ఎప్పుడైతే విశ్వమంతా రామమయమైందో, విశ్వంలోని కవి, కవిప్రేరణ, కవికృత్యాలుకూడ రామ మయం కావలసిందే! జగత్తుకు మూలమే రాము డంటాడు తులసీదాసు —

జగత ప్రకాస్య పకాసక రామూ,
మాయాధీస గ్యానగునధామూ

రామభక్తియొక్క ప్రతిరూపమే తులసీదాసు కవిత్వమనటం అతిశయోక్తి కానేరదు. రామభక్తే కవితారూపంలో ప్రవహించినదనవచ్చును. రామ చంద్రుని అనంతరూపము, శక్తిసంపన్నత, శీలస్వభావ ములచే కవి సర్వత్ర తన్మయుడై ఆత్మానుభూతిని పొందాడు. కాని ఈ అనుభూతి 'నానాపురాణ నిగమాగమ సమ్మత'మయింది. ఈ భావననే కవి వేర్వేరు కవితారూపాల్లో మలిచాడు. దాదాపు తులసీ కావ్యాలన్నీ రామమయమే! కాని ఆకృతులు వేరు—కొన్ని ప్రబంధకావ్యాలయితే కొన్ని ఖండకావ్యాలు, కొన్ని ముక్తక కావ్యాలు, మరికొన్ని ప్రగీతకావ్యాలు.

తులసీ కవి హృదయంలో మనం ప్రకృత (Realistic) మరియు అతిరంజిత (Exaggerative) రూపాలు పొందగలము. రామచరితమానస్ మొదటి వర్గానికి సంబంధించింది. అందులో కవి సంపూర్ణజీవితదృష్టికోణం కన్పిస్తుంది. అప్పుడప్పుడు కవి తన వ్యక్తిగతభావనలకు స్వస్తిచెప్పి సమాజం లోని వాస్తవికవిషయాలను గురించి చర్చిస్తాడు. 'మానస్'తప్ప మిగతా కావ్యాలు రెండవ తరగతికి చెందినవి. వీనిలో అతిరంజిత భావాభివ్యక్తి అధికంగా లభిస్తుంది. భావం అనుభూతిపై ఆధారితమైనప్పటికీ అలౌకికము ఎక్కువగా కన్పిస్తుంది.

## విషయము—చరిత్ర చిత్రణ

ప్రబంధపటుత్వముతోపాటు ఆసక్తిదాయకమైన 'వక్త—శ్రోత' విధానము 'మానస్'లో ఉంది. గరుడునికి కాకభుశుండి చెప్పిన కథను శివుడు పార్వతితో చెప్తాడు. శివునిచే వర్ణింపబడిన ప్రథను యాజ్ఞవల్క్యుడు భరద్వాజునితో చెప్తాడు. అదే విషయాన్ని తులసీ సంతసమాజానికి వినిపిస్తాడు.

ఈ విధానంలో రసభంగం కలుగదు. పాఠకుడు జిజ్ఞాసతో ముందుకుపోతాడు. ఉపమ, రూపక అలంకారములు తులసీ ఎక్కువగా ఉపయోగించాడు. కారణం ఈ రెండు అలంకారాలు యోజనాబద్ధంగా ఉంటాయి. అక్కడక్కడ ప్రకల్పనకొరకు ఉత్ప్రేక్షనుకూడ ఉపయోగించాడు. 'కవితావళి' మొదటి పద్యంలో బాలరాముని చతుర్వర్ణన చూడండి—

తులసీ మన రంజన రంజిత
అంజన నైన సుఖంజన జీతకసే
సజనీ ససి మే సమ సీల ఉభై
నవనీల సరోరుహ సే వికసే.

కొందరు కవుల ప్రకృతి వర్ణన పరంపరాగతంగాఉంటుంది. మానవుడుకూడా ప్రకృతిలో ఒక అంశమే! మానవుని రూపవర్ణన, హావభావవర్ణన కూడ ప్రకృతివర్ణన అనవచ్చును. విల్లును ఎక్కుబెట్టి మృగమువెనుక పరుగెత్తు రాముని సజీవచిత్రం ఈ క్రింది దోహాలో కన్పిస్తుంది.

సో హిత మధుర మనోహర
మూరతి హేమ హిరనికే పాఛే
భావని, నవని, విలోకని
బప్పై తులసీ ఘర ఆఛే

తులసీదాసు బాహ్యప్రకృతికంటెకూడ ఆంతర ప్రకృతికి ఎక్కువప్రాధాన్యం యిచ్చాడు. మానవ స్వభావాలన్నీ కూలంకషంగా చర్చించాడు. విభిన్న పరిస్థితులలో మానవునిలో కలుగు వివిధ మానసిక దశలను చిత్రీకరించాడు.

కవి సాత్విక, రాజస, తామసము లనే మూడు ప్రవృత్తుల ననుసరించి చరిత్ర చిత్రణ రెండు విధాలుగా తీసుకున్నాడు; అందు మొదటిది ఆదర్శవంతమైనది; రెండవది సామాన్యమయినది. రాముడు, సీత, భరతుడు, హనుమంతుడు మొదలైన పాత్రలు సాత్విక ఆదర్శానికి చెందినవి. రావణుడు తామస ఆదర్శానికి చెందిన పాత్ర. దశరథుడు, లక్ష్మణుడు, విభీషణుడు, సుగ్రీవుడు, కైకేయి మొదలైన పాత్రలు సామాన్యపాత్రల వర్గానికి చెందుతాయి.

ఆద్యంతము రామునిలో సత్వగుణం ప్రధానంగా ఉంది. బాల్యావస్థనుండికూడ రాముని చరిత్ర అలాంటిదే! ఆటల్లో గెలిచికూడా తమ్ములముందు ఓటమి ఒప్పుకుంటాడు బాలరాముడు. సింహాసన మెక్కవలసిన సమయంలో రాజ్యత్యాగంచేసి వల్కలములు ధరించి మునివేషంలో ప్రసన్నచిత్తుడై కాననముల కేగిన రాముడు త్యాగశీలి. న్యాయంగా తాను జయించిన లంకా రాజ్యాన్ని విభీషణునకు దానంచేసిన మహాదాత.

పైవన్నీ సాత్వికభావలక్షణాలే. పిరికితనంగా వ్యవహరింపబడవు. అనంతశక్తితోపాటు ధీరత్వము, గంభీరతతోపాటు కోమలభావము రాముని లక్షణాలు. ఇదే రామత్వము. ఈశ్వరుడే మానవ రూపంలో అవతరించాడు.

మాయా మానుష రూపిణే
రఘువరే సద్ధర్మ వర్మే హితే

భరతుని చరిత్ర శీలనియమ ప్రధానమైనది. ఆత్మపక్షము, యోగపక్షముల సమన్వయ రూపమే ఈ పాత్ర. భరతుని లోకమర్యాద అనన్యము. అందువలననే రాముడు భరతుని రాజుగా ఉండమంటాడు—

భరత్! భూమి రహ రాఉరి రాఖీ

లక్ష్మణుడు, హనుమంతుడు సేవకులుగా వస్తారు. ఇద్దరూ ఆదర్శ సేవకులే! కాని లక్ష్మణుని పాత్ర ఆద్యంతాలు ప్రచండమైనది; ఉగ్రమైనది. రామునికి వ్యతిరేకంగా ఒక్కమాటకూడ వినలేదు. హనుమంతుడు మొదటినుండి సేవకుడే! మొదట సుగ్రీవుని సేవకుడుగా ఉండి తర్వాత రాముని పాదాలు ఆశ్రయించాడు. ఆదర్శ సేవకునిగ గణుతి కెక్కాడు.

రామునిలో రామత్వం ఉన్నట్లే రావణునిలో రావణత్వంకూడా ఉంది. ఆద్యంతాలు ఆ పాత్ర ఘోర భౌతిక వాదంతో నిండి ఉంది. రావణుడు ఆత్మ శక్తికంటె భౌతికశక్తికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. దీనినే తామస లేక రాక్షస గుణమంటారు. రావణుని అపార పరాక్రమము, విశ్వవిఖ్యాతవైభవము, ధర్మహీన శాసనము (ఋషులను, మునులను బాధించుట, స్త్రీలను చెఱబట్టుట), ధార్మిక అభిరుచి లేకుండుట — అన్నీకూడ అతని భౌతిక వాదానికి ఉదాహరణలు. 'రావణుడు గొప్పతపస్వి కదా?' అని ప్రశ్న జనింపవచ్చును. కాని భౌతిక బలాన్ని పెంచుకోటానికే రావణుడు అఖండ తపస్సు చేశాడు. అంతేగాని ఆధ్యాత్మిక ఔన్నత్యం కొరకుగాని లేక మోక్షప్రాప్తికొఱకుగాని రావణుడు తపస్సు చేయలేదు. భౌతికసుఖాల ననుభవించి సశరీరంగా అమరత్వం పొందాలనుకున్నాడు. అందువలననే ఘోరతపస్సు చేసినప్పటికీ రాక్షసుడయ్యాడు.

ఇదే విధంగా కైకేయిపాత్ర ఒక స్త్రీగా, సవతి తల్లిగా చిత్రింపబడింది. రామునియెడల ఆమెకు ప్రేమానురాగాలు లేకపోలేదు. కాని రాజ్యం భరతునికే కావాలంటుంది. తన కుమారునికే రాజ్యం కావాలనటం స్త్రీ సహజస్వార్థబుద్ధి. ప్రతితల్లికూడ తన సంతానము పైకిరావాలని కోరుకుంటుందికదా !

సుగ్రీవుడు, విభీషణుడు భ్రాతృద్రోహులుగా కాకుండా లోకకల్యాణార్థం రామునితో సహకరిస్తారు. విశ్వవ్యాప్తమైన ధర్మసంస్థాపనకు సహాయకారులుగా తులసీ ఈ రెండు పాత్రలను సృష్టించాడు.

ఈ విధంగా అన్నిపాత్రల చరిత్ర చిత్రణ స్వభావసిద్ధంగా చిత్రింపబడింది. మనోవృత్తుల నాధారంజేసుకొని పాత్రలు చిత్రింపబడినవి. కాని పాత్రచిత్రణతోపాటు రసపుష్టికూడ జరిగింది. చివర సాత్వికగుణము జయిస్తుంది. రాజస, తామస గుణములు పరాజయం పొందుతాయి. సాత్వికగుణము సత్యమునకు లేక సంతత్వమునకు సంబంధించింది. ఇది ఒకవిధంగా 'ప్రేమ'కు స్థాయీభావం. దీనివలననే గురుప్రేమ, దాంపత్యప్రేమ, వాత్సల్యప్రేమ, భగవత్ప్రేమ జనిస్తాయి.

## భావ పరిపాకము మరియు రసయోజన

తులసీదాసులో . నవరససమ్మేళనం కనుపిస్తుంది. కాని ఎక్కడకూడా లోకమర్యాద నతిక్రమించదు. కావ్యం దాదాపు సాత్వికరూపంలో నడుస్తుందనే చెప్పాలి. భావగాంభీర్యంతోపాటు ఉక్తివైచిత్రికూడ నడుస్తూ ఉంటుంది. రామలక్ష్మణుల సౌందర్యాన్ని చెలికత్తె సీతతో వర్ణిస్తుంది—

స్యాము గౌర కిమి కహహు బఖానీ,<br>
గిరా అనయిన నయన బిను బానీ,

(ఇద్దరు రాజకుమారులలో ఒకడు శ్యామ శరీరుడు, మరొకడు గౌరవర్ణము కలవాడు. వారి సౌందర్యం వర్ణింప నలవికాదు. కారణం-చూచిన కళ్ళు వర్ణించలేవు, చూడని నోరు ఎలా వర్ణించగలదు?)

ఇదే విధంగా సీతారాముల శృంగార భావాలు ఎంతో గంభీరంగా వర్ణించబడ్డాయి.

విప్రలంభ శృంగారములోకూడ తులసీ ప్రతిభ కనిపిస్తుంది. సీతాపహరణము తర్వాత రాముని కరుణామయవేదన చెప్పుకోతగింది. రాముడు పశుపక్ష్యాదులను అడుగుతూ సీత నన్వేషిస్తాడు—

హే ఖగ మృగ హే మధుకర స్రేనీ,<br>
తుమ్ దేఖీ సీతా మృగనైనీ

మృగనైనీ అనేపదం ఇక్కడెంతో సార్థకత నొందింది.

ఛందోబద్ధంగా నాలుగుపద్యాలువ్రాసే ప్రాకృత కవికాదు తులసీ ! అఖండకళాసంపన్నుడు ! రాముడు అడవి కేగునపుడు ఒక దృశ్యం చూడండి—

ఆగే చలహి బహురి రఘురాయా,<br>
రుష్యమూక పర్వత నియు రాయా॥

(రాముడు పురోగమించుకొలది రుష్యమూక పర్వతందగ్గరకు వచ్చింది.)

నఖశిఖవర్ణన కవి తానుగా చెప్పకుండా సందర్భోచితంగా పాత్రలద్వారా చెప్పిస్తాడు. కాని, ఎక్కడా కూడా శీలభంగం రానీయడు.

## భాష — శైలి

గోసాయి సంస్కృతభాషలో ఉద్దండ పండితుడు. ఆనాటి ఉత్తరహిందూస్థానంలోని చాలాభాషల్లో

ఆయన రచనలు చేశాడు. అవధి, వ్రజభాషల్లో ఎక్కువ గ్రంథాలు లభిస్తున్నాయి. కవి గొప్పపండి తుడైకూడ సామాన్యప్రజలను దృష్టిలో ఉంచుకొని రచనలు సాగించాడు. 'రామచరిత మానస్' పటిష్ఠ మైన అవధిభాషలో వ్రాయబడింది. 'జానకీమంగల్', 'పార్వతీమంగల్', 'బర వై రామాయణము' ఆనాటి ప్రచలిత అవధిభాషలో వ్రాయబడినవి. ఆ నాడు పాటలు సాధారణంగా వ్రజభాషలో ఉండేవి. 'వినయ పత్రిక' 'కవితావళి', 'గీతావళి' సువ్యవస్థిత వ్రజ భాషలో వ్రాయబడినవి. 'రామ లలా నహ ఛూ', 'కృష్ణ గీతావళి' మొదలైనవి సామాన్యవ్రజభాషలో రచింప బడినవి.

భాషలపైవలెనే ఆనాటి కావ్యశైలులమీద కూడ తులసీ ప్రభావం పడింది. విషయాని కను కూలంగా ఆయన శైలి మారుతుంది. 'రామచరిత మానస్'లో జాయసీ ననుసరించి ప్రబంధకావ్యాల కను గుణమైన దోహా, చౌపాయీలు వ్రాశాడు. 'గీతాళళి', 'వినయపత్రిక'లో సూరదాసు గీతకావ్యా న్ననుస రించాడు. వీనిలో భారతీయ సంగీతశాస్త్రంలోని విభిన్నరాగతాళముల కనుగుణంగా గీతాలు వ్రాయబడి నవి. 'కవితావళి' భట్టుల పరంపర ననుసరించి 'సవైయా', 'కవిత్త'లతో నడిచింది.

సంక్షేపంలో తల్లీనత, ప్రబంధపటుత్వము, రచనా చాతుర్యము, భాషాసౌష్ఠవము, రస పరిపా కము, అలంకారయోజన మొదలైన అన్ని దశల్లో కూడ గోస్వామీ తులసీదాసు హిందీసాహిత్య జగత్తులో అత్యున్నత స్థానాన్ని పొందగలడనటం అతిశయోక్తి కాదు.

## ద్రష్టగా తులసీదాసు

తులసీ జన్మించినయుగం అనేక విశృంఖల తలతో కూడిఉంది. రాజనీతి, మతం, దర్శనము, సమాజం, పరివారం అన్ని దిశల్లోకూడ భేదాభి ప్రాయాలు ఉండేవి. అన్నివర్గాల్లో ద్వేషభావం ప్రబలి పోయింది. ముఖ్యంగా హిందూ ముస్లింల తగాదా చరమసీమ నందుకుంది. ఇది యిట్లుండగా హిందూ మతంలోనే విభిన్న శాఖలేర్పడి, వానిలో వాదోప వాదాలు బయలుదేరాయి. ముస్లిములలోకూడ అంతః కలహము లేర్పడినవి. అక్బరు పరిపాలనా కాలంలో ముస్లిం సంప్రదాయం హిందూమతంపై దాడి చేసింది. ఈ పరిస్థితులలో తులసీదాసు హిందూ మతమును, దర్శనమును సమర్థించి పునరుద్ధరించాడు. పరాధీనమైన హిందూ సంప్రదాయాన్ని తిరిగి ప్రతి ష్ఠించాడు.

ఇంతేకాకుండ - ఆయన సార్వకాలీన, సార్వదేశీయ సమాజోద్ధారకుడుగ కానవస్తాడు. రాజనీతిదిశలో ఆయన ఆనాటి అక్బరు కరాళ శాసనాన్ని గురించి చర్చించాడు.

'గోడ్ గంవార నృపాలమహి,
యమన మహా మహిపాల్,
సామ నదాన నభేద,
కలి కేవల దండకరాల్'

ఇక్కడ 'యమన మహామహిపాల్' అంటే అక్బరుఅని, యమధర్మరాజనీ అన్వయం చేసుకోవచ్చును. 'కలి'అంటే దారిద్ర్యంఅనీ, అంతర్యుద్ధాలనీ అర్థ ముంది. కవి అక్బరు శాసనాన్ని యమధర్మరాజు పరి పాలనతో పోల్చాడు.

వీనితోపాటు శాసకుల కర్తవ్యాన్ని కవి సూచిస్తాడు—

జాసు రాజ ప్రియప్రజా దుఖారీ,
సో నృప అవసి నరక అధికారీ ।

తులసీ వెంటనే రామరాజ్యాన్ని వర్ణిస్తాడు—

దైహిక దైవిక భౌతిక తాపా,
రామరాజ్య నహిఀ కాహహి వ్యాపా ।
సబ నర కరహి పరస్పర ప్రీతీ,
చలహి స్వధర్మ నిరత శ్రుతినీతీ ।
నహిఀ దరిద్ర కోఉ దుఃఖీ న దీనా,
నహిఀ కోఉ అబుధ న లచ్ఛనహీనా ।

నిజంగా గాంధీని ప్రేరేపించిన ఆదర్శ రామ రాజ్యంకూడ యిదే !

సమాజాన్ని గురించి వ్రాసేముందు కవి దాంపత్య సుఖజీవనము, పవిత్రతనుగురించి తెలిపాడు—

ఏక నారీ వ్రత రత సబ భారీ,
తే మన వచ కర్మ పతిహిత కారీ.

తల్లిదండ్రుల సేవనుగురించి నవయువకులకు ఉపదేశం యిస్తాడు కవి—

**అనుచిత ఉచిత విచార తజి**
**జే పాలహి పితు బైన్,**
**తే భాజన సుఖ సుజన కే**
**బసహి అమరపతి ఐన్.**

తులసీ ఆదర్శధర్మస్థాపనద్వారా లోక కల్యాణము సాధ్యమంటాడు. రామకథను చక్కగా చిత్రించాడు. రాముని పాత్రద్వారా భార్యాభర్తల అనురాగం, భాతృప్రేమ, కుమారుని ఆజ్ఞా పాలనము, సవతితల్లి పట్ల గౌరవభావం మొదలైన ఉజ్వలభావాలు ప్రస్తుతించి ఆనాటి ప్రజలకు మార్గదర్శకుడయ్యాడు కవి.

దార్శనిక జగత్తుపైకూడ తులసీ తనప్రభావం చూపాడు. దేవుని నిరాకార బ్రహ్మండ స్వరూపములను చూడుడు—

ఏక్ అనీహ అరూప అనామా,
అజ సచ్చిదానంద పరధామా।
వ్యాపక విశ్వరూప భగవానా,
తేహి ధరి దేహ చరిత కృత నానా।

ఆ పరమబ్రహ్మస్వరూపుడే తన భక్తుల సంరక్షణార్థం భూమిమీద అవతరించాడు—

సోయి రామ వ్యాపక బ్రహ్మ
భువన నికాయ పతి మాయా ధనీ।
అవత రేఉ అపనే భగత హిత
నిజ తంత్ర నిత రఘుకుల మనీ।

ఈ సగుణస్వరూపుడైన రాముడు ఎప్పుడూ భక్తి నాశిస్తాడు. సౌమ్యభావనమే భక్తియొక్క ముఖ్య లక్షణం. త్రికరణశుద్ధి రామునికి ఆసక్తిదాయకమైంది.

సూధే మన సూధే వచన
సూధీ సబ కరతూతి।
తులసీ సూధీ సకల విధి
రఘువర ప్రేమ ప్రసూతి॥

రాముణ్ణి పొందటానికి భక్తిమార్గమే సుఖకరమైంది. కాని జ్ఞానమార్గంకూడ ఉపేక్షనీయంకాదు.

భగతి హి గ్యానహి నహి కఛు భేదా,
ఉభయ హరహి భవసంభవ ఖేదా।

ఈ జ్ఞానప్రాప్తి తర్వాత జీవుడు బ్రహ్మత్వాన్ని పొందుతాడు.

జానత తుహ్మ హి
తుహ్మఇ హోయి జాయి

ఈ విధంగా దార్శనిక మార్గంలో లోద్వంద్వ విధానం అజ్ఞానమంటాడు. అందుకనే గోసాయిజీ ప్రతి దిశలో సమన్వయమార్గం చూపాడు. శైవ వైష్ణవులలోకూడ సమన్వయరూపం చూపాడు. తులసీ రామునిచేత క్రిందివిధంగా అనిపిస్తాడు—

శివ ద్రోహీ మమ భగత కహా వా
సో నర సపనేహు మోహి నపావా।

ఈ ప్రకారం తులసీ ప్రతిచోట తన తాత్విక విధానాన్ని సమర్థిస్తాడు. ఈ సమన్వయ రూపాన్ని సార్వకాలీన, సార్వదేశీయ మార్గంగా ప్రతిపాదిస్తాడు.

భారతీయ ధర్మసాధనలో వైదికయుగంనుండి తత్కాలీన విషయాల సారరూపమే 'రామచరిత మానస' మనవచ్చును.

ఈ విధంగా మనం పరిశీలిస్తే స్రష్ట, ద్రష్ట స్వరూపాల సమన్వయరూపమే మహాకవి తులసీదాసని వెల్లడవుతుంది. ఈ రెండుమార్గాల్లో కవి దేని నెక్కువగా అనుసరించాడనేది తేలే సమస్య కాదు. ఇదే తులసీ కళ. ఈ కళవలన హిందీ కవితా కుమారియే స్వయంగా శోభించింది.

ఈ మహాకవినిగూర్చి ప్రసిద్ధకవి 'హరిఔధ్' అంటాడు—

'కవితా కరకే తులసీ న లసే
కవితా లసీ పా తులసీ కీ కలా'

(కవిత్వం వలన తులసీదాసు రాణించలేదు, తులసీ కళనుపొంది కవిత్వమే శోభిల్లింది.)

నిజంగా ఇలాంటికవులే అమరు లౌతారు—

జయంతి తే సుకృతినో
రస సిద్ధాః కవీశ్వరాః,
నాస్తి ఏషాం యశః కాయే
జరా మరణజం భయం॥

# "అమరజీవి"

శ్రీ కె. యల్. నరసింహారావు

(సుప్రసిద్ధ ఆంగ్లకవి కీట్సు వ్రాసిన 'ఓడ్ టు నైటింగేల్' అనుదానికి భావానువాదము)

వైకము గ్రమ్మె నా మదికి, మత్తిలియెన్ హృదయమ్ము, దేహమే
యాకర మయ్యె స్తబ్దతకు, హాయిగ మద్యము గ్రోలినట్లు —ఓ
కోకిల నీదు సౌఖ్యములకున్ మది నీర్ష్య గలంగి కాదు, నీ
నాకసమానసౌఖ్యముల నాకును భాగము గల్గుటన్ జుమీ.

రమ్యవనవాటికారాము రాణి వగుచు
లలిత పల్లవ ఛాదనోల్లాస మహిమ
సొబగు మీరెడి పంచమ సుస్వరాన
పాడుచుంటివో మధుమాస ప్రణయగీతి.

ఇమ్ముగ దివ్యమూలికల నిం పలరారగ జేసినట్టి ఈ
కమ్మని మద్యమున్ తివిరి కాంచన పాత్రలు నిండబోసి వే
గమ్మగ బుద్బుద ప్రకర కాంతులలో నొకగ్రుక్క యాని,లో
కమ్మును వీడి, వేగనిను గాంచెద రమ్యవనాంతరమ్ములన్.

అటనినుగాంచి ఈ భువన మందెసలారు మహోగ్ర దుర్వ్యథా
పటల నిమగ్న మానవుల బాష్పకణావృత దీనదృక్కులన్,
కుటిలపు వర్తనంబులను, ఘోరపు చావుల నిస్సహాయతన్,
జటిల సమస్యలన్ మరచి సంతస వృత్తిని నుండగోరితిన్.

దూరదూరము వనసీమ తొలగిపొమ్ము
వచ్చి చేరెద నిను నెంతె వాసిగాను
మదిర దేవత కరుణంపు మహిమగాదు
అల్ల తేజస్వి కవితామతల్లి కరుణ.

## " అమరజీవి "

ఇదె నిను జేరితిన్ విభవమింపెసలార నిశీథకన్యకా
వదనము, రాగరంజిత సువారిత రాజ కరోపలాలనన్
ముదితము నై వెలుంగ, భువి పుల్లక హల్లకమై తనర్పనా
మదనుని వాసు ఋక్షగణమండనుడై దివిఁగొల్వు దీర్పగన్.

మెల్లమెల్లన వీచెడి పిల్లగాలి
కల్లనల్లన కదిలెడి పల్లవాళి
సందుల న్జిమ్ము జ్యోత్స్న పుంజమ్ము దక్క
మన్పునకుగాని వెల్గు లేదిచ్చటెచట.

కమ్మని సన్నజాజులును కాంచన పుష్ప కదంబకమ్ములున్
ఇమ్ముగ పూల భారమున నెంతయు వాలెడి మాధవీనికుం
జమ్ములు, వానిపై మధుర ఝుంకృతితో మధువాను నాస, జుం
జుమ్మని మ్రాలు బంభరుల జోలలు వీనుల విందొనర్చెడిన్.

వెల్లివిరియగ బూసిన తెల్లకలువ
లింపు దళుకొత్త, కేతకి సొంపులలమ
మనము రంజిల్ల చేసెడి సురువకములు,
హృదయమున శాంతి నెలకొల్పె మృదులరీతి.

కలకల మ్రోయు నీదు మృదుగానఝరీప్లుత దేహయష్టినై
అలికుల రావ మాధురిని, హాయినిగూర్చు సుమంపు తావిలో
నలరుచు, పెక్కుమార్లు హృదయాంతర సీమను మృత్యుకన్యకన్
వలచితి, భవ్యకీర్తనల పాడి తలంచి, జపించి, కుందితిన్.

మనసు, దేహంబు, నీగాన మహిమలోన
తన్మయత నొంది సుఖసీమ తాండవించు
నట్టి శాంతిమయ నిశీథి యందు, నరుడు
మృతుడగుటకన్న వేరొండు హితముగలదె.

అమరజీవివి నీవెపో అరసిచూడ
కాలచక్రంపు వేగాన కట్టువడక
సర్వజనులను నీగాన సరసియందు
తరతరంబులనుండియు తనిపినావు.

దేశదేశాల సంద్రంపు దీవులందు
వీర, కాముక, దుఃఖిత విరహిజనులు
ధైర్యకార్యమ్ము లొనరింప శౌర్యమొసగు
పట్టుకొమ్మయగాదె నీ ప్రణయగీతి.

పాడు పడి స్మృతి పథమ్మును బాసిపోవు
దేశ దేశాల వీరుల ధీరచర్య
తలచుకొన్నంత నామేను జలదరించె,
భావనయు పోమె బ్రతుకుట భారమాయె.

అదిగొ నీగాన మిదియేమొ అంతరించి
పోవుచున్నది, పచ్చిక భూమి గడచి
దాటిపోయెను స్వర్ణదీ తటులనెల్ల
దాటె అంబర చుంబిత తరుల, గిరుల.

అణగిపోయినదేమొ అయ్యడవులందు
వెలిగి పోయినదేమొ ఈ వెలుగులందు
మరగిపోయినదేమొ ఆ మ్రాకులందు
కలసిపోయినదేమొ ఈ కొలకులందు.

లేకయుండిన పోయిన పోకయేమి,
కాక, మానస కల్పనో, కలయొ, నిజమొ,
కాని, మంజుల స్వనపూర్ణ గానలహరి
దవ్వు దవ్వుల కేగుట తథ్యమరయ.

# తెనుగు పదజాత విభజనము

## డా. బొడ్డుపల్లి పురుషోత్తం

సాంప్రదాయికులగు తెనుఁగు వైయాకరణులు, తెనుఁగు పదజాతమును నాలుగు తరగతులుగా విభజించిరి : అవి :

(1) **తత్సమములు:** సంస్కృత, ప్రాకృత సమములు.

(2) **తద్భవములు :** సంస్కృత ప్రాకృత భవములు.

(3) **దేశ్యములు :** తెనుఁగుదేశమున జనించినవి.

(4) **గ్రామ్యములు:** లక్షణ విరుద్ధములై కావ్యవ్యవహార యోగ్యములుగానివి.

ఈ విధమగు విభజనమును వీరు ప్రాకృత వ్యాకరణముల ననుసరించి కావించిరి. (గ్రామ్యము తప్ప తక్కినవి మూడును). ఇది పదముల వ్యుత్పత్తి ననుసరించి కావింపఁబడిన విభజనము. (Etymological classification.)

ప్రాకృత వ్యాకరణములందును తత్సమ, తద్భవ, దేశ్యవిభజనము కలదు. సంస్కృతజన్యములగు ప్రాకృత భాషలలో సంస్కృత సమరూపములు, సంస్కృత భవరూపములు మాత్రమే యుండవలయును. అయిననా భాషలలో 'దేశ్యము' లెట్లు పొడగట్టినవో!! ఆశ్చర్యకరమగు విషయము. తెనుగు మున్నగు ద్రావిడ భాషలలోఁగల దేశ్యము లాధారముగాఁగొని, యాభాషలు సంస్కృత, ప్రాకృత భాషాజన్యములుగావని నిర్ణయింపఁబడెను. ఇప్పట్లు నొక చిక్కైన ప్రశ్న యుద్భవించుమగును: ఏమనఁగా 'సంస్కృతముతో నిమిత్తములేని దేశ్యభాగము కల్గినను, ప్రాకృతము, సంస్కృతజన్యము కాగా సంస్కృత ప్రాకృతములతో నిమిత్తములేని దేశ్యభాగము కల్గిన తెలుగు, తదితర ద్రావిడభాషలు, సంస్కృత ప్రాకృత జన్యము లేలకారాదు? స్థూలముగా నీ వాదము సముచితముగా నున్నట్లు కనిపించినను, సూక్ష్మదృష్టికిది నిస్సారమగు వాదాభాసమని తోచకమానదు. ఈ వివాదము 'దేశ్య'మను పారిభాషిక పదము విభిన్నములగు వ్యాకరణములందు పొడగట్టుటనుబట్టి పొడమినది. అందుచే నీ సాంకేతిక పదస్వరూపమును గ్రహించి, తారతమ్యమును నిరూపింప వలసియున్నది.

సుప్రసిద్ధ ప్రాకృత వైయాకరణుఁడు, నైఘంటికుఁడు నగు హేమచంద్రుఁడు తన 'దేశీ నామ మాలా'లో దేశ్యము నిట్లు నిరూపించెను.

'జే లక్ఖణే ణసిద్ధాణ
పసిద్ధా సక్కయాహి హణేసు
ణయ గఉణ లక్ఖణా సత్తి
సమ్భవా తే ఇహ ణిబద్ధా'

వ్యాకరణముచే సాధింపబడని పదములు; ప్రకృతి ప్రత్యయ విభాగము కలవైనను సంస్కృతాభిధాన కోశాదులందు కనిపింపని పదములు; వాచ్యార్థమేకాక, లక్షణార్థమునందు ప్రసిద్ధముగా వాడుకొనబడు పదములు (మూర్ఖుఁడను నర్థమున బఇల్లో) ఈ కోశములోనికి తాను చేర్చినానని హేమచంద్రు డుద్ఘాటించెను.

'దేస విసేస పసిద్ధీఇ
భణ్ణమాణా అణన్తయా హున్తి,
తమ్హా అణా ఇపా ఇఅ
పయట్ట భాసావిసేసఓదేసీ.'

మహారాష్ట్ర విదర్భ ఆభీరాది ప్రత్యేక ప్రాంతములలో వాడుకలోనున్న దథమథ, విడ్డోమున్నగు

పదముల సేకరణ మనంతము. ఒక పురుషాయుషము చాలదు. అందుచే అనాది ప్రవృత్తములై ప్రసిద్ధి గాంచిన ప్రాకృత విశేషము లనఁదగిన పదములను మాత్రమే హేమచంద్రుడు దేశిపదములుగా కూర్చి నానని యనెను.

ఆధునిక పండిత పరిశోధకులు ప్రాకృతముల లోని దేశ్యములనుగూర్చి భిన్నములగు నభిప్రాయములను గల్గియుండిరి. 'బీమ్సు' పండితుఁడు తన ఆధునికార్య భాషల తులనాత్మక వ్యాకరణములో సంస్కృతమునుండి జనింపక, దేశభాషలనుండి యెరవు గొన్నట్టి పదములను దేశ్యములుగా పరిగణించెను. (A Comparative Grammar of the Modern Aryan Languages—Vol. II—p. 12) హార్నెల్ పండితుడు — దేశ సంబంధమైనవి దేశ్యములని; సంస్కృత మూలములు సంతృప్తికరముగా లభింపని పదములు; గ్రామీణ వ్యవహారమునకు సంబంధించి నట్టివని తన 'Introductian to grammar of The Gaudian Languages' అను గ్రంథమునఁ బేర్కొనెను. R. G. భండార్కర్ విద్వాంసుఁడు ఆర్యులచే జయింపఁబడిన అనార్యజాతులవారిభాషలనుండి స్వీకరింపఁబడిన పదములే దేశ్యములని యుద్ఘాటించెను. (Wilson's Philo-logical Lectures—P. 106) గ్రియర్‌సన్ తన Linguistic Survey of Indiaలో దేశ్యములు ప్రాంతీయములగు ననాగరక భాషాపదములని యభిప్రాయపడెను.

మొత్తముమీద అవ్యుత్పన్నములు, సులభముగా వ్యుత్పత్తి గోచరింపని పదములన్నియు ప్రాకృత వైయాకరణులు దేశ్యములుగా పరిగణించిరని భావింపవచ్చును. వ్యుత్పత్తి సందేహాత్మకముగానుండి దేశ్యములుగా నెంచబడిన కొన్నిపదములను కొంతమంది వైయాకరణులు సూక్ష్మముగా పరీక్షించి వ్యుత్పత్తులను సూచించిరి. అందుచే నవి తద్భవములే యైనవి. ఇంకను సూక్ష్మేక్షికతో నీక్షించినచో మఱికొన్ని దేశ్యములకును వ్యుత్పత్తుల నూహింపవచ్చును. ఏమైనను మఱికొన్ని దేశ్యములు కొలేయన్, ద్రావిడాది అనాగరక భాషాపదములై యుండుననుటలో విప్రతిపత్తి యుండదు. సంస్కృత ప్రాకృతభాషలతోపాటు దేశభాషలుకూడ నున్నట్లు 'సంస్కృతం, ప్రాకృతం, తద్వత్ దేశభాషాచ సర్వథా భాషాత్రయ మిదం త్యక్త్వం యన్మనుష్యేషు సంభవేత్'అను గుణ్యాఢ్యుని ప్రతిజ్ఞను బట్టియు; 'దేశభాషా వికల్పనన్; దేశభాషా ప్రయోక్తృభిః' మున్నగు నాట్యశాస్త్ర ప్రయోగములను బట్టి విదతము కాకపోదు.

ప్రాకృతములలోని దేశ్యపదములను పరిశీలింపగా అనాగరకమగు కతిపయదేశభాషాపదముల మాట యట్లుంచి, తక్కినవన్నియు 'ప్రచ్ఛన్నములగు తద్భవములే' (Disguised Tatbhavas) యను నభిప్రాయము ప్రబలెను. ఈ సందర్భమున పదములతీరులు గొంత పరిశీలింపవలసియున్నది.

(i) ప్రత్యక్ష వృత్తులు : వ్యాకరణ నియమముల ననుసరించి ప్రకృతి ప్రత్యయ విభజనము అవలీలగా స్పష్టపడుపదము లీ శ్రేణికిఁ జెందును.

(ii) పరోక్ష వృత్తులు : ప్రకృతులు, ప్రత్యయములుకూడ మార్పులకు లోనై, లీలగా ప్రకృతి ప్రత్యయములను గుర్తింపఁతగిన పదములు.

(iii) అతిపరోక్ష వృత్తులు : ప్రకృతి ప్రత్యయము లూహించుటకుకూడ వీలులేనంతగా మాఱుపడిన పదములు.

ఋష, వృష ధాతువులనుండి కప్రత్యయము చేరి నిష్పన్నమైన ఋష, వృష శబ్దములు ప్రత్యక్ష వృత్తులు. తరువాత ఋషభ, వృషభ శబ్దము లేర్పడి పరోక్షవృత్తులైనవి. ఉక్షశబ్దము వీనినుండి అతి పరోక్షవృత్తిగా నేర్పడెను. అట్లే బల, వృష శబ్దముల కలయికచే 'బలీవర్ద' శబ్ద మతిపరోక్షవృత్తిగా నేర్పడెను. అది ఒంకను మార్పులుచెంది 'బఇల్లో' అయి, ప్రాకృతపదముగా పరిగణింపబడినది. తరువాత 'బైల్'అయి హిందీప్రాంతములో దేశ్యముగా నేర్పడినది. 'బలీవర్దంలో ఏకదేశం 'ఎద్దు'అయి తెలుగుదేశంలో దేశ్యంగాఉండి, అరవ దేశంలో 'ఎరుదు' గానూ, కన్నడదేశంలో 'ఎత్తు' గాను

మారినది. ఇలా పదాల చరిత్రను తరచిచూస్తే నేడు దేశ్యా లనుకునే పదాల ప్రకృతులు దొరుకుతవి' (అమరవాణి: నిఘంటుకర్త — హేమచంద్రుడు — పుటలు 233—34: శ్రీమాన్ ఎస్. సి. యస్. వెంకటార్యులు.)

ఈ రీతిగా తెలుఁగు మున్నగు ద్రావిడభాషలకు సంస్కృతముతో జన్యజనక సంబంధమును గూర్చుటలో ననురక్తి గలవారు ఈ భాషలలోని దేశ్య పదజాతమంతయు పరోక్ష వృత్తిలో, అతిపరోక్ష వృత్తిలో అయియుండునని వాదింతురు. దేశ్య పదములలో ప్రచ్ఛన్నములగు తద్భవములు అసలే యుండవని (Disguised Tatbhavas) వాదించుట గాని; తద్భవములుగా పేర్కొనఁబడుచున్న కొన్ని ప్రసిద్ధ పదములలో దేశ్యములుండవని వాదించుట మూర్ఖమే యగును. శబ్ద శాస్త్రము (Linguistics) బాగుగా వృద్ధిపొందిన రోజులివి. ప్రతి శబ్దమునకు స్వకీయమగు చరిత్ర యుండునను విషయమున నే డెవ్వరికిని వివాదములేదు. (Every word has its own history — Bloomfield—Language p. 328). శబ్ద పరిణామ నియమముల కనుకూలముగా శాస్త్రసమ్మతముగాఁ బేర్కొనబడు విషయ మేదియైనను నంగీకరింపక తప్పదు. ప్రతి పదమును, దాని పరిణామమును బరిశీలింపవలయును. ఏదేని యొక పదమును గాని, కొన్ని పదములనుగాని గైకొని, ద్రావిడ భాషలలోని దేశ్యశబ్దజాత మంతయు పరోక్ష తద్భవజాతమే యనుట యుచితముకాదు. సంస్కృత దుగ్ధ శబ్దము ప్రాకృతమున 'దూధ' అయి, హిందీలో దూధ్ అయినది. దీనికి తెలుగులోని 'పాలు'నకు గల సంబంధమును అగమ్యమగు అతిపరోక్షవృత్తికే వదలుట మూలమున ఆత్మసంతృప్తి కల్గవచ్చునేమో కాని, శాస్త్ర సమ్మతిని బడయజాలము. ఇట్లే లవణ — లోణ శబ్దములకు — ఉప్పునకుగాని, తృణ — గడ్డి, దధి—దహి—దై—పెరుగు మున్నగు ననేక పదములకు శబ్దపరిణామము నూహించుటే దుస్సాధము.

పై ఉదాహరణముల నట్లుంచి, పైని పేర్కొన్న 'వర్ద' > 'ఎద్దు' అయినదనుట ఎంత వరకు సముచితమో పరీక్షింపవచ్చును. వర్ణ సమీకరణముచే (assimilation) వర్ద —> వద్ద కావచ్చును. కాని 'వ' కారము లోపించినచో 'అ' యగును. వాఁడు —> ఆడు. లేదా ఓష్ఠ్యమగుటచే వాఁడు— ఓఁడు (బుల్లివాఁడు —> బుల్లోఁడు) కావచ్చును. అంతే కాని వకార మెన్నటికిని 'ఎ'గా మాఱదు. అది శబ్దపరిణామ విరుద్ధము. కాగా ఇది కేవలము ద్రావిడ శబ్దము. ఎఱుదు > ఎర్దు > ఎద్దు అనునది దీని పరిణామము. అతి పరోక్షవృత్తి నొక సాకుగా గ్రహించి, భిన్నపుగు పరిణామరీతులుగల్గి, సోదరభాషలలో బహుముఖములుగా నుపయుక్తమగుచు, ద్రావిడ ధాతువులను నిర్మింపనగు పదములను, సంస్కృత ప్రాకృత జన్యములుగా భ్రాంతిపడి యానందింపవచ్చును గాని శాస్త్రసమ్మతి కల్గుట యసంభవము. ద్రావిడ భాషా శాస్త్రము ప్రపంచ పరివ్యాప్తముగా వృద్ధిగాంచుచున్న ఈ రోజులలో నింకను నిట్టి ప్రాథమిక విషయములను గూర్చి ప్రసంగించు కొనుటలోనే మన ప్రగతిశీలమును ప్రకటించుకొనుట పరిహాసాస్పదము. యాదృచ్ఛికమగు శబ్దసాదృశ్యముతో సిద్ధాంతముల నేర్పఱచుటగాని, సమర్థించుటగాని కుక్కతోక పట్టుకొని గోదావరి యీదసాహసించుటే యగును.

దేశ్యములలో ప్రచ్ఛన్నతద్భవము లుండవచ్చునని అంగీకరించినట్లే, తద్భవములలోను ప్రచ్ఛన్న దేశ్యము లుండవచ్చునుగదా! నిజమునకు మన పండితులు దేశ్యములను, ఏదేని శబ్దసారూప్యమును బురస్కరించుకొని తద్భవములుగాఁ బేర్కొనుటలోనే విశేషాభినివేశమును బ్రదర్శించిరి. *పొట్ (to project)> పొయిదు> ప్రొద్దు అను సుప్రసిద్ధ ద్రావిడపదము, బ్రధ్నశబ్దభవముగనే యిప్పటికిని పిల్లలకు బోధింపఁబడుచున్నది. ఇట్లే 'వలక్ష' శబ్దభవము 'వెల్ల'యని (వెళ్, బెళ్, బెళంగు, వెలుఁగు, వెలుఁగు, వెలుతురు, వెలయు మున్నగు ననేకపదములలో ధాతురూపమున గోచరించుచున్నది.) 'శుచి' శబ్దభవము 'చిచ్చు' (కిచ్చు, కిర్చు, కిత్తు అను తాలవ్యీకరణమును బొందని

ప్రాచీనరూపములు.) అని నిస్సంకోచముగా ననేకపదములు తద్భవములుగానే పరిగణింపబడుట విచార్యము. ఇంతయేల? శ్రీ విశ్వనాథ సత్యనారాయణులు తమ 'నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి'లో (పుట 2) 'నారాయణ' శబ్దభవము 'నన్నియ'యని వచించుట వారికి నన్నయపట్లగలభక్తికి, వారిలోఁగల ఆర్షత్వమునకు నిదర్శనమగునేమో తెలియదుకాని, నిజమునకు 'నన్ని'అను కన్నడ శబ్దమున కర్థము 'సుందరము' 'ప్రియము'అని సూర్యరాయాంధ్ర నిఘంటువు చూచి సామాన్యులు గ్రహింపగలరు. ప్రచ్ఛన్న దేశ్యములు తద్భవములలో నున్నంతగా ద్రావిడభాషలలోని దేశ్యములలో ప్రచ్ఛన్న తద్భవములు లేవనియే చెప్పవచ్చును. ఏలన సంప్రదాయజ్ఞులగు మనవారు యాదృచ్ఛిక శబ్దసామ్యమునకే మురిసిపోయి అనేక దేశ్యములను వికృతులుగా నిరూపించు కుతూహలము కలవారు.

ఇఁక ప్రాకృతములోఁగల దేశ్యములకు, ద్రావిడ భాషలలోఁగల దేశ్యములకుఁగల స్వభావ తారతమ్యమును బరీక్షింతము. 'పాఇఅ సద్దమహణ్ణవో'అను ప్రాకృతభాషానిఘంటువున 60 వేల పదములు గలవు. ఇందులో 4 వేల పదములు దేశ్యములుగా సూచింపఁబడినవి. ఆధునిక పరిశోధనల మూలమున సుమారుగా నిందరి వేయి పదములకు ప్రకృతులు చూపఁబడినవి. తక్కిన 3 వేల పదములు కొలేరియన్ భాషాపదములో, ద్రావిడభాషాపదములో అగునని సప్రమాణికముగా నిరూపింప యత్నించుచున్నారు.

ఈ పదములన్నియు ప్రాకృత కావ్యప్రయోగములు లేనివి. ఇవి కేవలము నైఘంటికములే. (lexical). ఈ మూఁడువేల పదములను తొలగించి నను ప్రాకృత సాహిత్యమున కెట్టి కొఱతయులేదు. వీనిలోను పదములు విశేషముగా జంతువాచకములు, వృక్షవాచకములు నైనట్లు నిఘంటువును జూచిన తోచును. ఇవి నిత్యవ్యవహారోపయుక్తములు కావు. ఇందును క్రియావాచకములు మృగ్యము. ద్రావిడభాషలలోని దేశ్యములకు, ఈ దేశ్యములకు హస్తిమశకాంతము. ద్రావిడదేశ్యములు దైనందిన వ్యవహారోపయుక్తములు. అనఁగా శరీరావయవవాచకములు, సంబంధవాచకములు, సర్వనామములు, సంఖ్యావాచకములు, గృహోపకరణపదములు, పంచభూతములను దెల్పునవి, క్రియావాచకములు మున్నగునవి. ఇవి ఎరవుపదములు (loan words) కానేకావు. వీనిని పరిహరించి కావ్యసృష్టి ఈ భాషలలో నుండదు. వీనికి సోదరభాషలలో జ్ఞాతిపదములు (Cognates) లభించును. వీని తులనాత్మకపరిశీలనముతో మూలద్రావిడరూపములను నిర్మింపవచ్చును. (Proto-dravidian reconstruction.)

ద్రావిడభాషలలోని దేశ్యశబ్దములలో ప్రచ్ఛన్న తద్భవము లున్నవేమో పరిశీలించుటకు, శబ్దపరిణామ రీతులను గుర్తించి సూత్రించుటకు ప్రాకృతభాషా పరిజ్ఞానము విశేషముగా తోడ్పడును. తమిళ కర్ణాట మలయాళ వ్యాకర్తలు బొత్తిగా ప్రాకృతభాషలనే విస్మరించిరి. కాని తెలుగు వ్యాకర్తలు సిద్ధాంతమునకైన ప్రాకృతములను విస్మరింపకుండుట మెచ్చదగిన విషయము.

తత్సమ, తద్భవములలోని 'తత్'శబ్దము ఎంతో సారవంతమైనది. తెలుఁగు వ్యాకర్తలు సంస్కృత ప్రాకృతములనే తచ్ఛబ్దముచే నిరూపించిరి. మధ్యకాలములోను, ఆధునికముగను తెలుగున ప్రవేశించిన అన్యదేశ్యములనుఁగూడ నీ తచ్ఛబ్దముచేతనే నిరూపింపవచ్చును.

(i) ప్రాచీన తత్సమములు : సంస్కృత ప్రాకృత సమములు.

(ii) అర్వాచీన తత్సమములు : అరబ్బీ, పారసీక, ఉర్దు మున్నగు భాషా సమములు.

(iii) నవీన తత్సమములు : పోర్చుగీస్, ఆంగ్లాది భాషా సమములు.

ఇట్లే ప్రాచీన తద్భవములు, అర్వాచీన తద్భవములు, నవీన తద్భవములును సిద్ధించును. సంస్కృత ప్రాకృత పదములు తత్సమ తద్భవ రూపములఁగా తెలుఁగున ప్రవేశించినట్లే అన్యదేశ్యములుకూడ

తత్సమ తద్భవములుగాఁ బ్రవేశించుననవచ్చును. ఉదా: రోడ్డు, కాఫీ, కాలేజీలవంటివి ఆంగ్లసమములు కాగా ఆసుపత్రి, పింఛను, కిరస్తాని వంటివి ఆంగ్లభవములు.

సంప్రదాయ భిన్నులగు తెలుగు వ్యాకర్తలు— కేతన పెద్దనాదులు 'ఆచ్ఛిక' విభాగమొకటిచేర్చి తెలుగుఁపదజాతమును పంచధా విభజించిరి. ఆచ్ఛికమను నాల్గవ విభాగము పదనిర్మితిని (Structure) బట్టి కావింపబడినది. ఇందు తద్భవములు, . దేశ్యములును జేరును. తద్భవములు, దేశ్యములమూలముననే యేర్పడినవి. దేశ్యపదనిర్మితి కనుకూలముగా శబ్దముల నుచ్చరించుట కలవాటుపడిన ప్రజలు, తద్భిన్నమగు తత్సమముల నుచ్చరింపఁజాలక వర్ణలోపాగమాదేశ వికారములను గావించి, వానిని దేశ్యపద నిర్మితి కనుకూలింపఁజేసి కొందురు. ఈ వికారములు వ్యక్తిగతములుగాక, సమష్టివగుటచేతను, వ్యవహార రూఢము లగుటచేతను కవులకు శిరోధార్యములై కావ్యప్రయోగ యోగ్యత నందినవి. ఇవియే తద్భవములు. తద్భవములను, దేశ్యములను పరస్పరము సమసింపఁ జేయవచ్చును. తద్భవావిర్భావమునకు దేశ్యములే కారణము. ప్రాకృత భాషలలోను తద్భవము లావిర్భవించుటకు కారణము ఆ ప్రాంతములలో వ్యవహారమునందున్న దేశ్యములేయని భాషాభిజ్ఞుల యభిప్రాయము.

ఆధునిక సాంప్రదాయిక వైయాకరణుఁడగు చిన్నయసూరి పైద్వ్యక్పథములను రెంటిని సమన్వయించి సంస్కృత సమేతరమగు పదములను 'ఆచ్ఛికముల'ని వ్యవహరించెను. తెనుఁగున ప్రాకృతసమములను విభాగము సిద్ధాంతముగా నేర్పడినదేకాని ప్రాకృత సమములన్నియు భంగ్యంతరముగా సంస్కృత భవములే యగును. అనాంధ్రవర్ణఘటితమగు సంస్కృత సమము లున్నట్లుగా అనాంధ్రవర్ణఘటితమగు ప్రాకృత సమములు తెలుగున మృగ్యము. అట్టము=(సం. అష్టకం. ప్రా. అట్టఅ) (ప్రాకృతసమము). ఎనిమిది పన్నములుగల వేదభాగము. 'వజ్ఝ'వంటివి ఒండు రెండు మాత్రమే కలవు.

ప్రాకృతసమములన్నియు సంస్కృత భవములే యని యంగీకరించుట కొక్కచో మాత్రము ప్రతిబంధకము కలదు. సంస్కృత 'య'కారము తెనుఁగున 'అ' యగును. 'యు' 'ఉ' అగును. ఉదా : యశము—అసము; యుగము—ఉగము; యువతి—ఉవిద. కాని యిట్టివి చాల తక్కువే. యకారము ప్రాకృతములలో జకారమగును. తెనుఁగున నది దంత్యోచ్చారణమును బొందును. వీనిని ప్రాకృత సమములుగా వ్యాకర్తలు నిరూపించిరి. వీనిని సంస్కృతభవము లనుటకు వీలు లేదు. ఉదా : యముఁడు—జముఁడు; యమున—జమున; యవనిక—జవనిక; యోగి—జోగి మొదలైనవి.

తెలుఁగు మున్నగు ద్రావిడభాషలకు ప్రాకృతములతోడి సంబంధము చారిత్రకమైనది. సంస్కృతముతోడి సంబంధము నిత్యప్రవర్ధమానముగా నున్నది. సంప్రదాయజ్ఞులగు తెలుఁగు వ్యాకర్తలు కొందఱు అష్టవిధములగు ప్రాకృత సమములను; అష్టవిధములగు ప్రాకృతభవములను నిరూపించుటకు ప్రయత్నించిరి. వీరందఱు ప్రాకృతభాషా కోవిదులనఁజాలము. కొన్ని నిరూపణములు గతానుగతికములు. కాని వివిధములగు ప్రాకృత భవములను చక్కగా నిరూపించిన 'వైకృత చంద్రిక'వంటి వ్యాకరణము లింతదనుక ముద్రితము కాకపోవుట శోచనీయము. ఇది మంచెళ్ల వాసుదేవకవి కృతము. ఈతడు రచించిన 'చింతామణి వృత్తి'కూడ యముద్రితముగానే యున్నది.

నిజమునకు తెలుగు విద్యార్థికిగాని ద్రావిడ భాషా విద్యార్థికేని ప్రాకృతములన్నింటిని గ్రహించుట కష్టతరమే యగును. అయినను అసంఖ్యాకములగు తద్భవముల యర్థములను, శబ్దపరిణామరీతులను తమిళ మలయాళ కర్ణాటాంధ్రాది భాషలలో నిరూపించుపట్ల ప్రాకృభాషాకోవిదులు కొంత అవసరమనక తప్పదు. ద్రావిడ భాషలకు 'తద్భవకోశము'ను నొకదానిని శాస్త్రీయముగా సిద్ధమొనర్చుటవలన మహోపకారము కల్గును. దేశ్యములకు, తద్భవములకు శబ్దసామ్యములున్న సందర్భములలోను, వ్యుత్పత్తులను నిర్ణయించుపట్లను నిట్టికోశము ప్రయోజనకరముగా నుండవలెను. తద్భవములందు గల్గిన యర్థ విపరిణామములనుగూడ నీ నిఘంటువు నిరూపింపవలయును. ఇట్టిదొకటి యచిరకాలములో సిద్ధించుటకై ద్రావిడభాషావేత్తలు కృషిగావింతురని ఆశింతును.

పై నిరూపణమును ఈక్రిందిరీతిని చిత్రీకరింప నగును



# మాటల్లో బాధ

శ్రీ వి. మోహన ప్రసాద్

పదాలకు అర్థాలు వెతుక్కుంటున్నా డొకడు
నేనా అలౌకిక అర్థాలకు
పదాలు వెతుక్కుంటున్నాను.
సూర్యుడి కిరణాలు పట్టుకోబోతున్నాడొకడు
నేనా వెలుగు దారాల కొసని
సూర్యుడి ఉండకు చుట్టబోతున్నాను.
హృదయాన్ని ఒల్చుకుంటూన్నాడొకడు
చొక్కా చిరుగుల్ని కుట్టుకుంటున్నాన్నేను
చిక్కుపడి పోతున్నాది దారం
సూది కసుక్కున గుచ్చుకొంటున్నాది
బత్తాయి తొనల్ని నా ముఖంమీద ఊస్తున్నాడు వాడు.
మంచు ఎక్కడ్నించి రాల్తొందో
తెల్లబోయి చూస్తున్నాడొకడు
ఎర్రగారం దంచుతూ ఆవిడ
ఆనంద బాష్పాలు రాల్చుతోంది కారంలోకి
కళ్లల్లోకి బారిన తడిని
కొనగోట మీటుతున్నాన్నేను.
నా పెద్ద బాధేసింది నాకు
దుఃఖం ముఖం చూచారా మీరెప్పుడైనా
ఆ పక్క నోటీ ఈ బుగ్గనోటీ
రెండు చిన్న కన్నీటి బొట్లు
దుఃఖం పదంలో మధ్యలో బొట్లు
బాధే మరి
మాటనుంచి మంటనుంచి మంచునించి.

# వెత్తి

అయిపోయింది
అందరూ వెళిపోయారు
ఎవరి దారిన వాళ్లు

ఒక మతిమరపు గొడుగూ
స్ప్రింగులు మర్చిపోయే చెప్పులూ
కేకుల్లేని కాగితపు మూతలూ
నేలంతా యాష్ట్రేలే
ఏమీ లేదు చివరికి
ఏమీ జరగదు ఎప్పుడూ
కొండలోపలికి సూర్యుడు వెళ్లిపోయిన తర్వాత
రాలిన డిసెంబరు పూవులుతప్ప
జీవితం ఖాళీ అయిన టీకప్పు
అడుగున మిగిలిన చీమలుతప్ప
విందు అయిపోయిన తర్వాత
వెళ్తి
ఆ వెళ్తిని
అక్కడ కాస్త అక్కడ కాస్త సర్దాలి
కుర్చీల్ని మడిచి టేబిల్ క్లాత్ విదిల్చి
కప్పుల్ని లెక్కబెట్టి
ఎవడో చేజార్చిన వాచీని కాలితో తొక్కి
అట్టడుగున మిగిలిన డికాక్షన్‌తో
పెదవులు తడుపుకొని
ఒకటో అరో నీటి చుక్క
కళ్లల్లోంచి రాల్చి
అన్నీ సర్దుకోవాలి
సమంగా అన్ని మూలలకీ వెళ్తిని
వచ్చిన వాళ్లెంత నిర్దయగ వెళ్లిపోతారూ!

---

# పండితరాయల హాస్యం

డా. మహీధర నళినీమోహన్

మన ప్రాచీన సాహిత్యంలో శృంగార కరుణాది రసాలకిచ్చిన ప్రాధాన్యము హాస్యరసానికిలేదనే నింద ఒకటి ఉంది. అది నిజమేకూడానూ. బూతే హాస్యంగా చెలామణీ అయేదన్నా తప్పులేదు. బూతుల బుంగ లయిన లంబోదర ప్రహసనం మనకొక గొప్ప హాస్య కావ్యం.

బూతనిన నవ్వుచుందురు
బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో
బూతులు నీతులు లోక
ఖ్యాతులురా కుందవరపు కవి చౌడప్పా!

అన్న చౌడప్ప మనకొక హాస్యకవి.

నాటకాల్లో విదూషకుడి హాస్యం ఎంత సేపూ భోజనప్రియత్వంమీద 'ఆ పిల్ల మొహం బొబ్బట్టులా ఉంది' అనడం గొప్పహాస్యం కింద లెక్క. నీచపాత్రలేకాని ఉదాత్తపాత్రలు హాస్య మాడవు.

ఈ విధంగా గిరి గీసుకుని కూర్చున్న సాహిత్యరంగంలో సున్నితమైన హాస్యాన్ని ప్రవేశ పెట్టినవాడు జగన్నాథ పండితరాయలు.

పండితరాయల పేరు చెప్పగానే చాలామందికి లవంగి, ఆమెతో జగన్నాథుని ప్రణయ సన్నివేశాలూ గుర్తుకు వస్తాయి. కాశీలో గంగ ఒడ్డున లవంగి సరసన నిలుచుని పండితరాయలు ఆశువుగా చెప్పిన 'గంగా లహరి' కొందరికి గుర్తువస్తుంది. భట్టోజీ దీక్షితుని 'మనోరమ'ని ఖండిస్తూ అతడు వ్రాసిన 'మనోరమా కుచమర్దనము', అప్పయ్య దీక్షితుని 'చిత్రమీమాంస'ను ఖండిస్తూ వ్రాసిన 'చిత్రమీమాంసా ఖండనము' 'రసగంగాధరము' పండితులకి గుర్తు వస్తాయి. రసజ్ఞులకి మాత్రం 'భామినీ విలాసం' గుర్తు వస్తుంది. 'కావ్యేషు నాటకం రమ్యం... నాటకేషు శకుంతలా......' అన్నట్లు మళ్లీ ఆ భామినీ విలాసంలో చురకత్తిలా గుండెల్లోంచి దూసుకుపోయే హాస్య సన్నివేశాలు మరీ అందంగా కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. ఏమీ ఎరగనట్లు ఏదో మాటవరసకి అన్నట్లు అతడు విసిరే విసుర్లలో ఎంతెంత చిక్కని హాస్యం గుమ్మరించిందో పరిశీలించిన కొద్దీ ఆశ్చర్యంవేస్తుంది. ఆ హాస్యపు లోతులను గమ నించి విస్తుపోతూన్న పఠితలనుచూచి పండితరాయలు మీసాలచాటున నవ్వుకుంటున్నట్లు కనిపిస్తాడు. పండిత రాయలకి మీసాలుఉండేవా— అంటారేమో. ఉండే ఉంటాయి. ఏమంటే, పాషాణంలోంచి పీయూషం పిండగలిగిన మహాపండితుడు—అతని తండ్రి—ఉప ద్రష్ట పేరమభట్టు, తల్లి లక్ష్మిదేవి అప్పటికి ఇంకా బతికేఉన్నారు: వాళ్లు బతికుండగా పండిత రాయలు మీసాలు తీసేస్తాడా? తీసేద్దామని అతడు తలపెట్టినా లవంగి ఊరుకుంటుందా?

భామినీవిలాసంలోని పన్నెండువందల చిల్లర శ్లోకాలలోనూ ఏదో ఒక చమత్కారంలేని శ్లోకం అసలు లేనేలేదు. నాటిలో హాస్యరసం సమృద్ధిగా ఉన్న శ్లోకాలు అడపా తడపా తగులుతూఉంటాయి. ఆనాటి రాజాస్థానాలలోని కుత్సితాలను కుతంత్రాలను, రాజుల అరసికత్వాన్ని, పండితుల మాత్సర్యాన్ని, ధని కుల లుబ్ధత్వాన్ని, పండితమ్మన్యుల పటాటోపాన్ని తూర్పారబట్టే సందర్భాలలో అతడి హాస్యచమత్కృతి అమోఘమైనది.

సాయంకాలం చల్లబాటువేళ ఊరి వెలుపలికి వాహ్యాళికివెళ్లిన జగన్నాథుడికి చవిటిపర్రలలో మొలి

చిన గడ్డిపరకల్ని మునిపంట కొరుకుతూన్న ఒకగాడిద కనిపించింది. దానిని చూడగానే అతడికళ్లు తళుక్కుమన్నాయి. ఆ కళ్లల్లోని మెరుపు శిష్యులకి సుపరిచితమే. గాడిదకి పండితరాయలు సలహా ఇస్తూ ఆశువు అందుకున్నాడు. శిష్యుడి చేతిలోని గంటం ఆ వచోవేగాన్ని అందుకోలేక అవస్థపడుతోంది.

—ఓసి గాడిదా ! నడ్డివిరిగేలా బట్టలమూటలు తెగమోశావు. అయినా ఈ తుక్కుగడ్డిపరకలు ఏరుకునితినే ఖర్మం ఏమిటిచెప్పు నీకూ. మరి ఏంచెయ్యమంటారు అంటావా? మరేంలేదు. వెంటనే రాజుగారి గుర్రాలశాలలో జొరబడు. ఎవరూ చూడకుండా అక్కడ గుర్రాలకి సెనగగుగ్గిళ్లు పెడుతూఉంటారు. వాటిలో కలిసిపోయి నువ్వుకూడా హాయిగా తిను. ఊ వెళ్లు.

—అమ్మ బాబోయ్ ! అక్కడి రాజసేవకులు నన్ను గాడిదగా గుర్తుపట్టేసి, దుడ్డుకర్రలు తిరగేసి, నా కాళ్లు విరగ్గొడితే నా బతుకు ఏంగానూ అంటావా? నీకాభయం అక్కరలేదు. నేను చెబుతున్నాగా. గాడిదకీ గుర్రానికీ తేడా తెలిసినవాడు ఒక్కడుకూడాలేడు దివాణంలో. తోక ఉన్నదల్లా గుర్రమే అనుకునేసరుకు అక్కడ పనిచేస్తున్న వాళ్లంతా.

—పోనీ రాజుగారికైనా తేడా తెలియదా అంటావేమో. అబ్బెబ్బే ! ఆ రాజుకి అధికారులు చెప్పిందే వేదం. అంతేకాని స్వయంగా ఆలోచించే ఓపికా, తెలివీ ఆయనకి లేవు.

అయితే, దివాణంలో అసలు తెలివైనవాళ్లే లేరా అంటావేమో. లేకేమి? అక్కడా అక్కడా ఉండకపోరు. కాని వాళ్ల మాటకి ఖాతరీలేదు. ఆ సంగతి తెలిసి వాళ్లు తటస్థంగా ఊరుకుంటారు.

కనక, తొందరగా వెళ్లు.

**శార్దూల విక్రీడితమ్ :**

రేరే రాసభ ! వస్త్రభారవహనాత్
కుగ్రాస మశ్నాసి కిం?
రాజాశ్వావసథం ప్రయాహి
చణకాభ్యూషాన్ సుఖం భక్షయ
సర్వాన్ పుచ్ఛవతో హయంఇతి
వదంత్యత్రాధికారే స్థితాః
రాజాతైరుపదిష్టమేవ మనుతే సత్యం
తటస్థాఃపరే.

బరువుల్ మోసియు పట్టి గడ్డి దిన
నీ ప్రారబ్ధమా ? గాడిదా !
త్వరగా రాజతురంగశాలజనుమీ,
భక్షింపుమీ గుగ్గిళుల్,
తురగంబందురు రాజసేవకు లటన్
తోకున్న దేదేనియున్
నరనాథుండు సతమ్ము వారి నుడులేనమ్మున్—
తటస్థుల్ పరుల్.

రాజాస్థానాల్లో తెలివీతేటా లేనివాళ్లు ఉన్నత పదవుల్లో ఉంటారనీ, వాళ్లు ఎంతచెప్తే అంత నమ్మే స్థితిలో రాజు ఉంటాడనీ, తెలివైనవాళ్లకి విలువలేక వాళ్లు ముభావంగా ఉంటారనీ చెప్పడం పండితరాయల ఉద్దేశం. ఆ విషయాన్ని వాచ్యంగా చెప్పక పోవడంలోనేఉంది హాస్యం. రాజులూ, రాజాస్థానాలూ హరించిపోయినా ఈనాడుకూడా ఇదేవిధంగా జరగడంలేదూ? సార్వకాలికమైన ఈ సత్యాన్ని ఎంత హాస్య సుందరంగా వర్ణించాడు !

* * *

జగన్నాథుడికి షాజహాన్ చక్రవర్తి పండితరాజ బిరుద ప్రదానంచేసిన సంగతివిని, మాత్సర్యంతో తక్కిన కవులు పండితులూ ఎల్లా కుమిలిపోయారో వర్ణిస్తున్నాడు. మామూలు ఉపమలు అతడికి పనికిరావు. ఎవ్వరి ఊహలకీ అందని హాస్య రమణీయమైన అన్యాపదేశప్రక్రియని అందుకున్నాడు.

మామిడిపండుకి ఫలరాజముఅనే బిరుదుఉంది. అవునుమరి. ఆ రంగు, ఆ రుచి, ఆ వాసన అపాతరమణీయాలు. మిగిలినపళ్లకి వీటిలో ఏ ఒక్క సుగుణమో ఉంటే ఉండవచ్చునుగాని, అన్ని సుగుణాలూ ఒకేచోట కుప్పపోసినట్లుగా లేవు. అయినా మామిడి పండుకి అంతటి అపూర్వ ప్రశస్తి కలగడం సహించ

లేక పోయాయి మిగిలినపళ్ళు. అసహనంతో అవి ఏ విధంగా ప్రవర్తించాయో వివరిస్తున్నాడు.

మామిడిపండుతోపోలలేకపోయానే అనే సిగ్గుతో కమిలి నల్లబడిపోయింది నేరేడుపండు !

గుండె వెయ్యి ముక్కలైపోయింది దానిమ్మ పండుకి. పండినదానిమ్మ చెట్టునఉండగానే పగిలిపోవడమూ, లోపల చిన్నచిన్న ఎర్రని గింజలు—పగిలిన హృదయం బాపతు ముక్కల లాగ— కనిపించడమూ ప్రసిద్ధమేకదా !

'ఛీ! ఎందుకొచ్చిన బతుకూ?' అని ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో గుండెలో శూలం దింపుకుంది పనసపండు!. పనసకాయకి మధ్యలో నిట్ట నిలువుగా 'తాండం' అనబడే గట్టిపదార్థం ఉండడం అందరకూ తెలిసినదే. పైగా, పొట్టకొట్టడంకోసం పనసకాయలో నిట్టనిలువుగా అట్లకాడని గుచ్చుతారుకదా!

బాధ భరించలేక చెట్టెక్కికూర్చున్న కొబ్బరికాయకి గుండె చెరువైపోయింది !

ప్రసిద్ధమైన ఈ పళ్ళే ఇంతగా దిగాలుపడి నీరుకారిపోతే ఇంక అల్పమైన ఇతర ఫలాలను గురించి చెప్పేదేమిటి ?

**శిఖరిణీ :**

త్రపాశ్యామ జంబూ  
ర్దళిత హృదయం దాడిమ ఫలమ్  
సశూలం సంధత్తే హృదయ  
మభిమానేన పనసః  
భయా దంతస్తోయం  
తరు శిఖరజం లాంగలి ఫలమ్  
సముద్భూతే చూతే  
జగతి ఫలరాజే ప్రసరతి.

దళితంబయ్యెను గుండె దాడిమకు,  
మీదన్ నల్పు జంబూఫలం  
బులకుం గల్గెను సిగ్గుచే,  
పనస రొమ్ముంగ్రుమ్మె శూలమ్మునన్,

సలిలంబయ్యెను గుండె కొబ్బరికి
వృక్షా(గమ్మునన్ భీతిచే,
ఫలరాజంబను పేర చూతమునకున్
(ప్రఖ్యాతి (ప్రాప్తించుటన్.

*

ఉదాత్త విషయాలనుగురించి (ప్రసంగిస్తూన్న సమయంలో అజ్ఞాన జనితమైన అత్యల్ప విషయ (ప్రస్తావన నవ్వు తెప్పిస్తుంది.

ఒక రాజహంస బహుదూరంనుంచి ఎగిరి ఎగిరివచ్చి, అలసట తీర్చుకోవడంకోసం ఒక చెరువు గట్టున వాలింది. అక్కడ బోలెడన్ని కొంగలు చేపల్నీ, కప్పల్నీ తింటూ కొలువుతీరి ఉన్నాయి. ఆ కొంగలు హంసలని ఇంతకుముం దెప్పుడూ చూడలేదు. శరీరపు రంగుచూస్తే తమలాగే తెలుపు. కళ్ళు, ముక్కు, కాళ్ళుమాత్రం తమకిలాగ బూడిదరంగులో లేకుండా ఎర్రగా ఉన్నాయి. నడకలో బోలెడంత రాజ సమూ లీవీ ఉట్టిపడుతున్నాయి. 'ఎవరబ్బా ఇతడు?' అనుకుని దగ్గరగావచ్చి, కళ్ళు ఇంతింత చేసుకుని పలకరించాయి.

కొంగలు: నీకాళ్ళు. ముక్కు, కళ్ళుచూస్తే ఎర్రగాఉన్నాయి, ఎవరు నువ్వు?

హంస : నేను హంసని.

కొం : హంసవా? ఎక్కడినుంచి వస్తున్నావు?

హం : మానస సరోవరం నుంచి.

కొం : ఓయబ్బో! అక్కడి విశేషాలేమిటీ కాస్త చెప్పు వింటాం.

హం : మానస సరస్సులో బంగారు తామర పువ్వులు కలకలలాడుతూ తామరతంపరగా ఉంటాయి. అందులోని నీరు అమృత సమానంగా ఉంటుంది. నవరత్నరాసులు పొదిగిన దాని తీరం ధగద్ధగాయ మానంగా ఉంటుంది. ఆ తీరంలో కల్పవృక్షాలు పెరుగుతాయి.

ఆ కొంగలకి ఈ వర్ణనఅంతా గవడగొయ్యిలా ఉంది. హంస చెప్పిన సంగతులేవీ తమకు అనుభవంలో ఉన్నవి కావాయె. (ప్రశ్న వేయడానికికూడా కొంత తెలియాలికదా! ఆఖరికి ఒక కొంగ సాహసించి అడిగేసింది.

కొం : అక్కడ నత్తలుంటాయా?

'నత్తలు అంటే ఏమిటో రాజహంసకి తెలియదు. ఎప్పుడూ చూడనైనాలేదు. అందుకని 'లేవు' అంది.

'నత్తలే లేవా? హేహేహేహే' అని కొంగలన్నీ నవ్వేశాయి పక్కలు కుదుపుకుంటూ.

ఐన్‌స్టీన్‌ని పట్టుకుని 'రెండోఎక్కం వచ్చునా?' అని అడిగితే (ప్రశ్నవేసినవాడి అజ్ఞానానికి నవ్వొస్తుంది. అప్పయ్య దీక్షితుల్ని చిత్తుచేసేసిన ఉద్దండ పిండం పండితరాయల్ని పట్టుకుని 'మాహేశ్వర సూత్రాలు వచ్చునా?'అని ఓ అమాయకుడు అడిగేడు. దానికి ఈ శ్లోకమే అతని సమాధానం.

**శార్దూలం :**

కస్త్వం లోహితలోచనా స్య చరణో?
హంసః—కుతో? మానసాత్
కిం తత్రాస్తి? సువర్ణ పంకజవనా
న్యంభః సుధాసన్నిభమ్
తత్తీరం నవరత్నఖండఖచితం
కల్పద్రుమాలంకృతమ్—
శంబూకాః కిము సంతి?
నేతి చ బకై రాకర్ణ్య హీహీకృతమ్.

మ॥ ఎవరీ వాస్యపదాంబకంబు లెరుపుల్?
ఏ నంచను—ఎందుండువో?
అవలన్ మానసమందు—ఏమి కలవో
అచ్చోట? స్వర్ణాబ్జముల్,
నవరత్నంబులు, కల్పవృక్షము,
సుధాప్రాయాంబువుల్—నత్తలో?
అవి లేవన్న హసింపసాగె
నిహిహీయంచున్ బకానీకముల్;

*  *  *

జగన్నాథ పండితుడు బాహ్యామందిర ద్వారం దగ్గరే షాజహాన్‌దగ్గర సెలవు పుచ్చుకుని వచ్చేసే వాడు. రాణీసాహేబావారికి నడ్డిరుద్ది స్నానంచేయించే కొజ్జావాడు ఒకడు జగన్నాధుణ్ణి వేళాకోళం చేశాడు,

తాను అంతఃపురంలో అంతటా స్వేచ్ఛగా తిరగ్గల నని, జగన్నాథకవిమాత్రం కోట గుమ్మందగ్గరే ఆగి పోవాలనీ, తనకీ ఈ బాపనయ్యకీ పోలిక ఎక్కడ అనీ......

ఆ ఎత్తిపొడుపుకి జగన్నాథుడికి కోపంరాలేదు. అతడిని చూడగా జాలివేసింది. ఆ జాలి నిందాగర్భి తమై ఈ విధంగా బయటపడింది.

కోట గుమ్మంబయట గుంజకి కట్టుబడిఉన్న పట్టపుటేనుగునిచూసి, పిల్లి ఒకటి పళ్లు ఇగిలిం చింది. మణులు తాపడంచేసిన రాజాంతఃపురంలో స్వేచ్ఛగా విహరించగలనని విఱ్ఱవీగకు పిల్లీ, కోట బయట కట్టుబడిఉన్నప్పటికీ మత్తేభానికి లోటు ఏమీలేదు. పట్టాభిషేక సమయం వచ్చిందంటే అంబారీవేసి అలంకరించిన ఈ ఏనుగుదగ్గరకే చక్ర చక్రవర్తి స్వయంగా వస్తాడు. అప్పుడు నువ్వు సోది లోకికూడా ఉండవు. పైగా కనిపించావంటే పిల్లి శకునంఅని నీ కాళ్లు విరగ్గొట్టగలరు జాగ్రత్త!

**వసంతతిలక :**

మా గర్వముద్వహ బిడాల!
మహీపతీ నా
మంతర్గృహం మణిమయం
నిలయో మమేతి
పట్టాభిషేక సమయే
పృథివీపతీనాం
బాహ్యస్థితస్య
కలభస్య హి మండనశ్రీః,

హేల జరింప నేర్తు మణి
హేమమయోన్నత సర్వధారుణీ
పాలగృహాంతరంబుల
నవారిగ నేనని గర్వమేల మా
ర్జాలమ! బైటనుండినను
రాజుల పట్టపువేళ భద్రశుం
డాలమె మండనంబుల
ఘనంబుగ బొందును, నిన్ను జూతురే?

* * *

ఒకప్పుడు పండితరాయలు ఒకపాటి చిన్న సంస్థానాన్ని దర్శించబోయాడు. అక్కడి రాజుకి ఇతగాడి అసాధారణ పాండిత్య ప్రతిభాదులు అంతగా అర్థంకాలేదు. ఇతడిముందు ఏనుగుదగ్గిర దోమ లాంటి మరొక చిల్లరపండితుడు అదే ఆస్థానంలో ఉన్నాడు. వారిద్దరి అంతరమూ ఎరుగని రాజు వీరిద్దరికీ సమానమైన గౌరవం చేశాడు. ఊరూ పేరూలేని ఒక అల్పుడిని తనతో సమానుడు అన్నట్లు కూర్చోబెట్టి మర్యాదచేయడం పండిత రాయలకి నచ్చుతుందా? అసలు సన్మానం చేయక పోయినా ఫరవాలేదు కాని ఇదెక్కడి పోలిక? అతడిహృదయం భగ్గుమంది. కాని ముఖంలోమాత్రం చిరునవ్వు వెలుగుతూనే ఉంది. తన అభిప్రాయాన్ని సూటిగా కర్రవిరిచి పొయ్యిలో పెట్టినట్లు వ్యక్తం చేస్తే ఏం బాగుంటుంది? బంగారానికి జరిగిన ఒక పరాభవాన్ని వర్ణించాడు.

నిప్పుల్లోవేసి ఎఱ్ఱగాకాల్చినా, కరిగించినా, సుత్తితో మొత్తినా, ముక్కలకింద కోసినా, ఆకు రాయితో అరగదీసినా బంగారానికి విచారంలేదట. కాని, గురివెంద పూసలతో సమానంగా త్రాసులోపెట్టి తూచుతారుకదా అని అపరిమితంగా బాధపడిందిట!

**అనుష్టుప్ :**

హేమ్నః ఖేదో న దాహేన
భేదేన కషణేనవా
తదేవతు మహద్దుఃఖమ్
యద్గుంజా సమతోలనమ్.

అగ్గిలోపల పడవేసి, అరుగదీసి
కోసినను కుందదాయెను కుందనమ్ము
త్రాసులోనిడి గురివెంద పూసతోడ
తూతురు సమంబుగానని దుఃఖపడియె.

* * *

పండితరాయలు ఏ సభకివెళ్లినా అక్కడి ఆబాలగోపాలమూ ఇతడికి వంగి నమస్కరించడం మామూలు అయింది. అతడికీర్తి అటువంటిది. కాని, ఒక సభలో అనామకుడైన ధూర్తుడు ఒకడు పొగ రుగా జగన్నాథుడిముందర వంగలేదు. నమస్కరించ లేదు. పండితరాయలు అతడిని క్రీగంట గమనించి తక్కినవారంలా చూస్తూఉండగా అతడిని ఈ విధంగా ఆక్షేపించాడు.

జగత్తు కంతకీ ప్రాణాధారభూతుడు • మహాను భావుడు అయిన వాయుదేవుడు వచ్చేసరికి మామిడి పనసవంటి మంచిమంచి చెట్లన్నీ తలలువంచి నమ

స్కారాలు చేస్తున్నాయి. ఆ చెట్లమీద కోకిలలు, చిలుకలు కలధ్వనులుచేస్తూ వాయుదేవుణ్ణి ఆహ్వా నిస్తున్నాయా అన్నట్లు ఉన్నాయి. ఓరి తాటిచెట్టూ! కల్లుకుండలు మెడకి కట్టుకుని నువ్వు ఒక్కడివి వంగకుండా ఉన్నావు. నీయీఆచర్యవల్ల నీ అల్పత్వమే బయటపడింది కాని మహాత్ములకి నష్టం ఏముందిరా?

**శి ఖ రి ణీ :**

జగత్ప్రాణే ప్రౌఢే నికట
ముపయాతేసతి హఠాత్
వినమ్రా ఆమ్రాద్యాః
శుకపికవశ్చాటుపటవః
సురాభాండం కంఠే వహతి
న నతే తాళహతకే
సుదుర్వృత్తే తస్మిన్
క్షతిరిహపునః కాచ మహతామ్.

పరమోత్కృష్టుడు సర్వ వందిత జగ
త్ప్రాణుండు విచ్చేసినన్
శిరసుల్ వంచి నుతించు కోకిల వచ
శ్శ్రేణిన్ రసాలాది స
త్తరువుల్—వంగవు కల్లుకుండలు మెడన్
దర్పంబునన్ దాల్చి, నీ
పరువే వెల్లడి దీన పెద్దలకు
లోపంబేమి? తాళాధమా!

* * *

ఏనుగు శరీరంమీద కారే మదజలానికి 'దానం' అని పేరు. ఈ దాన శబ్దానికిగల అర్థద్వయాన్ని దాతృ యాచక సంబంధాన్ని సూచించడంలో పండిత రాయలు అద్భుతంగా ఉపయోగించుకున్నాడు. తుమ్మెదలకి ఈ మదజలం తాగడం చాలా ఇష్టమని కవి సమయం.

ఒక తుమ్మెద మునిమాపువేళ దాహంవేస్తూ ఉండగా, తాగడానికి ఏదైనా దొరుకుతుందేమోనని పరకాయించిచూస్తూ, ఝుమ్మని రొద పెడుతూ తిరుగుతోంది. అంతలో దాని పుణ్యంవచ్చి బహు దూరాన ఏదో జంతువు కనిపించింది. లావుగా ఉంది. నల్లగా ఉంది. పైసరుబజ్జ ఏనుగు కని పించిందని మహాసంతోషంతో దానార్థియై ఉరుకుల మీద దగ్గరగా వచ్చింది. ఆజంతువును తేరిపార చూచి నీరు కారిపోయింది. ఏమంటే, ఇంతకీ అది ఏనుగు కాదు, దున్నపోతు!

పెద్ద నాలుగిళ్ల భవంతి. ఏనుగు తొండాల గుమ్మాలు. పెద్దప్రహరీ గోడ. అట్టహాసం అంతా చూచి, ఎవడిదో సద్గృహస్థు ఇల్లు అనుకుని, ఏమైనా ముట్టచెప్తాడేమో అని ఆశపడి, దీను డొకడు దగ్గరకు వెళ్లగా, ఆ గృహస్థు ఎంగిలి చేతితో కాకిని అదలించని మహానుభావుడని గుర్తించి దిగాలుపడిపోయిన ఘట్టాన్ని మనస్సులో ఉంచుకుని చేసిన వర్ణన ఇది. ఆ దూరపు జంతువు ఏనుగు అని పాఠకులనుకూడా భ్రమింపజేసి, అది దున్నపోతు అనే విషయాన్ని ఆఖరివరకూ రహస్యంగా ఉంచడంలో చక్కని హాస్య చమత్కృతి ఉంది.

**ఆర్యా :**

నీలతయా స్థూలతయా
దూరతయా దానలోలుపై ర్మధుపైః
ధావిత మిభరాజ ధియా
హంతా సీదస్తతో మహిషః

స్థూలమైన మేను, నీలంపు మైచాయ
దూరమందు తేటి పారజూచి
ఏనుగనుచు నమ్మి దానార్థియై చేరి
మహిషమగుట తెలిసి మ్రానుపడియె.

* * *

బ్రహ్మదేవుడి బుద్ధిహీనతను నిందించడం కవులకొక విలాసం.

కస్తూరిమృగాలు ఉన్నాయి. బహు పిరికివి. ఎవ్వరికీ ఏ హానీ చెయ్యలేనివి. ఎక్కడో కాకులు దూరని కారడవుల్లో గడ్డితిని పొట్టపోసుకుంటూ తిరిగే అమాయికమైన ఈ లేళ్లబొడ్డుల్లో కస్తూరిని తీసుకువెళ్లిపెట్టి ఎంత తెలివితక్కువపని చేశావయ్యా బ్రహ్మదేవుడా! నీవుపెట్టిన కస్తూరివల్ల ఆ మృగాలకి ఒరిగినదేమిటి? ఆ వాసనవల్ల వాటి ఆచూకీ తెలిసి, కిరాతులు వాటినిచంపి, ఆ కస్తూరిని పెకలించుకు పోతున్నారు. కస్తూరిని నిక్షేపించడానికి నీకు ఇంతకన్న మంచిచోటు దొరకలేదా? నన్ను అడిగితే నేనే నా సలహా ఇచ్చిఉందునే. కొండెములుచెప్పే దుర్మార్గుల నాలుకలమీద కనక ఈ కస్తూరిని సృష్టించిఉంటే ఎంత లోకోపకారం జరిగేదయ్యా! దుర్మార్గులకి కస్తూరివంటి బహుప్రశస్తమైన వస్తువును ఇవ్వవలసిందని కోరడంలోనూ, మంచిగా కనిపించే ఆ పనివల్ల వాళ్లకి వినాశనంకలిగి

లోకోపకారం జరుగుతుందని డొంక తిరుగుడుగా చెప్పడంలోనూ హాస్యం పుడుతోంది.

**వసంత తిలక :**

కస్తూరికాం తృణభుజా మటవీచరాణామ్
విన్యస్య నాభిషు వధాయ వృథా చకార
మూఢో విధి స్సకిల దుర్జనలోలజిహ్వా
మూలేషు నిక్షిపతిచేత్ సకలోపకారః

పూరినిమేయు చు న్నడవి
మూలల నుండెడు లేళ్ల బొడ్డులన్
వారిజసంభవుండు మృగనాభి సృజించె
వృథా వధార్థమై
క్రూరుల లోలజిహ్వికల లోపల
దాని సృజించి యుండినన్
ధారుణి నెల్లవారల కొనర్పగ నౌను
మహోపకారమున్.

* * *

డబ్బా కొట్టుకోవడం మూడు రకాలు. స్వ–పర–పరస్పర ! అందులో ప్రశస్తమైనది ఆఖరుది. ఈ సార్వత్రిక సత్యాన్ని పండితరాయలు బహు చమత్కారంగా చెప్పేడు.

కోతులపెళ్లి అవుతోంది. ఆ పెళ్లిలో పాటలు పాడడానికి గాడిదలు వచ్చాయి. ఓహోహో ఏమి సౌందర్యంఅని కోతులను గాడిదలు, ఏమి అద్భుత గాత్రంఅని కోతులు గాడిదలని మెచ్చుకున్నాయి.

**అనుష్టుప్ :**

వానరాణాం, వివాహేషు
తత్రగార్దభ గాయకాః
పరస్పరం ప్రశంసంతి
అహోరూప మహోధ్వనిః.

వానరముల మేటి వైవాహికములందు
గార్దభములు పాటగత్తెలంట
ఏమి రూపమంచు నేమి గాత్రమటంచు
నుబ్బవేయజొచ్చి రొకరినొకరు

* * *

భట్టోజీ దీక్షితుల్ని సవాలు చేయగలిగిన ఒక మహావైయాకరణి ఒక ఆస్థానానికి వచ్చాడు. అతగాడి పాండిత్య ప్రకర్ష అర్థంగాని సభాసదులు చప్పగా ఉన్నదని నిరసించారు. ఇక్కడ తన పాండిత్యం గవ్వని కూడా మారలేదేఅని ఆ మహాపండితుడు విచారిస్తున్నాడు. ఎందుకయ్యా వెర్రివాడా ! అల్లా బాధపడుతున్నావు? ఇంకా నయంకదూ, నీలో పసలేదని విడిచిపెట్టి ఊరుకున్నారు. అంతటితో సంతోషించు. ఏమంటావా?

ఒక కోతికి ఎక్కడో ఒక మాణిక్యం దొరికింది. అది ఏదో తినేవస్తువుఅని ఆశపడి చెట్టు మీదికి తీసుకువెళ్లి అటూ ఇటూ తిప్పిచూసింది. వాసన చూసింది. గోకింది. పీకింది. చప్పరించింది. పళ్లతో కొరకబోయింది. అందులో మాధుర్యం ఏమీ కనబడక ఛీ పనికిమాలినవస్తువు దొరికిందని కింద మట్టిలో విసిరికొట్టింది. 'నేను అంతదాన్ని ఇంతదాన్ని ఈ కోతి నన్ను ఇల్లా అవమానిస్తుందా?' అని మాణిక్యం విచారిస్తోందిట. 'విచారించకు. నీకు మేలే జరిగింది. నీలోపల ఏముందో చూద్దామనే జిజ్ఞాసతో నిన్ను రాతిమీద పగలగొట్టనందుకు సంతోషించు' అని కవి ఓదారుస్తున్నాడు.

**శార్దూలం :**

ఆఘ్రాతం పరిచుంబితం ముహురహో
లీఢం పునశ్చర్వితమ్
విక్షిప్తం భువి నీరసేన మనసా
తత్రవ్యథాం మా కృథాః
హే మాణిక్య ! తదేతదేవ కుశలం
యద్వానరే ణామునా
చాంతస్సారవిలోకనవ్యసనినా
చూర్ణీకృతం నాశ్మనా.

పాడువనేచరం బొకటి వాసనచూచి,
విదల్చి, పీకి, నిన్
వేడుక చప్పరించి కడు
నీరస వస్తువుగా దలంచి పో
నాడెనటంచు కుందకు మహామణి!
లోపల నేమియున్నదో
చూడదలంచి రాతిపయి
చూర్ణము జేయమి సంతసింపుమా !

* * *

వేళాపాళా లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు వచ్చి, అది కావాలి ఇది కావాలి అని విసిగించే యాచ

కులని చూస్తే ఎంతమంచివాడికైనా ఎంత గొప్ప
వాతకైనా విసుగేస్తుందిట. దానికొక అపూర్వమైన
ఉపమానం చెప్పేడు. అర్ధరాత్రివేళ పడగ్గదిలో ఉన్న
సమయంలో కేర్‌మని ఏడిస్తే ఎంతముద్దులకొడుకుని
అయినాసరే కన్నతల్లి అయిఉండీకూడా విసుక్కోక
మానదు.

**ఆర్యా :**

సుజనోఒపిహి కుప్యతి భృశ
మనవసరజ్ఞేన యాచితాః సుహృదా
సురతాంతరే రుదంతం
ప్రియమపి పుత్రం శపత్యహో జననీ.

తే॥ సమయ మెరుగక యాచింప సాహసింప
సజ్జనునకైన కోపమ్ము సంఘటిల్లు
సురత మధ్యమ్ములో నేడ్వ జొచ్చెనేని
కన్న తల్లియు బిడ్డను కసరు కొనును.

*

అందరూ అవునని మెచ్చుకున్నదానిని కాదంటే,
ఆ కాదనడంకూడా వితండవాదన కాకుండా చమ
త్కారంగా సమర్థించగలిగితే నవ్వొస్తుంది.

మేఘుడు గొప్ప దాతఅని లోకంలో వాడుక. అత
డిచ్చే నీళ్లని జీవనములని గొప్పగా చెప్పుకుంటారు. అత
డిని ఘనుడంటారు. భూమిమీద సమస్తజీవరాశులూ
బతికి ఉండడానికి అవసరమైననీటిని అతడే దయ
చేస్తున్నాడు. అటువంటి మేఘుణ్ణి పట్టుకుని 'నువ్వె
క్కడి దాతవయ్యా' అనడానికి చాలా సాహసంకావాలి.

గర్జిస్తూ నీళ్ళు ఇస్తాడు. అది అయినా
చుక్కలు చుక్కలుగా—అక్కడా అక్కడానూ. — అది
అయినా ఎంతోకాలం ఎదురుచూడగా మురిపించుకుని
మురిపించుకుని. పోనీ ఆ ఇచ్చే నాలుగు చినుకులూ
సంతోషంగా ఇస్తాడా అంటే అదీలేదు. ఇచ్చేటప్పుడు
మొహం నల్లగా మాడ్చుకుని ఇస్తాడు. ఇచ్చేసిన
తరువాత వెలవెల బోతాడు. తేలిక అయిపోతాడు.
ఇటువంటి మేఘుణ్ణి దాత అనడం ఏం సబబూ ?

**శార్దూలం :**

గర్జన్నంబుదదాతి తచ్చ కణికా
రూపేణ యత్ర క్వచిత్
కాలాపేక్షతయా ప్రదాన సమయే
నైల్యం విధత్తే తనో
పశ్చాత్పాండురతా ముపైతి
లఘుతా మభ్యేతి భూయస్తరామ్
వీరశ్రీ పఘురత్నశేఖరమణీ
దాతా కియాన్ వారిదః
విదలించున్ జలబిందువుల్ నసుగుచున్
వేమార్లు గర్జించుచు
న్నెదురుం దెన్నులు జూడ—
ఇచ్చెడు తరిన్ మేనెల్ల నీలంబగున్
పిదపన్ వెల్వెలబారు నా వెనుక
లఘ్వీభూతమై పారు తో
యదమున్ దాత యటంచు పల్కు
టపహాస్యప్రాయ వౌనేకదా!

*

ఒక సామాన్యమైన వాక్యంఉంది. అందులో
నవ్వు తెప్పించేదేమీ ఉండదు. కాని, దాని తరువాత
చెప్పిన వాక్యంవిని, మళ్లీ మొదటివాక్యాన్ని మన
స్సులో మననం చేసుకుంటే, అర్థవైపరీత్యం తోచి,
నవ్వురావచ్చు. విడివిడిగా చూస్తే ఆ వాక్యాలకు దేనికీ
హాస్యరసోత్పాదకశక్తిఉండదు. రెండూ కలిస్తేనే
అందం. అటువంటి చమత్కారం ఒకటి చూద్దాం.

పండితరాయలు కవిత్వం చెప్తూఉండగా విని,
మిగిలినవిద్వాంసులుకూడాకవితలల్లడంమొదలుపెట్టేరు.

శివుడు నృత్యం చేస్తూఉంటే చూచి,భూతప్రేత
పిశాచాలుకూడా నృత్యం చేయడం మొదలు పెట్టేయి.

వీటిలో మొదటివాక్యంలో ప్రత్యేకత ఏమీ
లేదు. రెండవవాక్యంలోని వస్తుక్రమాన్ని పరిశీలిస్తే
జగన్నాథునికి శివునికి పోలిక, ఇతర పండితులకి పిశా
చాలకీ పోలిక కనిపించి నవ్వొస్తుంది.

**ఆర్యా :**

కవయతి పండితరాజే
కవయంత్యన్యేపి విద్వాంసః
నృత్యతి పినాకపాణౌ
నృత్యంత్యన్యేపి భూతవేతాళాః

ఘనుడు పండితరాయండు కవిత లల్ల
అల్లసాగిరి కవనమ్ము నన్యకవులు
వెండికొండను గిరిశుండు తాండవింప
తాండవించును భూతభేతాళ కులము.

# శ్రీనాథుని భోజనము

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

పదునైదవ శతాబ్దపుటాంధ్ర సాహిత్య సామ్రాజ్యమునకు శ్రీనాథమహాకవి సార్వభౌముడు. నాన్యతో దర్శనీయమైన వివిధ సాహిత్య ప్రక్రియలను నిర్వహించి మహాకావ్యములను సృజించిన ప్రతిభాశాలి.

సందర్భానుసారముగ కావ్యములలో శ్రీనాథకవి సార్వభౌముడు వర్ణించిన భోజనములజూచి కొందరాధునిక విమర్శకులు శ్రీనాథుని భోజనప్రియునిగా నూహింప సిద్ధపడినారు.

భోజనప్రియత్వము తప్పుకాదుగదా !

మహాకవులుగా బేర్గాంచిన వారిలో శ్రీనాథుని చాటువులే ప్రాచుర్యము వహించియుండుట గమనార్హము. దానికి కారణ మందలి విషయములు జనసామాన్యమునకు చేరువుగ నుండుటయే! చక్కిలిగింతలు పెట్టు చమత్కార పూరితములైన ఆ చాటువులు ప్రజల రసనాగ్రములనే తాటియాకులుగ జేసికొని నెలకొనియుండుటలో నాశ్చర్యములేదు.

అట్టి చాటువులలో శ్రీనాథుని దృష్టి భోజనముపై నెంతవరకున్నది పరిశీలింతము.

శ్రీనాథుడు కర్ణాట సామ్రాజ్యమున కరిగినాడు. అట రాజాస్థానమున ప్రవేశము లభించుట కష్టమయ్యెను. కాలహరణమగుచుండెను. ఆ రాజ్యమున సామాన్యునివలె జీవింపవలసివచ్చెను. ఆహారము సరిగానున్నచో మిగిలిన వెట్లున్నను సమర్థించుకొని పోవచ్చును. కాని అదియే సరిగా నమరలేదు. ఎన్ని తిప్పలు మహాకవికి ! కర్ణాటరాజ్యలక్ష్మి నిట్లు ప్రార్థించినాడు.

కుల్లాయుంచితి గోకచుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్
విశ్వస్త వడ్డింపగా
సల్లానంబలిద్రావితిన్ రుచులు
దోసంబంచు బోనాడితిం
దర్లీ ! కన్నడరాజ్యలక్ష్మి ! దయలేదా
నేను శ్రీనాథుడన్.

తెలుగునేలపై బండిన కర్పూరపుభోగివంటకము భుజించిన శ్రీనాథుడు కర్ణాటదేశమున వెల్లుల్లిపాయలను తెలకపిండిని తినవలసివచ్చెనట ! ఎంత కష్ట మెంతకష్టము ! అంతేకాదు. విధవరాలు వడ్డింపగా అంబలిలో చల్ల కలిపికొని జుర్రవలసి వచ్చెనట ! అందనిపళ్లు పులుపు. అందులకే ఇపుడు 'రుచులు కోరికొనుట దోషమని ఉన్నదే గ్రహించి భుజింపవలసివచ్చినది !

ఇట్టి భోజనము శ్రీనాథునకు గిట్టదు. కాననే పలినాటినిగూర్చి యిట్లనాదరముగా బల్కినాడు.

'కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

కర్మకాలి మన్మథుడు పలినాటికి పోయెనా జొన్నకూడుదినక తప్పదన్నమాట. అందుకే 'రసికుడు పోవడు పల్నాడ'ని పల్కినాడు. అచటి జొన్నన్నము తిని మొగము మొత్తినది. అచటి భోజనముగూర్చి పలు పద్యములందు చెప్పినాడు.

'జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ బల్నాటిసీమఁ బ్రజలందఱకున్'.

పల్నాడులో శ్రీనాథుడు 'పాసిన వంటకము' 'సజ్జజొన్న కూళ్లు' పదే పదే చూచినాడు. శ్రీనాథుని

యుద్దేశమున విషమునైనను, దవాగ్నినైనను మ్రింగ వచ్చునేమోగాని, పలనాటి తిండి తినలేము. అందుకే ఇట్లు సవాలు చేసినాడు.

'ఫుల్ల సరోజ నేత్ర! యల
పూతన చన్నుల చేదు ద్రావి నా
నల్లదవాగ్ని మ్రింగితి
నటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు
బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన యొక్క ముద్ద
దిగ మ్రింగుమ! నీ పస కాననయ్యెడిన్.'

రేనాటిసీమ పలనాటిసీమకు ఏ మాత్రము తీసిపోకుండుటచూచి, అట మరియొక సవాలును విసిరినాడు. ఈ పందెములన్నియు దేవుళ్లపైననే!

'గరళము మ్రింగితి నంచుం
బురహర! గర్వింపబోకు పో!పో!పో! నీ
బిరుదింక గానవచ్చెడి
మెఱసెడి రేనాటి జొన్న మెదుకులు తినుమీ!'

మాతృభూమిని వదలిపోయిన తరువాత ఏ భూమియు శ్రీనాథునకు నచ్చలేదు. ఈ వంటకము లకు ఆ భోజనములకు హస్తిమశకాంతరము గదా! 'కూడు తలప చోళ్లు!' 'కూర కారామళ్లు!'. పోనీ, ముప్పూటను అవే తినుదమన్న 'కలవు మాపటివేళ గంజినీళ్లు!'. ఇట్లు దక్షిణదేశపు భోజనములను పెక్కుపద్యములందు స్మరించినాడు. భోజన పరా క్రమమమాత్రమే కలవారి నిట్లు హేళన చేసినాడు.

'గ్రామము చేతనుండి
పరికల్పిత ధాన్యము నింటనుండి
శ్రీ రామకటాక్ష వీక్షణ పరంపరచే
గడతేఱగాక మా
రామయమంత్రి భోజన
పరాక్రమమేమని చెప్పవచ్చు? నా
స్వామి యెఱుంగు దత్కబళ చాతురి
తాళఫల ప్రమాణమున్'

అవసానదశలో శ్రీనాథుడు చెప్పిన చాటువని చెప్పబడు సీసమునన్న

'స్వర్గస్థుడయ్యె విస్సన్నమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిగలదు?'

అను చరణములు గమనార్హములు. హేమ పాత్రలో భుజించిన శ్రీనాథునకిట్టి దురవస్థ సిద్ధిం చుట విషాదకరము.

ఉపలభ్యములైన గ్రంథములలో శృంగార నైషధమే శ్రీనాథుని కృతులలో మొదటిది. 'విద్వ దౌషధము'ని పేరుపడ్డ హర్షనైషధమున కిది యను వాదము. ఏ యితర భాషలోను హర్షనైషధమునకు శ్రీనాథుని శృంగార నైషధమువంటి చక్కని యను వాదములేదని శ్రీ గంటి జోగిసోమయాజులుగారు వక్కాణించినారు. దీనినిబట్టి శ్రీనాథుని శృంగార నైషధమునకుగల ప్రాగల్భ్యము స్పష్టమగుచున్నది. ఈ గ్రంథమునకు బువ్వపుబంతి ఘట్టమొక ఆకర్షణ. ఇందు శృంగారపుభాగము కొంచెమెక్కువనియే చెప్ప వలెను. ఈ లోపము నా భాగమందలి రచనాపాటవము కప్పిపెట్టుచున్నది. మూలమునన్న శృంగారాతిశయ మును చాలవరకు తగ్గించినాడని శ్రీనాథుని సమర్థింప యత్నించినను, నిజమునకు ఇంకను తగ్గించియుండ వలసినది! ఇట శ్రీనాథుడు ప్రతివిషయమును మిగుల జాగరూకతతో పరిశీలించినాడు. 'హస్తపాద ప్రక్షాళనగండూష ముఖమజ్జనంబు లాచరించి'న తరు వాతనే 'బంధువులు తమతమ నిర్దిష్టంబులగు నర్హా సనంబుల గూర్చుండి చతుర్విధాహారంబుల భుజి యింప దొణగిర'ట. ఆ భోజన మెటులున్నది? పగు లని నిండుమెతుకులుగలది, కలియనిమెతుకులుగలది, రుచియైనది, తెల్లనదియై అమృతమును తలపించు చున్నదట!

ధీమంతుడైన శ్రీనాథుడు అమూలకములైన పద్యములను పెక్కింటిని శృంగారనైషధమున జేర్చి నాడు. ఇవి యా మహాకవి యాత్మీయతకు ప్రతిబింబ ప్రాయమైన స్వతంత్రరచనాకళానైపుణికి మాత్రమే నిదర్శనము లనుటలో సందియములేదు. శ్రీనాథుడు తన కిష్టమైన పెక్కువంటకముల నీ బువ్వపుబంతి ఘట్టమున స్వతంత్రముగా రచించినాడు. ఇందలి వంటకముల పేళ్లు మిగిలిన గ్రంథములందలి భోజన వర్ణనములందును గన్పట్టుట గమనార్హము.

'గోధూమ సేవికా గుచ్ఛంబు లల్లార్చి
ఖండశర్కరలతో గలపి కలపి
గుజ్జుగా గాచిన గోక్షీరపూరంబు
జమలి మండెగలపై జల్లిచల్లి,
మిరియంబుతోగూడ మేళవించిన తేనె
దోరంపు లడ్వాలు దోచితోచి,
పలుచగావండిన వలిపెంపు జాపట్లు
పెసరపప్పులతోడ బెనచిపెనచి
గోవ జవ్వాది గస్తూరి గొఱత పఱచు
వెన్నపడిదెంబుజొబ్బిల విఱిచి విఱిచి;
వార యాత్రికు లనుమోదవంతు లగుచు
వలచి భుజియించి రొగి బిండివంటకములు.

అమూలకమైన ఈ పద్యమును శ్రీనాథ మహాకవి ప్రశంసార్హముగ రచించినాడు. ఇందు బేర్కొన బడిన దివ్యవంటకములు ప్రతిభోజన వర్ణనమున తిరిగి తిరిగి చెప్పుట శ్రీనాథునకు ఆ వంటకములపైనున్న యిష్టమునే సూచించుచున్నదని భావించిన తప్పేమి? ఇందు చెప్పబడిన గోధుమ సేమియాలు, పూరీలు, ఖండశర్కరలు, పలుచని దోసెలు మొదలగునవి మరల మరల వర్ణింపబడుట చూడగలము. మరకతమణి పాత్రలోనున్న పాయసమును వర్ణించునట్టి ఈ క్రింది పద్యము శ్రీనాథుని స్వకపోల కల్పితము.

'అరుదుగ నపు డొక్కొక యెడ
మరకతమణిపాత్ర గగనమండలమయ్యెన్,
జిరువడముల పాసెము శశ
ధరుడయ్యెం, జుక్కలయ్యెం ద్రాక్షఫలంబుల్'

ఆ భోజన సమయములో నాశ్చర్యముగా నెల్లెడల పచ్చతాతి పళ్లెము గగనమండలమేకాగా, చిరు వడలములతోగూడిన పాయసము చంద్రుడయ్యెను. ద్రాక్షఫలములు చుక్కలవలె ప్రకాశించెను. ఇందలి రూపకాలంకారము హృదయాహ్లాదకరముగ నున్నది. శ్రీనాథుడిట్లు కల్పించిన వేరొక సీసమునను భోజన పదార్థములను మనోరంజకముగ వర్ణించుట చూడ నగును.

అమృత రసోపమంబైన కమ్మని యాన
వాల పాయసము జంబాల మయ్యె
మంచు లప్పల మించు మండెంగ మడుపులు
పొరలి లెట్టువగట్టు నురవులయ్యె
గప్పురంబులయొప్పు దప్పువట్టగజాలు
ఖండశర్కరలు సైకతములయ్యె,
గరుడపచ్చలచాయగల పచ్చ గందని
కూరలు శైవలాంకురములయ్యె,
నొలుపు బప్పులతీరంబు లురల బడగ,
బూరియలు లడ్డువంబులు పొరలిపొఱి,
విమలశాల్యోదనంబుపై వెల్లిమూపు
నాజ్యధారాప్రవాహసాహస్రములకు.

ఈ సీసమున చాయపప్పును గట్లుగను, బూరెలు, లడ్లును గండశిలలుగను, నేతిపోతలను ఏళ్లగను మనోహరముగ రూపించిన శ్రీనాథుని కవితా మహత్త్వము నేమని జెప్పవచ్చును! ఇందలి దేశీయమైన వంటకము లీనాడును తెలుగుదేశపు ప్రత్యేకతకు నిదర్శనములై నిల్చియున్నవి. ఈ సందర్భమున పాయసమును వర్ణించు శ్రీనాథుని స్వతంత్రరచనయైన పద్యము నుదాహరింపక తప్పదు.

'ఆదరణంబుతో నభిన
వాజ్య విపాండుర ఖండ శర్కరా
క్షోద సమన్వితంబుగ వి
శుద్ధ హిరణ్మయ భాజనంబులం
బైదలు లర్థిమై నిడగ
బంధుజను ల్భుజియించి రన్నపూ
ర్ణాదరహాసచంద్రదకిర
ణంబుల బోలెడు పాయసాన్నముల్.'

అన్నపూర్ణాదేవి లేతనవ్వు వెన్నెలలకు సాటియైన పాయసాన్నములను క్రొత్తనైన నేతితోను, తెల్లని పులకండపు బొడుముతోను గూడుకొనునట్లుగా మంచిబంగారపు పాత్రలలో కలిపికొని, బంధుజనులు ఆనందముతో భుజించు ఘట్టమును శ్రీనాథుడు రమ్యముగ వర్ణించినాడు.

ఆ సందర్భమున జెప్పిన మాంసాహార వర్ణనము మూలమున నున్నదేగాన ప్రత్యేకముగా నా విషయము నిట జెప్పబనిలేదు.

భోజన సమయమున శ్రీనాథు డతివేలముగా జెప్పిన శృంగార మసందర్భమని చెప్పుటలో తప్పు లేదు.

శ్రీనాథుని స్వతంత్ర గ్రంథములలో హర విలాసము ప్రధానమైనది. ఇందలి కథలన్నియునంతకు ముందు ప్రాచుర్యము వహించినవియేయైనను వేరు వేరుగానున్న ఆ శివమాహాత్మ్య ప్రతిపాదకములైన విషయములను సంగ్రహించి స్వతంత్ర రచనగా సంత రించిన కీర్తిని శ్రీనాథుడే దక్కించుకొన్నాడు. చిరు తొండనంబి తన కుమారుని వధించి వండి వడ్డించు ఘట్టము నాధారముగ గైకొని శ్రీనాథు డా వంటలను వర్ణించి తన చాకచక్యమును చక్కగా బ్రదర్శించి నాడు. మాంసమును వండు విధానమును శ్రీనాథుని నుండి నేర్చుకొనవలసినదే!

'మిరియము నుల్లియన్ బసుపు
మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గ
రాంబువు గమ్మని నేయి తైలమున్
బెరుగును మేళవించి కడు
బెక్కువిధంబుల బాకశుద్ధి వం
డిరి సిరియాలునిం గటికి
డెందమునం దరళాక్షు లిద్దఱున్'

ఈ పద్యమునుబట్టి మిరియములు, ఉల్లి పాయలు, పసుపు, మెంతులు, ఇంగువ, జీరకము మొదలగు సుగంధ ద్రవ్యములతోబాటు పంచదారయు, పెరుగునుగూడ మాంసమున నుపయోగింపవచ్చునని తెల్లమగుచున్నది. ఈ కాలమున నీ యాచారము పూగ్యము.

శ్రీనాథుడిట నిశితమైన పరిశీలన నొనర్చి నాడు. మాంసమునందు అన్నిసంగతులను పూస గ్రుచ్చినట్లు చెప్పుట గమనార్హము. మెత్తనిమాంస మునేగాక మూల్గులతోగూడిన ఎముకలను, నెత్తుటిని కాయగా వచ్చిన నల్లచారును ఈ క్రింది సీసమున జేర్కొనినాడు.

'కమ్మగా గాచిన కట్టునంజుళ్లను
నీరు వెళ్లగ నొత్తి నేత వేచి
చక్కగా దఱిగిన సన్నమాంసంబులు
పరిపాటిమై జట్టుబదనువండి
మూల్గులెమ్ములతోడ ముదుకగాకుండగ
జాదుచేసిన నల్లచారుగాచి
వలయు సంబారాలు వడియాలు బలియించి
దళమైన క్రొవ్వుతో దాల బోసి
షడ్రసోపేతములుగాగ జతురభంగి
నమృతపాకంబులుగజేసి రా క్షణంబ
సెట్టిసిరియాలు వంశాబ్ధి శీతకరుని
సతులు తిరువెంగనాంచియు జందనికయు.'

హరవిలాసముననే షష్ఠాశ్వాసమునగల సముద్ర మథనఘట్టమున కార్యసిద్ధికై దేవదానవులు కలిసి వినాయకున కర్పించిన వంటకములు చూడదగినవి.

'ఉండ్రాలు నూటిడి పుండ్రేకులుం దేనె
యనటిపండ్లుం బూరియలు ఘృతంబు
బెసరుబప్పును బాలు పెరుగోగిరంబులు
బాయసాన్నంబులు బానకములు
నాళికేరంపు బొండాలు మీగడయును
నవనీత పిండ ఖండములు గుడుములు
లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
నుండంబు చలిమిడి వుండపప్పు
లాదిగా భక్ష్యచోష్యలేహ్యాదులైన
బహుపదార్థంబు లర్పించి ప్రణతులైరి
వేలుపులు రాక్షసులును నా విఘ్నపతికి
దుగ్ధపాథోధి మంథనోద్యోగవేళ'

శ్రీ భీమేశ్వరపురాణమున ద్వితీయాశ్వాస ములో భోజన వర్ణనము విపులముగ నున్నది. అగ స్త్యుడు వ్యాసమహర్షిని కాశిబాసి వచ్చుటకు గారణ మడుగును. అపుడు వ్యాసుడు తాను కాశిని బాసిన కారణము జెప్పును. ఏడు దినము లన్నమున కెడ్డము పుట్టుటవలన శివుని భార్యకు శాపమిాయ బోవును. ఇంతలో పంచాశద్వర్ష దేశీయయైన స్త్రీ యొక్కెత వ్యాసుని భోజనమున కాహ్వానించును. శ్రీనాథ డీ సందర్భము నూతగాగొని పిండివంటలను కమ్మగా వర్ణించినాడు. వ్యాసుడు శిష్యులతోగూడి భోజనము

నకు గూర్చుండును. అరటియాకులు పెట్టబడినవి. ఇంకను భోజనము రాలేదు. ఆలస్యమును వారు భరింపలేకుండిరి. అందుకై వా రరటి యాకులను బరిశీలించుచుండిరా యన్నటుల శ్రీనాథుడాయాకులను వర్ణించినాడు.

'మొగి విరిసి కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపు బసిమియుగల లే
జిగురరటాకులు పెట్టిరి
దిగ దిగ నద్దేవి యాజ్ఞ దివ్య పురంధ్రుల్

ఎట్టకేలకు పదార్థములు వడ్డింపబడినవి. సమయము వచ్చినది. శ్రీనాథుడూరకుండునా! ప్రతి సూక్ష్మపదార్థమును స్పష్టముగ జెప్పినాడు.

'పప్పును బిండివంటలను
బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలుగాగ జుట్టునను గూర్పగ
గూడిన యేరు బ్రాలతె
ల్లప్పుర భోగి వంటకము
గమ్మని తాలిపు సాజ్జపిండితో
నొప్పలుగా భుజించిరి బుధోత్తము
లాకటి చిచ్చు పెచ్చునన్'

ఈ పద్యమున శ్రీనాథుడు జెప్పిన 'తాలిపు సాజ్జపిండి' వంటకమనునది ఈనాడు కానరాదు. ఈ పదార్థముల నింతటితో వదలక శ్రీనాథుడు తన కిష్టమైన పదార్థముల నింకొక పద్యములో నిరికించినాడు.

'ద్రాక్షాపానక ఖండశర్కరలతో
రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెగలతో
గ్రొన్నేతితో బప్పుతో
నక్షయ్యంబగు నేరుబ్రాల కలమాహారంబు
నిశ్శంకతం
గుక్షుల్ నిండగ నారగించితిమి
యక్షుద్రక్షుధాశాంతికిన్'

ఇంతటితో దృప్తిబడక మరల క్రింది వచనమున నిట్లు జెప్పినాడు.

'ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాక్షోదసికతాంచితంబును, బాయసాపూపసంపన్నం బగు కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీరక్షౌద్ర పుండ్రేక్షుఖండమండితంబును, రంభానారికేళఫలశాక సాకల్యకల్యంబును, షాడబరసావళీపానకప్రచురంబును, శరచ్చంద్రచంద్రికాధవళదధిసమృద్ధంబునునైన భోజనోత్సవంబు...'

ఇదే సందర్భమున కాశీఖండములో శ్రీనాథుడు జెప్పిన తెలుగు వంటకము లవశ్యము పరిశీలనార్హములు. ఇట దాదాపు నూఱు వంటకములు జెప్పబడినవి! ఆ పట్టికనందుగల లడ్డుకంబులు, నిడ్డెనలు గుడుములు, దోసియలు, సేవియలు, చక్కిలంబులు' మొదలగు కొన్నిపిండివంటలుమాత్రమే ఈనాడింకను మిగిలియున్నవి. మరికొన్ని మారుపేరులు సంతరించుకొని యర్థము గాకున్నవి.

శివరాత్రీ మాహాత్మ్యమున చతుర్థాశ్వాసములో నున్న ఈ పద్యమును నుదాహరింపక తప్పదు.

'జాతరచేసె బ్రాహ్మణుడు
చండికి కమ్మని పిండివంటతో
నేతులతోడ మద్దికడ
నిర్మలినాన్నముతో రసావళీ
చూతఫలాళితోడ వర
సూపముతో జిలునాలతోడుతన్
నీతులతోడ నప్పుడక
నిష్ఠతరంబగు నిష్ఠ పెంపునన్.'

క్రీడాభిరామమును శ్రీనాథుడు రచియింపక పోయినచో నా గ్రంథరచనమున శ్రీనాథుని చేయి యున్నదని స్పష్టముగా నిరూపించునవి భోజనమును వర్ణించు పద్యములేయని చెప్పవచ్చును. పూటకూటి యింటినిగూర్చి చెప్పినపుడు చమత్కారయుతమ్మైన పద్యములలో భోజనమునుగూర్చి చెప్పిన పద్యమును చూతము.

'కప్పుర భోగివంటకము
కమ్మనిగోధుమపిండి వంటయున్
గుప్పెడు పంచదారయును
గ్రొత్తగ గాచినయాలనేపెస
ర్పప్పును గొమ్మునల్లనటి
పండ్లును నాలుగు నైదునంజులున్
లప్పలతోడ గ్రొంబెరుగు
లక్ష్మణవజ్ఝలయింట రూకకున్'

భోజనపదార్థముల నింతరమ్యముగ వర్ణించిన మరియొక కవి లేడనుటలో నతిశయోక్తి లేదు! 'కప్పుర భోగివంటకము' 'గోధుమపిండివంట' 'ఆవునేయి' 'పెసరపప్పు' 'నంజులు' మొదలగునవి ప్రతిభోజన వర్ణనమునను చెప్పబడుట గమనార్హము.

అవి కవికి ఇష్టమైన పదార్థములని పాశ్చాత్య విమర్శనాపద్ధతి ననుసరించి చెప్పిన తప్పేమి?



లేఖలు:

# వచనకవితమీది విమర్శలు

సెప్టెంబరు 1971 భారతిలో ప్రకటితమయిన శ్రీ టి. యల్. కాంతారావుగారి వ్యాసం శ్రీనోరివారి వ్యాసానికి పరిశీలన. శ్రీ కాంతారావుగారి వ్యాసంలోకూడా సందేహాలు తీరనివిగా ఉన్నాయి.

(1) 'సమాజ జీవితానికి ఆనాటి సాహిత్యంలో స్థానం లేదనేది నిర్వివాదమయిన విషయం. ఆనాటి సాహిత్యం పరిమిత పరిధిలోమాత్రమే పరిభ్రమించింది. ఒక వర్గం ప్రయోజనాలకు అనుగుణంగా ఆనాటి సాహిత్యం వికసించింది—' పే. 37.

కుందుర్తి వాక్యాలకు వివరణచెప్పిన ఈ వాక్యాలు సందేహనివృత్తి చేయలేక పోతున్నాయి. ప్రాచీనకాలంలో సమాజజీవితం ఎలావుండేది? అప్పటి సాహిత్యం ఆనాటి సమాజజీవితానికి ప్రతిబింబంకాదా? పరిమిత పరిధిఅంటే ఎంతవరకు? వర్గ ప్రయోజనం అంటే ఎటువంటి వర్గం? తదితర వర్గాలెలావుండేవి? ఆ ఇతరవర్గాల స్థితిగతులను నిర్ణయించడానికి గల చారిత్ర కాధారాలేమిటి?

శ్రీ కాంతారావుగారే 'నవత' తృతీయ సంచికలో 'సమకాలీన — విమర్శలు — ఒక సమీక్ష' అనే వ్యాసంరాస్తూ—

'సమకాలీన సామాజిక జీవితం ప్రతిబింబించని సాహిత్య యుగంలేదు. అందువల్లనే పురాణకర్తల కాలంలో పురాణయుగమూ—భోగలాలసమైన కాలంలో ప్రబంధయుగమూ, జీవన సంగ్రామంలో అనేక సమస్యల్ని ఎదుర్కొంటున్న కాలంలో ఆధునికయుగమూ అవతరించినై. ఇలా సాహిత్య చరిత్రలో ఒక్కొక్క యుగం ఒక్కొక్క ప్రత్యేకస్థానం ఆక్రమించుకుంది. భావ గాంభీర్యంలోనూ, భాషా సౌష్ఠవంలోనూ, కథా సంవిధానంలోనూ, సంభాషణ నైపుణ్యంలోనూ, సమగ్రతనుకల్గి లక్షణయుతంగా రచింపబడి సాహిత్యచరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయిన పురాణప్రబంధాన్ని ఒక క్షణంలో కల్గిన భావాల కనుగుణంగా రూపకల్పన గావించిరాసే భావకవిత్వంతో పోల్చి వాటిల్లో కవిత్వంలేదని కించపరచడం అర్థంలేని విమర్శ అనిపించుకుంటుందేగాని సద్విమర్శ అనిపించుకోదు' (116 పే. నవత.) అని విభిన్నాభిప్రాయం ప్రకటించివున్నారు — అప్పటి యీ అభిప్రాయం ఇప్పుడు మారిందా? మారడానికి కారణమేమిటి? వారికి కానవచ్చిన నగ్నసత్యమేమిటి? ఎప్పటి సమాజాన్నో ఇప్పటి సమాజంతో ఊహించడమేమిటి?. ఇదంతా వారి నిష్పాక్షికతని ప్రదర్శిస్తుందా?

'ఏప్రయోజనం లేకుండా ఈ సమాజాన్ని పూర్తిగా విస్మరించి ఎక్కడో, ఎదో అలౌకికఆనందం ఉంది. దాన్ని పొందడమే కవితాపరమావధిఅని భావించే వారెవరైనా ఇంకా వుంటే వారి సంస్కారానికి నమస్కారం.'

38 పే. భారతి. సెప్టెంబరు 71.

కవిత్వం తాత్కాలికమా? సార్వకాలికమా? అనే ప్రసక్తి వచ్చినపుడు అలౌకికానందమే దాని పరమావధిగా భావించిన వారి సంస్కారాన్ని శ్రీ కాంతారావుగారు శంకించారు. ఇక్కడకూడా సంయమనంతో కొంత వివేచన అవసరం. కవిచేసిన ప్రతిరచనా కలకాలం నిలవదు. తాత్కాలిక ప్రయోజనాపేక్షఉంటే తత్ప్రయోజనానంతరం, ఆ కవిత్వం నిష్ప్రయోజనం అవుతుంది. ఆదరణ కోల్పోతుంది. సార్వకాలిక సత్యాన్ని ఏకొద్దిగానైనా ప్రబోధించే పద్ధతికల కవిత్వం కొన్నిశతాబ్దాలు నిరఘాటంగా నిలుస్తుంది. సాంఘికంగా జీవించగలగడం, ఎదురయ్యే ప్రతిబంధకాల నెదుర్కొనడంలో ప్రదర్శింపవలసిన మెలకువలు రూపించడం వంటివాటినిబట్టి భారత భాగవతాదులు నేటికీ ప్రచురంగా ఉన్నాయి. అవ్యక్తానుభూతి కల్గించే శక్తి అంతసూ\' ౦.గా ఏకవిత్వంలో అయినా

వుంటుంది. కవిత్వానికున్న ప్రయోజనా లన్నింటిలో ఏఒక్క ప్రయోజనమూలేకుండా ఏకవిత్వమూ వుండదు.

'పూర్వపు కవిత్వముయొక్క పరిధి సంకుచిత మని యింతకు పూర్వమే చెప్పాను. పూర్వపు కవిత్వము పండితాదరణీయమైనదేతప్ప జనాదరణీయమైనదికాదు.'

ఇందులోకూడా శ్రీ కాంతారావుగారు సంయమనంతో ఆలోచించలేకపోయారు.

ఏ కవిత్వానికయినా ఆ కవితాపరిమాణాలనిబట్టి పరిధి సంకుచితం కాకపోదు. కవిత్వం జనసామాన్యానికి అందుబాటులో ఉండాలిఅని అంటారు. భాషా సౌష్ఠవమూ, శైలీ, మొదలయినవి కవిత్వానికి పరిపుష్టి కూర్చడానికి అవసరాలనడంలో విప్రతిపత్తి ఉండదనుకుంటాను. నేటి సమాజ ప్రతిబింబమయిన వచనకవిత్వాన్ని, కర్షక, పారిశ్రామికాది సామాన్య ప్రజానీకం ఎంతవరకు వింటోంది? ప్రజలచేత హాహా! అని ఎంతవరకు అనిపించుకుంటోంది? న్యాయంగా ఆలోచిస్తే పూర్వం కవిత్వం ఎంతటి సంకుచిత పరిధిలో విస్తరించిందో ఇప్పటి ఱూ కవిత్వంకూడా అంతటి సంకుచిత పరిధిలోనే ఉండనాలి. ఇప్పుడుజరిగే కవితాగోష్ఠులు మొదలైనవాటికి వచ్చేవారు వీరనుకున్న సామాన్య ప్రజానీకమా?

'పండితాదరణ' అంటే కాంతారావుగారి దృష్టిలో సంస్కృతాంధ్రాలు చదివి పాశ్చాత్య వాఙ్మయ వాసనలేని శుద్ధ ఛాందసు లయినవారి ఆదరణ అని కాబోలు! అంతే అయితే వారిఅంచనా పొరబాటే. అనూచానంగావచ్చే సంప్రదాయాన్ని ఆదరించేవారే కాకుండా, భారత భాగవతాదులపై ఆస్థతో అనుసంధానం చేసేవారు, జెండాపై కపిరాజువంటి పద్యాలు పాడుకొనే ఆలకాపరులూ, శ్రీ కాంతారావుగారి దృష్టిలో లేరు. ఇది నిష్పక్షపాతమా!

'ఆధునిక భావాన్నికూడా ప్రాచీన పద్ధతిలో చెప్పవచ్చు అనుకోవడం అనుకోవడంవరకూ బాగానే ఉంటుందిగాని ఆచరణ సాధ్యంమాత్రం కాదు.' ఆధునిక భావాన్ని ప్రాచీన పద్ధతిలో చెప్పడానికి వీరు ప్రయత్నించారా? ప్రయత్నించి విఫలు లయారా? చేయితిరిగిన కవి తాను చెప్పేభావాన్ని ఏ పద్ధతిలో చెప్పినా అందంగానే వుంటుంది. దీనికి నిదర్శనంగా తిలక్‌పద్యాలే సాక్ష్యం.

'వచనగేయం సమస్తమైన ప్రజానీకంకోసం పుట్టింది. వారి ఆనందమే దాని గమ్యం. వారి జీవిత విధానాన్నీ, వారి జీవితంలోని ఆశా నిరాశల్నీ, వారిలోని నిస్తేజ ప్రవృత్తికి నివృత్తినీ చూపడమే వచన గేయంయొక్క పరమార్థం.'

ఈ నిర్ణయంకూడా తొందరపాటే. సమస్త ప్రజానీకంలో వుండే ధనిక వర్గానికిది ప్రాతినిధ్యం కాదు. అందుకని సమస్త ప్రజానీకం అనడం పొరబాటు. వారి ఆనందమే దానిగమ్యం అంటే వచనకవితా ప్రయోగంవల్ల, దాని ప్రాచుర్య ప్రాభవాలవల్ల ఇదివరకిటి పరిస్థితులు పూర్తిగామారి, అనుకూలపడి, వారికి ఆనందాన్ని కల్గించే పరిస్థితు లేర్పడతాయి అన్నది గగనకుసుమమే. ఆ విధంగామారిన సంఘటనలుగాని, మారుతూన్న రీతులుగాని ఇంతవరకు అశ్రుత పూర్వాలు—చదివి ఆనందించడంవరకే దాని పరిమితుంది గాని, అదొక కార్యసాధకంగా ఉన్నట్లు మనకి తెలియదు—

నాకు కల్గిన అభిప్రాయాన్ని తెలపడమే ఉద్దేశ్యంకాని కాంతారావుగారి వ్యాసాన్ని విమర్శించడం కాదు—వాస్తవాన్ని గుర్తింప వేడికోలు.

—ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు.

# గ్రంథ విమర్శలు

## మంచెన కేయూర బాహుచరితము

(ప్రకాశకులు : వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు; 4, మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మదరాసు. డెమీ 1/8 పే. 94 లు. వెల రు. 3/—లు.)

తిక్కనసోమయాజులకు సమకాలికుడగు మంచెన రచించిన కేయూరబాహుచరితము ఆంధ్రసాహిత్యములో విశిష్టతగల గ్రంథము. పూర్వము దీనిని శ్రీ కొచ్చెర్లకోటవారు, తర్వాత శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు సంస్కరించి ప్రచురించిరి. మరల నీ మధ్య ఆం. ప్ర. సాహిత్య అకాడెమీవారు శ్రీ గడియారము రామకృష్ణశర్మగారి సంపాదకత్వమున ప్రచురించిరి. శ్రీ శర్మగారు పూర్వముద్రణములనేకాక వ్రాతప్రతినిగూడ సంప్రదించి ఎంతో శ్రద్ధ తీసుకొని పాఠములు సవరించిరి. ఈ మూడు ప్రతులను పరిశీలించి ఈ ప్రతిని శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారు, తమ తాతగారు కీ. శే. వేదము వెంకటరాయశాస్త్రిగారు తమ ప్రతిలో వ్రాసుకొన్న సూచనలను అర్థములను జోడించి ఇప్పుడు ప్రచురించిరి. దీనివలన గ్రంథమునకు తాతగారి లఘుటీకలు మనకు తెలియవచ్చుటేకాక ఆ విద్వద్వరేణ్యుని వ్యక్తిత్వము కూడ కొంచెముకొంచెముగా సూచికలలో కనబడుచున్నందున ఈ గ్రంథమునకు ఇబ్బడివిలువ కలదు.

శ్రీ మనుమడు శాస్త్రిగారికి చరిత్రయందభిమాన మెక్కువగుటచే వారి యుపోద్ఘాతములో చారిత్రకాంశములు ప్రాధాన్యము వహించినవి. అందులో ఆనాటి చరిత్ర యెంతయో ఇమిడ్చినారు.

కావ్యము రెండవ పద్యములో 'కరిముఖు డశ్వినుల్ శ్రుతులు—'ఇత్యాదిగా నున్నదానిలో కవి వరుసగా 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, అనంతసంఖ్య సూచించి కవి తన శిల్పనైపుణ్యమును ప్రదర్శించెనని శ్రీ శర్మగారు తమ పీఠికలో వివరించిరి. దానివంటి చక్కని టీకలుకూడ ఈ గ్రంథములోచేర్చి యుండిన బాగుండెడిది. అధస్సూచికలు తాతగారి సూచికలకు మాత్రమే పరిమితములు కాలేదుగదా!

ఈ కృతి అవతారికలో పోతనకు కల్పిత కథతో అంటగట్టబడిన ప్రసిద్ధపద్యము కొద్ది మార్పులతో కనబడుచున్నది.

'బాల రసాల పుష్ప నవ పల్లవ
కోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పుడుపుఁగూడు
భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి మఱియంతకు
నాయతి లేనినాడు గౌ
ద్దాలికులైననేమి నిజదార
సుతోదర పోషణార్థమై'

ఈ పద్యము క్రిందనున్న సూచికలో, 'దీనినే కొద్దిమార్పులతో పోతన గ్రహించి యుండును. లేదా తర్వాతి వారైనను భాగవతమునచేర్చి యుండవలయును' అని మనుమడు శాస్త్రిగారు వ్రాసిరి. ఆ పద్యము భాగవత ప్రతులలోనిదిగాదు. పోతన చాటువుగా మాత్రమే ప్రసిద్ధము. ఇట్టి చిన్ని ప్రమాదముల ముందుముద్రణములలో సవరింపదగినవి.

ఎన్నో విశిష్టగుణములుకల ఈ కృతిపై ఆంధ్ర పాఠకలోకమునకు శ్రద్ధ హెచ్చింప జేయుటకు చేసిన శ్రీ శాస్త్రిగారి ప్రయత్నము సర్వథా శ్లాఘ్యతరము. గ్రంథము మంచి కాగితములమీద చక్కగా ముద్రితమైనది.

## ర ఘు వ ం శ ము

(అనువాదకులు ప్రకాశకులు : శ్రీ గుణ్ణము వేంకట సుబ్రహ్మణ్యము, వేదంవారి అగ్రహారము, నెల్లూరు. డెమీ 1/8 పే. 290 లు. వెల రు. 8/— కాలికో ప్రతి రు. 10/—లు.)

మహాకవి కాళిదాసు కృతులు కొన్ని ఇంతకు పూర్వమే కవి అనువదించి ప్రకటించినారు. ఇది రఘువంశమునకు అనువాదము. కాళిదాసువంటి మహా కవుల కావ్యములను అనువదించుటలో, యథామూల ముగా అతిక్రమణాదులు లేకుండ చేయుటయే ఉత్తమ మార్గము. ఆ మార్గమే ఈ అనువాదములో అవలం బింప బడుట ప్రమోదావహము. సంస్కృతము సుష్ఠుగారాని ఆంధ్రపాఠకులు కాళిదాసు కవిత్వ మహ త్త్వమును ఎంతవరకు ఆస్వాదింప సాధ్యమవునో అంత వరకు ఈ అనువాదములో సాధింపబడినది. ఎక్కడనో ఒక చోట మూలములోని ఒక శబ్దార్థము లోపించు టయు, పద్యపూర్తికొరకు ఏ విశేషణమో ఎక్కువ యుండుటయు సంభవించినవి కాని అట్టిదిలేకుండుట అసాధ్యమైన కార్యము. గ్రంథ ప్రవేశికలో స్వామి శివశంకరులు వివిధ వృత్తములలోఉన్న ఎన్నో మూల శ్లోకములను అనువాద పద్యములును ఉదాహరించి ఎంత చక్కగా మూలవిధేయముగా అనువాదము సాగి నదో ప్రదర్శించినారు. మరియు నందులో క్లుప్తముగా కాళిదాసునుగూర్చి ఇప్పటికి మనకు తెలియవచ్చుచున్న విషయములను పూర్తిగా ప్రస్తావించినారు. అందులో రఘువంశమే కాళిదాసు తుదిరచన యని పురాతత్త్వ వేత్తలందరు అంగీకరించినట్లు తెలిపి, 'లబ్ధ ప్రతి ష్ఠుడై చేయి తిరుగని కుర్రవానివలె అట్టి శ్లోక ములు చెప్పునా ? కావున ఆ పీఠిక ప్రక్షిప్త మన వలెను' అన్న మాటలతో ఏకీభవించుట మాత్రము కష్టము. లబ్ధ ప్రతిష్ఠుడును చేయితిరిగిన వాడును అగుటచేతనే ప్రాప్తించిన వినయాతిశయముచేతనే రఘువంశపీఠిక వ్రాసినాడని భావించుట యుక్త తరము.

శ్రీ సుబ్రహ్మణ్యముగారు విజ్ఞప్తిలో రఘు వంశమంతయు చదివిన తర్వాత 'పుస్తకము మూసి నంతట నా మనస్సునందు మూతవడక నిల్చు చిత్త రువులు' అనుచు 10 దృశ్యములను పేర్కొని నారు. వానినిబట్టియే కవికి కాళిదాసు ఉదాత్త కవితా శిఖరము అధిరోహించిన ఘట్టములు కరతలామల కములని విస్పష్ట మగుచున్నది. ఎట్టి ఉన్నతాదర్శ ములతో కవి ఈ అనువాదమునకు పూనుకొనెనోకూడ దానివలన చూచాయగా తెలియవచ్చుచున్నది. వారు పేర్కొనిన 10 ఘట్టములకు తోడు, చివరకు వర్ణింపబడిన రఘువంశరాజు అగ్నివర్ణుడు భోగలాల సుడై క్షయవ్యాధితో మరణింపగా అతని అపరకర్మ లను గూఢముగా జరిపించి మంత్రులు గర్భిణియైన రాజుధర్మపత్నిని కోసలాధిపత్యమునకు పట్టాభి షేకముచేసిన దృశ్యముకూడ చేర్చుట యుక్తమని పించినది. భోగలాలసుడై ప్రజాపాలనమునందు అశ్రద్ధవహించిన సమకాలికుడైన రాజు కెవరికో రఘువంశరచనతో శ్రేయస్సునుపదేశించెనేమో యని పించును.

గ్రంథాంతమందు రఘువంశములో వర్ణితు లైన రాఘవుల పట్టిక దిలీపునినుండి అగ్నివర్ణుని వరకు ఈయబడినది. మహాకావ్యము పూర్తిగా చదువు నోపిక లేనివారికది మిక్కిలి ఉపయోగించును. చదువు వారికిని సమగ్రజ్ఞానమును దృఢతరము చేయును.

మూల శ్లోకమునకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క పద్యముగా అనువాద మున్నది. మూలములోని ఛంద ములలోనే అనువదింపవలెనను అసిధారావ్రతచర్యకు కవి పూనుకొనక యథాసంభవముగా ఆంధ్రఛ్ఛందస్సు లను కవి గ్రహించినారు.

రఘువంశమునకు మంచి అనువాదమును ఆంధ్ర పాఠకులకు అందించిన శ్రీ సుబ్రహ్మణ్యకవిని, దీని ప్రకటనకు కొంత ద్రవ్యసహాయముచేసిన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడెమీవారిని అభినందించు చున్నాము.

## శ్రీ కామ సంజీవనము

(కవి : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి, ప్రాప్తి స్థానము : శ్రీ కూచిభట్ల వీరరాఘవశాస్త్రి, కళ్యాణి

ప్రెస్, తెనాలి. క్రౌను 1/8 పే. 352 లు. వెల రు. 6/—లు.)

బ్రహ్మాండపురాణాంతర్గతమని ప్రసిద్ధికల 'లలితోపాఖ్యానము'న కిది స్వతంత్రాంధ్రీకరణము. అది హయగ్రీవుడు అగస్త్యమహర్షికి ఉపదేశించి నట్లున్నది. గ్రంథము తారకాసుర విజృంభణముతో ఆరంభమై తారక సంహారముతో సమాప్త మవుచున్నది. ఐనను, ఇందులో హరనేత్రాగ్నిసందగ్ధుడైన కాముని భస్మమునుండి రూపొందింపబడిన భండాసురునితపస్సు, విజృంభణము, అతని సంహారమునకై చిదగ్ని కుండమునుండి లలితాంబికా ప్రాదుర్భావము, లలితాసేనలు భండుని శూన్యకముపై దండెత్తుట, ఉభయసేనల మధ్య ఘోరాద్భుతమైన యుద్ధము, భండాసురవధ, ఆ పిమ్మట కాముడు లలితాంబికా కటాక్షముచేత సంజీవితుడగుట — అను కథాభాగము ప్రాముఖ్యము వహించుటచే మూలగ్రంథ నామమగు 'లలితోపాఖ్యానము' వలెనే, ఆంధ్ర కావ్యమునకు కవిపెట్టిన 'శ్రీ కామ సంజీవనము' అను నామమును సార్థకముగా నున్నది.

'శ్రీ మాతా శ్రీ మహారాజ్ఞీ
శ్రీమత్సింహాసనేశ్వరీ
చిదగ్నికుండసంభూతా
దేవకార్య, సముద్యతా'

అని ప్రారంభమై 'హరనేత్రాగ్ని సందగ్ధ కామసంజీవనౌషధిః' అని 33 వ శ్లోకముతో అంతమగుచున్న శ్రీ లలితా రహస్య నామస్తోత్ర ప్రథమ భాగములో సూత్రప్రాయముగా నున్నదానికి ఈ గ్రంథము విస్తృత వివరణ రూపముగా నున్నది. యోగమంతటికి మూలమైన భూతశుద్ధిప్రక్రియలో పాపపురుషుని దహనముచేసి దివ్యదేహము కల్పించుకొనుటే అద్భుత కథారూపముగా మనోహరముగా లలితోపాఖ్యానములో మహర్షులు నిక్షేపించినారనికూడ భావింపవచ్చునేమో ! సంజీవితుడైనకాముని కవి ఈ విధముగా వర్ణించినాడు.

'అమృతరసాభిషిక్తకమయౌ
శివకామసఖీకృపాకటా
క్షమున మహాద్భుతక్రమ
వశంవదనవ్యనిరూఢితోడ నా
సమయమునన్ జనించె
సరసస్మయమానముఖాంబుజంబుతో
సుమశరశేఖరుండు
జిగిసొంపున తొల్లిటికన్న మిన్నయై'

(5—170)

అట్లు సంజీవితుడైన కామునికి అభయమిచ్చి మరల లలాటనేత్రునిపైకి,

'నిగిడి లలాట నేత్రుడును
నీ విరివాడియలుంగు పోట్లకున్
మిగుల గలంగి యొందు ప్రతిమేరకు
నేరక మోహవాగురం
దగిలి తుషారభూధరసుతా
మృదుపాణిసరోరుహంబు బ్రా
తిగొని దైవవాంఛితము
దీరుచు నింక విశంక వృత్తితోన్'

(5—176)

అనుచు లలితాంబిక పంపినది. ఈ మారు

'పలుమరు గామ వీరవరు
పాయని తీయని వింటిత్రాటి తే
టుల బలుమ్రోత ఝుమ్మని

తటుక్కున వీనులలోన బిట్టు వా
ర్వలుక గలంగు డెందమున
బాసిధృతిన్ శశిమౌళి పువ్వు ట
ల్కలజడి ధాటి దూటువడి
కుందు మెయిం గొనె విహ్వలత్వమున్'

(5–189)

ఆ తర్వాత పార్వతీపరమేశ్వరుల పరిణయము, విహారము కొంచెము విస్తృతముగాను, కుమార జననము, తారకా సంహారము బహుసంక్షేపముగాను వర్ణింపబడినవి. ఈ కామసంజీవనము లేనిది పార్వతీ పరిణాయాదులే అసంభవములు. ఇట్లు ఉజ్జీవితుడైన కామునిగూర్చి లలితాంబిక ఇట్లనుచున్నది.

'నిరత మదృశ్యమూర్తివయి
నేడు మొదల్ కడు నిండి యెల్లెడన్
సురుచిర శుభ్ర సుందర
మనోజ్ఞ కలా సుకుమార మంజుల
స్ఫురణలతో నమోఘరతిమోహనలీలల
ముంచి యెత్తుచున్
సరసత నెల్లప్రాణుల మనం బలరింపు
మపూర్వ నిర్వృతిన్.' (5–179)

ఇట్టి భాగములు చదివినప్పుడు అమలిన ప్రేమ బుషులకెంత అభిమాన పాత్రమో తెల్ల మగును.

సంస్కృత మూలము 40 అధ్యాయములలో పురాణశైలిలో ఉన్నది. దీనిని ఆంధ్రీకరణమున శ్రీ శాస్త్రిగారు 5 ఆశ్వాసములుగా విభజించినారు. అనువాదములో కవి—కవిత్రయపద్ధతి ప్రధానముగను శ్రీనాథుని మార్గము కొంతవరకును అవలంబించిరి. ధర్మాదు లెక్కువగాఉన్న మొదటి ఐదధ్యాయములు పూర్తిగా వదలివేయబడినవి. పురాణ రూపముగా ఉన్న మూలమును కథాస్వరూపమునకు భంగము రాకుండ రెండువిధముల పెంచినారు. ఒకటి కవి యవతారికలో నిట్లు తెలిపిరి.

'తారకోదంతమున కామదహనమునను
రాయబారమ్మునం బెండ్లి ప్రాభవమున
గొంటి నొకకొన్ని ఘట్టముల్ కూర్పునందు
గాళిదాస మహాకవి కావ్యమందు' (1–59)

రెండవది వర్ణనాదులలో మధ్య మధ్య మనో జ్ఞముగ స్వతంత్రముగా విస్తరించుట. ఈ విధముగా పురాణకథకు అనువాదములో కావ్యత్వము సిద్ధింపజేసి నారు. నామకరణములోనే కవికున్న మహాకావ్యదృష్టి వ్యక్తమగుచున్నది.

ఈ గ్రంథానువాదమునకు శ్రీ గట్టివారు సర్వ విధముల యోగ్యత కలవారు. మూలములో ఆఖ్యాన రూపముగాఉన్న శ్రీవిద్యారహస్యములను తొణకకుండ తెచ్చుటకు ఈ గ్రంథ మారంభించునాటికే కవి శ్రీవిద్యాదీక్షితులు, శ్రీ హయగ్రీవాపరావతారులైన శ్రీ కళ్యాణానందభారతీస్వాములవారి శిష్యులు, మరియు సంస్కృతాంధ్రభాషలలో విద్వాంసుడై అనేక గ్రంథములు ఆంధ్రీకరించియు, స్వతంత్రముగా రచించియు నుండిన 'కవితావతంసుడు !'.

శ్రీ దేవీ ప్రసాదము పూర్తిగా నావహించుట చేతనే కవి ఈ గ్రంథరచనకు పూనుకొనిరి. ఎన్నో గ్రంథములు రచించియుండిన ఈ కవి కవితాపరిణతి ఈ గ్రంథములో ఉత్తమకోటికి చేరుకొన్నదిగనుక ఆద్యంతము కావ్యరాజముగా రూపుగొన్నది. శృంగారము, వీరము, రౌద్రము, కరుణము, శాంతము, అద్భుతము ఆయాఘట్టములలో రసత్వమునొందినవి.

శ్రీవిద్యోపాసనమునకు ధ్యేయముగా భావింప బడు పరమహంస సన్యాసమును కవికి ప్రాప్తించినది.

దీనిని ప్రస్తుతము సన్యస్తులైన కవి అను మతిపొంది ప్రచురింప బూనుకొన్న శ్రీ ప్రఖ్య సమీర కుమారదేవులను, దీని ప్రకటనమునకు ద్రవ్యసహాయము చేసిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారిని అభినందించు చున్నాము.

తెనాలి కళ్యాణిప్రెస్సువారు అందముగా అచ్చు తప్పులు ఎక్కువలేకుండ తీర్చినారు. ఆ. 1 ప. 270 చివరి పాదములోని అచ్చుతప్పు ముఖ్యముగా సవరింప వలసినది.

ఈ మధ్య ప్రచురింపబడిన ఆంధ్రకావ్యము

లలో ఇది అద్వితీయమైన దనుటకు సందేహములేదు. ఈ శ్రీ కామసంజీవనము ఆంధ్ర కవితాభిమానులకును శ్రీవిద్యాభిమానులకును అవశ్య పఠనీయము !

## Span of Life

(స్పాను ఆఫ్ లైఫు)

(గ్రంథకర్త, ప్రకాశకులు : శ్రీ గోవిందు శ్రీరామమూర్తి, ఎం. ఏ., ఎఫ్. ఏ. డైరెక్టరు, భారత అస్ట్రాలజీ ఇన్స్టిట్యూటు, 7—2—28, న్యూకాలనీ, శ్రీకాకుళం (ఆం. ప్ర). డెమీ 1/8 పే. 196 లు. వెల రు. 9/లు. ఇండియా, డిలక్సు రు. 12/లు)

జ్యోతిషము సిద్ధాంతము, ముహూర్తము, జాతకము అను మూడు భాగములుగా గ్రహింపబడు చున్నది. వీనిలో జాతక భాగములో ద్వాదశ భావములు ప్రసిద్ధములు. వానిలో ఆయుర్భావము ప్రధానమైనది. ఈ గ్రంథము ఆంగ్ల భాషలో ఆయుర్భావ సర్వస్వముగా రూపొందించుటకు గ్రంథకర్త యత్నించినారు.

ఇది 15 అధ్యాయములుగా విభజింపబడినది. వరుసగా బాలారిష్టయోగములు, అరిష్టయోగభంగములతో మొదలై తుదిఅధ్యాయములో 6 జాతక చక్రములు వాని ఆయుఃఫలములతో వివరింపబడినవి. తక్కిన అధ్యాయములలో ఆయుర్దాయ విషయమున మన పూర్వు లవలంబించు వివిధపద్ధతులును కొన్ని పాశ్చాత్యపద్ధతులును ఈయబడినవి. ఏ సందర్భములలో ఏ పద్ధతి అవలంబింపదగునో స్వానుభవముచే సూచనలు గూడ చేసిరి.

గ్రంథకర్త విశేషముగా శాస్త్రజ్ఞానానుభవములుగలిగి భరతభూమిలోను అమెరికా మొదలగు విదేశములందును గౌరవము లందినవారు. జ్యోతిర్విద్వాంసు లెందరో పీఠికాదులతో దీని నగ్గించియుండుట గ్రంథప్రశస్తికి తార్కాణము. 1949 లో ప్రథమమున ముద్రింపబడి మార్పులు చేర్పులతో నిది మరల 1971 లో ప్రచురింపబడినది. జాతకభాగమందు ప్రత్యయముగలవారికి ఆయుర్భావము నిర్ణయించుటకీ గ్రంథమెంతయు ఉపయోగపడగలదు. గ్రంథకర్త ఉపోద్ఘాతములో నిట్లు వ్రాసిరి :

'This Book is meant to convince the moderns that astrology is as good a science of practical use to every one as any other science, provided that pains are taken to investigate into its grand truths by the ancient intellectual gaints—the Maharshis of India.'

కాని గ్రంథపరిశీలనచేసిన మాబోంట్లకే జాతక భాగము అర్థముకాదను సందేహమును, సయన్సు కాదను నిశ్చయమును దృఢతరమైనవేగాని తొలగ లేదు. వేదాంగజ్యోతిషకారుని ప్రతిజ్ఞ ఇది :

'కాలజ్ఞానం ప్రవక్ష్యామి
లగధస్య మహాత్మనః
జ్యోతిషా మయనం కృత్స్నం
ప్రవక్ష్యామ్యనుపూర్వశః
విప్రాణాం సమ్మతం లోకే
యజ్ఞకాలార్థ సిద్ధయే.'

ఎవరేమిచెప్పినను, జాతకఫలములు చెప్పుటకు శాస్త్రముకంటె యోగసాధనతోగూడిన అనుభవమే ఎక్కువ రాణించుచుండుట చూచుచున్నాము.

ఈ గ్రంథము అమెరికా మొదలగు విదేశీయులలోగూడ ప్రచారమునకు ఉద్దిష్టమైనది. గ్రంథమునకు అట్టమాత్రము ఆకర్షకముగా ఉన్నది. అచ్చులో ఎన్నోతప్పులుండుట శోచనీయము. ఆంగ్లభాషకూడ నిర్దుష్టముగాలేదు.

## కళ

(సంపాదకులు : శ్రీ చలసాని ప్రసాదరావు, ప్రకాశకులు : భారత కళా పరిషత్, 70/2 ఆర్. టి. ప్రకాశంనగర్, హైదరాబాదు—16. క్రౌను 1/4 పే. 170 లు. వెల రు. 5/—లు.)

ఇది ఆద్యంతము ఉత్తమకళా ప్రచురణము. అందును శ్రీ కె. కె. రంగనాథాచార్యులుగారి సంకలన వ్యాసాలు, కళా పరిణామం, రూపభేదం, ప్రమాణాలు

భావయోజనం, లావణ్యం, సాదృశ్యం, వర్ణికాభంగం, ఏడున్నూ, శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారి 'భూమి బంధం' అనే వ్యాసమున్నూ అత్యంతము అమూల్య మైనవి. వానిలో శిల్పరత్న, సుప్రభేదాగమము, విష్ణు ధర్మోత్తర పురాణము, అభిలషితార్థ చింతామణి, సమరాంగణ సూత్రధార, మంజుశ్రీ మూలకల్ప వంటి ప్రాచీన గ్రంథాలలో నిక్షేపింపబడిన శిల్పచిత్రకళా లక్ష్య లక్షణాలను సేకరించి సాధ్యమైనంతవరకు ప్రత్యేక శీర్షికలక్రిందికితెచ్చి ఏకముఖము కావించి, మన ప్రాచీన శిల్పులకు చిత్రకారులకు రేఖామాత్ర ముగా మార్గదర్శకములుగా ఉన్న సూత్రాలనేగాక సాధనకు అవసరములైన ఎన్నో విషయాలను క్రోడీ కరించి ఈ గ్రంథములో మన కందిచ్చినారు. ఇటు వంటి ప్రయత్నము ఆంధ్రదేశములో నింతవరకు జరిగియుండలేదు. మన ప్రాచీన శిల్పమును చిత్ర కళను తెలిసికొనగోరు జిజ్ఞాసువులకును విమర్శకుల కును ఈ గ్రంథము అవశ్య పఠనీయమేకాక మరల మరల సంప్రదించి మననము చేయదగిన ఉత్తమ గ్రంథము.

గ్రంథముకూడ మంచి కాగితముమీద అంద ముగా కూర్చి ప్రకటించినారు. ప్రతి పేజీ మార్జి నులో ఏదో ఒక ప్రాచీన శిల్పరేఖా ప్రతికృతి చేర్చి చూపరకు విందు కూర్చినారు. 49 రేఖాచిత్రములు 170 పేజీలకు పంచుటలో కొన్ని మరల మరల వేయవలసి వచ్చినది. ఆ చిత్రముల వివరణమును గ్రంథాంతమందు ఈయబడినది.

అచ్చుకూర్పు అందముగా ఉన్నను ఎన్నో తప్పులు—ముఖ్యముగా సంస్కృత శ్లోకములలో–వచ్చి నవిగాక! అట్టి స్వల్పదోషములు ఈ గ్రంథములోని అనల్ప గుణరాశిలో గణింపదగినవి కావు.

ప్రాచీనశాస్త్రాలు—ఆధునిక దృక్పథం అని చివరను శ్రీ యస్. వి. యస్. రావుగారి వ్యాసము మనకు ఆలోచనలను ప్రేరేపించునదిగా ఉన్నది. ఇట్టి ఉత్తమ గ్రంథమును ప్రచురించిన భారత కళాపరి షత్తువారిని సహృదయులందరు హృదయపూర్వకముగా అభినందింపవలసి యున్నది.

—నోరి నరసింహశాస్త్రి.

## చంద్రిక కథ

(మూలం : సుబ్రహ్మణ్య భారతి; తెలుగు సేత: గోపాల—కృష్ణ—రాఘవన్ : ప్రచురణ : బంగోరె, సహాయసంపాదకుడు, జమీన్‌రైతు, నెల్లూరు—1; Lii+86 పేజీలు; వెల. రూ. 2—50 పై.)

తెలుగు మహాపురుషుడు వీరేశలింగంపంతులు గారిని పాత్రగా తీసుకొని ఆధునిక తమిళ మహాకవి సుబ్రహ్మణ్యభారతి వ్రాసిన తమిళ నవల యిది. అసంపూర్ణంగానే నిలిచిపోయింది. గోపాల—కృష్ణ—రాఘవన్ అను ముగ్గురు కలసి తెలుగులోనికి తీసికొని వచ్చారు. తమిళ మహాపురుషుడు భారతి మన తెలుగు మహాపురుషుడు వీరేశలింగంగారిని పాత్రగాచేసుకొని నవల వ్రాయటం ఆనందదాయకమైన సంగతి. వీరేశ లింగం పంతులుగారు సుబ్రహ్మణ్యభారతి ఇద్దరూ ఒకేకాలంలో కొన్నాళ్లు మద్రాసునగరంలోఉన్న నిదర్శనాలున్నాయి. వీరిరువురూ స్నేహితులయినదీ లేనిదీ, అసలు ఒకరినొకరు కలుసుకున్నదీ లేనిదీ, వీరేశలింగం పంతులుగారిని పాత్రగా తీసుకోవాలన్నంత గాఢమైన కోరిక భారతిగారికి కలగడానికి కారణా లేమిటో స్పష్టంగా తెలియటంలేదు. శ్రీ బండి గోపాల రెడ్డి యీ విషయంలో మిక్కిలి పరిశ్రమించి ఆ మహాపురుషు లిద్దరికీఉన్న సంబంధాన్ని తెలుసుకోవ టానికి ప్రయత్నించారు. కాని వారిరువురి స్నేహ బంధం ఎంతవరకు అనేది అజ్ఞాతంగానే ఉండి పోయింది.

'చంద్రికకథ'అనే యీ నవలలో వీరేశలింగం పంతులుగారూ, ఆయిన భార్య రాజ్యలక్ష్మమ్మా, ఆనాటి 'స్వదేశమిత్రన్' పత్రికాధిపతి, దేశభక్తుడూ అయిన జి. సుబ్రహ్మణ్యయ్యరుకూడ పాత్రలు. వీరేశ లింగం పంతులుగారు భారతిగారిని కలుసుకున్న దాఖలా లేమీ లభించటంలేదు. ముఖ్యంగా వారి 'స్వీయ చరిత్ర'లో భారతిగారి ప్రస్తావన లేనేలేదు. తనకు

ఆప్తమిత్రుడై ఉంటే కనీసం చెప్పిఉండరా? వీరేశలింగంగారి డైరీలూ, లేఖలూగూడ మనకేమీ సహాయపడటంలేదు. కాని బండి గోపాలరెడ్డిగారివంటి పరిశోధకులు పూనుకుంటే వారిద్దరి స్నేహసంబంధాన్ని గూర్చిన వివరాలు మునుముందైనా తప్పక లభింపవచ్చు. ఏమీ లేకపోతే భారతిగారు వీరేశలింగంగార్ని ప్రముఖపాత్రగా తీసుకొని నవల ఎందుకు వ్రాస్తారు?

ఈ అసంపూర్ణ నవలతోపాటు వీరేశలింగంగారిని గుఱించి శ్రీ కె. వి. రమణారెడ్డి; శ్రీ సుబ్రహ్మణ్య భారతి గుఱించి డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారలు రచించిన వ్యాసాలనుకూడ జతచేర్చారు. తెలుగు, తమిళజాతి మహాపురుషుల సంబంధాన్ని తెలుసుకోవాలని దీక్షతో పరిశోధించి, సాధించినవి స్వల్పమైనా బండి గోపాలరెడ్డిగారు ముందుమాటలలో ఆయన చేసిన ప్రయత్నాలను వివరిస్తూంటే చదువరులు ముగ్ధులై ఆ పరిశోధనా పద్ధతిని ప్రశంసించి, గోపాలరెడ్డిగారిని కొనియాడగలరు.

'వేలాంగుడి' అనే గ్రామంలో వచ్చిన భూకంపంతో ఆరంభమౌతుంది నవల. భూకంపం తరువాత గోమతి అనే స్త్రీ ప్రసవించి ఆడపిల్లను కని, ఆ బిడ్డను తన ఆడబిడ్డ బాలవితంతువు అయిన విశాలాక్షికి అప్పగించి, విశాలాక్షిని మళ్లీ పెళ్లిచేసుకొమ్మని ప్రోద్బలంచేసి తరువాత చనిపోతుంది. విశాలాక్షి ఆ బిడ్డను వెంటనిడుకొని కొన్నాళ్ల తరువాత ఆ గ్రామం విడిచిపెట్టి చెన్నపట్నంలోని 'స్వదేశమిత్రన్' పత్రికాధిపతి సుబ్రహ్మణ్యయ్యర్ ఆశ్రయాన్ని పొందుతుంది. ఆయన విశాలాక్షికి నూరు రూపాయలిచ్చి ఆదుకుంటాడు. కాని ఆమె తనను యోగ్యుడైన వరునికిచ్చి వివాహం చెయ్యవలసిందిగా కోరుతుంది. ఆయన ఆపని తనవలన కాదనీ 'రాజమహేంద్రవరంలో నామిత్రు లొకరున్నారు. వారి పేరు వీరేశలింగం పంతులు. వారు వితంతువులకు పునర్వివాహాలు చేయడంవంటి స్త్రీజనోద్ధరణ కార్యక్రమాలలో అత్యంత శ్రద్ధాళువులై కృషిచేస్తున్నారు నీకొక జాబిస్తాను. వారివద్దకువెళ్లి చూపించు' అని చెప్తాడు. ఆమె ఆలేఖతో రాజమహేంద్రవరంవెళ్లి వీరేశలింగంగారు మద్రాసులోనే ఉన్నట్లు తెలుసుకొని తిరిగివస్తుంది. వీరేశలింగం దంపతులు ఆమెను కన్నబిడ్డవలె ఆదరిస్తారు. డిప్యూటీ కలెక్టరుద్యోగం చేస్తున్న గోపాలయ్యంగారనే వరుడున్నాడనీ ఆయన మాంసం తింటాడనీ, త్రాగుబోతనీ చెప్తారు. విశాలాక్షి గోపాలయ్యంగారి సంబంధానికి యిష్టపడి ఆయన వ్యసనాలను దిద్దుకోగలనని చెప్పగానే ఆయనతో ఈ వ్యవహారం మాట్లాడతారు. కాని విధి నిర్ణయం వేరన్నట్లు గోపాలయ్యంగారు విశాలాక్షితో వచ్చిన బిడ్డ 'చంద్రిక'ను ఎత్తుకొని ఆడిస్తున్న పనిమనిషినిచూచి, ఆమెయే వధువనుకొని ప్రేమించి, ఆమెనే పెండ్లి చేసుకోవా లనుకుంటాడు. గోపాలయ్యంగారు నిజంగా పనిమనిషినే ప్రేమించినట్లు తెలుసుకొని బ్రాహ్మణుడైన ఆయనకు, యాదవకులానికి చెందిన పనిమనిషికీ వివాహం జరిపిస్తారు.

విశాలాక్షి సోమనాథయ్యర్ అనే బంధువుల యింటికి చేరుకొంటుంది. అక్కడ కంచె చేను మేసినట్లు ముసలివాడైన అయ్యరు విశాలాక్షిని బలవంతంచేసి ఆమె యౌవనాన్ని అపహరించజూస్తే— విశాలాక్షి అతడిని త్రోసివేసి, బయటకుగెంటి మరొక బంధువులయింటికి చేరుకొంటుంది. అక్కడ ఆమెకు ఒక బాలసన్యాసి నిత్యానందస్వామి తటస్థపడతాడు. ఆయన విశాలాక్షిని చూచిన తరువాత ఆమెను ప్రేమించి, తన సన్యాసాశ్రమాన్ని వదలిపెట్టి ఆమెను పెండ్లి చేసికొంటానని చెప్తాడు. ఆమె వీరేశలింగం పంతులుగారి సాయంతో బ్రహ్మసమాజంలోచేరి వివాహం చేసికొంటుంది. నిత్యానందస్వామి విశ్వనాథశాస్త్రి అని పేరు మార్చుకొని విశాలాక్షితో సుఖజీవనం చేస్తుంటాడు. లౌక్యప్రపంచంలోనూ ఆయన ప్రయోజకుడనే అనిపించుకుంటాడు. కాని దురదృష్టవశాత్తు అతడు మానసికవ్యాధికి గుఱియై మతిచలించి ఎలాగో జీవిస్తూఉంటాడు. మళ్లీ సోమనాథయ్యర్ కుటుంబ జీవితాన్ని వర్ణిస్తూ ... అసంపూర్ణంగా యీ నవల ముగిసిపోతుంది. 'చంద్రికకథ' అని చెప్పదగినది ఏమంతగా యిందులోలేదు. నవలాశిల్పమూ నేటి నవలలతో పోలిస్తే ఏమంత ఉన్నతమైనదేమీ కాదు. కాని మహారచయితలలో కనిపించే

శైలిలోని సాదాతనం యీ నవలలోను గోచరించి చదువరులకు ముచ్చట గొలుపుతుంది. ఏమంత ఎక్కువ దూరం కథ సాగిపోవనందున శ్రీ భారతి యీ నవలను ఏ విధంగా ముగించదలచుకొన్నారో దురూహ్యం.

ఈ నవలను తెలుగుజాతికి సమర్పిస్తూ శ్రీ గోపాలరెడ్డి వీరేశలింగంగారికి సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలనుగూడ వెల్లడించారు. అవి 'వీరేశలింగం సంఘ సంస్కరణ' అనే విషయంపై అమెరికా విస్కాన్సిన్ యూనివర్సిటీ వారిక్రింద జాన్ లియొనార్డ్ అనే అమెరికన్ యువకుడు పి. హెచ్. డి తీసుకున్నారు. ఆయన ఆ గ్రంథాన్ని హైదరాబాదులో ఉండి రివైజు చేస్తున్నారనీ బహుశా అది త్వరలో వెలుగు చూడవచ్చుననీ చెప్తున్నారు. రెండవ విషయం కొడవటిగంటి కుటుంబరావుగారిచేత సంక్షిప్తం చేయబడిన 'వీరేశలింగంగారి స్వీయచరిత్ర'ను నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు అన్నిభారతీయ భాషలలోనికి అనువాదం చేయించి ప్రకటిస్తున్నారు. మూడవ సంగతి డి. ఆంజనేయులుగారు నేషనల్ బుక్ ట్రస్ట్‌వారికి వీరేశలింగంగార్నిగూర్చి ఆంగ్లంలో గ్రంథాన్ని వ్రాసిచ్చారని తీది అచ్చువుతున్నదనీ.

ఆంధ్రజాతి యుగపురుషుడైన వీరేశలింగంగారి జీవితమూ, రచనలపైనను, సమకాలికులు, ఇతర భాషలవారూ ఆయనను అర్థంచేసుకున్న తీరును; సత్యాన్వేషణే పరమార్థంగా పరిశోధనను సాగించిన బండి గోపాలరెడ్డిగారి కృషిని ఎంతైనా ప్రశంసించవలసిఉన్నది. మొట్టమొదటి కన్యాశుల్కాన్ని ప్రచురించినట్లుగానే భారతిగారి అమూల్యగ్రంథమైన 'చంద్రికకథ'నుగూడ ప్రచురించి గోపాలరెడ్డిగారు తెలుగువారి కృతజ్ఞతలకు పాత్రులౌతున్నారు.

—రామ మోహనరాయ్.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street,
Madras-1. Editor : S. Sambhu Prasad.